సాధన గ్రంథ మండలి, 54.

# గీతా కదంబము

## ప్రథమ దళము

అనువాదకుడు

గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి.

# సాధన పంచకమ్

## శ్రీమ దాచార్య స్వామి విరచితమ్

వేదో నిత్య మధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్,
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతా
మాత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహా త్తూర్ణం వినిర్గమ్యతామ్. ౧

సంగః సత్సు విధీయతాం భగవతో భక్తి ర్దృఢా ధీయతాం
శాంత్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్,
సద్విద్వా నుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకా సేవ్యతాం
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్. ౨

వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరఃపక్షః సమాశ్రీయతాం
దుస్తర్కాత్ సువిరమ్యతాం శ్రుతిమత స్తర్కోఽనుసంధీయతామ్,
బ్రహ్మైవాస్మి విభావ్యతా మహరహ ర్గర్వః పరిత్యజ్యతాం
దేహేఽహమ్మతి రుజ్ఝ్యతాం బుధజనై ర్వాదః పరిత్యజ్యతామ్. ౩

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం న తు యాచ్యతాం విధివశాత్ ప్రాప్తేన సంతుష్యతామ్,
శీతోష్ణాది విషహ్యతాం న తు వృథా వాక్యం సముచ్చార్యతా
మౌదాసీన్య మభీప్స్యతాం జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతామ్. ౪

ఏకాంతే సుఖ మాస్యతాం పరతరే చేతః సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగ దిదం తద్బాధితం దృశ్యతామ్,
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలా న్నాప్యుత్తరైః శ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్. ౫

యః శ్లోకపంచక మిదం పఠతే మనుష్యః
సంచింతయ త్యనుదినం స్థిరతా ముపేత్య,
తస్యాశు సంసృతి దవానల తీవ్ర ఘోర
తాపః ప్రశాంతి ముపయాతి చితిప్రసాదాత్.

# మనవి

మహాశయులారా !

మా సాధన గ్రంథ మండలికి, ఈ గీతాకదంబము అను గ్రంథముతో, సప్తవర్షములు పూర్తియైనవి. నేటివరకు మండలి చేసిన కృషి మీకు విదితమె గదా. మండలికి తగిన ఆర్థికసంపద లేకపోవుటచేతను, పోషకవర్గము తాము చూపవలసిన ఆదరాభిమానములు చూపకపోవుటచేతను, అనేక కష్టనష్టములకు లోనై గ్రంథ ముద్రణ నడుచుచున్నది. నేటికి షుమారు ఇరువదియైదువందల రూపాయలకు పైగా ఋణమైయున్నది. ఈ విషయము మా పోషకవర్గమునకు లోగడ రెండుమూడు మారులు ఈ విధముగ తెలుపుచు, ప్రత్యేకముగ జాబులు కూడ వ్రాసితిమి. ఏకొలదిమందియో తప్ప, మిగిలినవారందరు సమాధానమైన వ్రాయలేదు. మీ వంటి సహృదయులను ఆధారముగా గొని యీ కృషి చేయుచుంటిమి.

నేటికి 3, 4, 5 సంవత్సరముల పారితోషికములు, అభిమానులు, సభ్యులు, పోషకులు యివ్వవలసియుండిరి. రాజపోషకులలోను కొందరు గలరు. దయచేసి వెంటనె తాము లోగడ యివ్వవలసిన చందా పంపి, ఈ 1954 సంవత్సరము తాలూకు చందాకూడ పంపి, మా యీ కృషిని ప్రోత్సహించ గోరుచుంటిమి. ఇట్టి ఉత్తమసంస్థలు మీవంటి సహృదయుల ఆధారమువలననే నడచుచుండును. మీయందలి విశ్వాస అభిమానములచే నేటివరకు గ్రంథములు పంపుచుంటిమి. గ్రంథములు ఎక్కువ పేజీలు గలవిగా ప్రకటించుటవలన పోష్టు ఖర్చులుకూడ యెక్కువగుచున్నవి. కావున, తామీయవలసిన రుసుమును ఇచ్చి సాయపడగలరని అట్టివారిని కోరుచున్నాము.

మండలి ప్రారంభించిననాటినుండి నేటివరకు మాకు యథోచితముగ కోరినతోడనే ప్రతిసంవత్సరము తోడ్పడుచున్న మా మండలి పోషకవర్గమునకు మా కృతజ్ఞతలు తెలుపుచుంటిమి.

రాబోవు ఎనిమిదవవత్సర గ్రంథము "శంకర గ్రంథ రత్నావళి" శ్రీ శంకరాచార్యులవారి ఉపదేశప్రకరణ గ్రంథములు 40, ఒక సంపుటముగా వెలువరించు చున్నటుల లోగడ తెలిపియుంటిమి. ఈ గ్రంథము షుమారు 300 పేజీలలో చక్కని బైండుతో, ఈ నెలాఖరుకు తయారగుచున్నది. సహృదయుల కెల్లరకు మా కృతజ్ఞతలు.

తెనాలి<br>
విజయ మాఘము

సంపాదకులు<br>
బులుసు సూర్యప్రకాశ శాస్త్రి<br>
సాధన గ్రంథ మండలి.

# ప్రస్తావన

వేదమునందు చొరవ గలుగనివారి నుద్ధరించు తలంపున శ్రీ వేదవ్యాస భగవానుడు పురాణవాఙ్మయమును నిర్మించి నాడు. వ్యాస భగవానుడు సాక్షాద్భగవానుని మాఱురూపే యయినట్లు, పురాణములును వేదముల మాఱురూపే యని చెప్ప వచ్చును. వ్యాసభగవానునిచే నిర్మితము లైన పురాణములు, మహాపురాణములు అని పేరొందినవి.

మహాపురాణముల ననుసరించి ఆయా కాలములందు ఆయా పురాణములు కొన్ని, ఆయా మహర్షులచే బ్రవర్తితము లై యున్నవి. అవి ఉపపురాణములు అనుపేర ప్రసిద్ధములు. ఉపపురాణముల అభిప్రాయము సైతము భగవత్తత్త్వ నిరూపణముతో పాటు ధర్మోపదేశముగూడ గావించి, లోకము నుద్ధరించుటయే.

మహాపురాణ ఉపపురాణములలో 'గీతలు' అనుపేర కొన్ని ఘట్టములు గ్రథితములై యున్నవి. గీత లేక గీతము అనగా గానము చేయబడినది అనగా ఉపదేశింపబడినది అని తాత్పర్యము. కావున, సనందనాది బ్రహ్మపుత్త్రులు, లేక వసిష్ఠ వామదేవాది మహర్షులు, లేక నారాయణ నారదాదులు, మరీచ్యాదులకు, దేవగణములకు, మహర్షులకు లేక సాక్షాద్భగవానుడే స్వభక్త శిష్య గణములకు, బోధించి యున్నట్లు ఆయా గీతలు మహోత్తమ సంప్రదాయ బద్ధములై ఆయా పురాణములలో కూర్పబడి యున్నవి.

వేదములకు ఉపనిషత్తులువలె, పురాణములకు గీతలు శిరోమణులు అని చెప్పవలెను. అవి ఆత్మానుశాసనమును, ధర్మానుశాసనమును, యోగానుశాసనమును, భక్త్యనుశాసన

మును, గావించినవి. గీతలను నిత్యపారాయణ విధానమున అభ్యాసమున నుంచుకొని, తదర్థము నెఱిగి, అనుభవమున నిడుకొను వారు ఇహ పర సుఖముల నొంద గలుగుదు రనుటలో సందియము లేదు. ఆ విషయమును గీతలే స్వయముగా నిరూపించి యున్నవి.

మనకు మిక్కిలి అనుభవములో నున్న భగవద్గీత మున్నగునవియే గాక, పెక్కుగీతలు పురాణములలో నున్నవని పూర్వమే చెప్పితిమిగదా. అవి, కపిలగీత, భరతగీత, గోపికాగీత, భ్రమరగీత, శ్రుతిగీత, అవధూతగీత, హంసగీత, భిక్షుగీత, ఐలగీత, శ్రీరామగీత, యమగీత, పింగళగీత, శంపాకగీత, మంకిగీత, బోధ్యగీత, విచఖ్యుగీత, హారీతగీత, వృత్రగీత, పరాశరగీత, అనుగీత, బ్రాహ్మణగీత, ఈశ్వరగీత, హనుమద్గీత, అరుణగీత, పాండవగీత, అష్టావక్రగీత, గణేశగీత, ఉత్తరగీత, శ్రీదేవీగీత, బ్రహ్మగీత, శివగీత, వ్యాసగీత, సూతగీత, సూర్యగీత, ఇత్యాది నామములతో నెన్నియో ప్రసిద్ధములుగా నున్నవి. ఈ గీతలలో కొన్నిగీతలు ఈశ్వరగీత, శివగీత, గణేశగీత ఇత్యాదులు, అదే పేరున రెండు మూడు పురాణములలోగూడ చెప్పబడి యున్నవి. అవి పరమార్థమున నొకే యాశయముతో నున్నను, వివరణమున కొద్దికొద్ది మార్పులతో నున్నవి. అది యుక్తమే.

మొత్తముమీద, ప్రతిమనుజుడును ఈ గీతలను పఠించి, అర్థము దెలిసికొని, అనుభవమున నిడుకొని, ఆత్మోద్ధరణము గావించుకొనవలసినదే. ఇహ పర కల్యాణమును బడయుటకు గీతాభ్యాసముకన్న సులభమైన మార్గ మింకొకటి లేదు. గీతాభ్యాసరతు డగువాడు ఆత్మరతు డగు ననుటలో సందియము లేదు.

సకలజనులకు ముఖ్యముగా సాధకులకు అత్యంతోపకార కారులుగా నుండునట్లు ఈ గీతలను కూర్చి, గీతాకదంబము అను పేర కొన్ని దళసంపుటములుగా వెలువరింప బూనితిమి. ఫలవ దర్థావబోధ అత్యంతావశ్యకము కావున, సులభమై సరళమైన శైలిలో, శ్లోకానుక్రమమున తెలుగున తాత్పర్యముకూడ వానితో జతపఱుప సంకల్పించితిమి.

అందు, ఈ ప్రథమ దళమును ఐదు గీతలతో ముగించితిమి. అవి వరుసగా ౧ గోపికాగీత, ౨ భ్రమరగీత, ౩ హంసగీత, ౪ భిక్షు గీత, ౫ అవధూత గీత అనునవి. గోపికాగీత, శ్రీమద్భాగవతము దశమ స్కంధమున ముప్పదియొకటవ యధ్యాయము. భ్రమర గీత, శ్రీమద్భాగవతము దశమస్కంధమున నలువదియేడవ యధ్యాయము. హంసగీత, శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధ మున పదమూడవ యధ్యాయము. భిక్షుగీత, శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున ఇరువదిమూడవ యధ్యాయము. అవధూత గీత, శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ యధ్యాయములు. పై విషయములు వివరముగా తెలియుటకును ఆయా గీతల పూర్వాపరసందర్భములు ప్రదర్శిం చుటకును, కదంబములో ఆయా గీతల ప్రారంభమున సవిశేషము లగు అవతారికలు పొందుపఱిచితిమి.

పై గోపికాగీత మొదలు అవధూతగీత వఱకు గల ఐదు గీతలే గాక, శ్రీమద్భాగవతమున, శ్రుతిగీత, ఐలగీత, కపిలగీత, భరతగీత అను మఱి నాలుగు గీతలు కలవు. శ్రుతిగీత, దశమ స్కంధమున నెనుబదియేడవ అధ్యాయమునను; ఐలగీత, ఏకాదశ స్కంధమున ఇరువదియాఱవ యధ్యాయమునను; కపిల గీత,

తృతీయ స్కంధమునను; భరతగీత, పంచమస్కంధమునను నిబద్ధములు. భరతగీత, మా సాధన గ్రంథ మండలిలో 'జడభరతుడు' అను పేర 46 వ గ్రంథముగా వచనరూపమున 1951 వ సంవత్సరమున ప్రకటితము.

ఇట్లే, తక్కిన గీత లన్నియు గీతాకదంబ సంపుటములలో దళములుగా, వరుసగా, సాధక పాఠక లోకముల కరకమలాంజలులకు అందజేయ గలము.

గీతాకదంబ ప్రకాశములో లోకము తగిన చేయూత నీయగల దను నమ్మికతోడనే, గ్రంథమండలి ఈ కార్యక్రమము నవలంబించినది.

తమ తొందరపనులను గూడ లెక్కింపక వెనువెంటనే మా పుస్తకములను సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చుచున్న శ్రీ జానకీరాం ప్రెస్సువారికి మా కృతజ్ఞత దెలుపుకొనుచున్నాము.

— ప్రకాశకులు

# ౧ గోపికాగీత

భగవంతునియందు నిరూఢమైన సర్వాత్మభక్తి గలవారిలో మొట్టమొదటివారు గోపికలు. గోపికలకు, శ్రీకృష్ణభగవానునికంటె వేఱు లేదు. శ్రవణ స్పర్శన దర్శనాలాప నిషేవణాదులతో భగవంతునిగూడి కాలము గడపవలయునేకాని, అట్టిది లేనిక్షణము గోపికల కొక మహాయుగముగా దుర్భరముగా నుండెడిది. శ్రీకృష్ణభగవానుడు దూరమైన క్షణము, వారి నాపాదమస్తకము దావాగ్నివలె దహించెడిది. వారిపలుకులు, చేతలు, అన్నియు, శ్రీకృష్ణభగవత్పరాయణములే. వేదమయు డగు శ్రీకృష్ణభగవానుడు, ఉపనిషత్స్వరూపములగు గోపాంగనలతో, అట్టి అద్భుతలీలలను గావించి, కేవల గ్రామ్యవిలాసమున లోకమునకు గనిపించుచు, భక్తబృందము నుద్ధరించినాడు. ఈ చరిత్రమును శ్రీ వ్యాసభగవానుడు, శ్రీమద్భాగవతమున, పారవశ్యముతో వర్ణించినాడు. అందు దశమస్కంధమున గోవిందపరాయణలైన గోపికలు, తమ సర్వస్వ మగు శ్రీకృష్ణుడు దూరము కాగా, సహింప నేరక, దేహగేహాదికము మఱచి, కలిసి కట్టుగా శ్రీకృష్ణునిలీలను దలచి చెప్పుకొని, ముక్తకంఠముతో నాతని నే గానముచేసిరి. అదియే గోపికాగీత యని, ప్రసిద్ధమై యున్నది. ఇది అతిపవిత్రమైన ఘట్టము. సామాన్యవిచారమున నీఘట్టము, కథారూపమున స్ఫురించినను, ప్రతిపదమున మహార్థబోధకమై, సర్వశ్రుతిసారసంగ్రహమై అనుభవమున కందును. ఇది అనుదినము అనన్యభావమున గానము చేయువారలను గోపికలకువలె శ్రీకృష్ణుడు దివ్యదర్శన మిచ్చి, పాయకుండగలడు.

ధనమానమదములతో నిండియున్నవానికి, భగవదనుగ్రహమును బడయుట కవకాశమే లేదనియు, భగవంతుడు తా ననుగ్రహింపదలచినవారి ధనమానమదముల నడగించి హరించివేయుననియు, గోపికాగీత ఘట్టము పారమార్థికముగా వివరించుచున్నది.

గోప్య ఊచుః

జయతి తేధికం జన్మనా వ్రజః
శ్రయత ఇందిరా శశ్వ దత్ర హి,
దయిత ! దృశ్యతాం దిక్షు తావకా
స్త్వయి ధృతాసవ స్త్వాం విచిన్వతే. ౧

శరదుదాశయే సాధుజాతస
త్సరసిజోదరశ్రీముషా దృశా,
సురతనాథ ! తేఽశుల్కదాసికా
వరద ! నిఘ్నతో నేహ కిం వధః ? ౨

విషజలాశయాద్ వ్యాళరాక్షసా
ద్వర్షమారుతా ద్వైద్యుతానలాత్,

---

గోపికలనిరి

ఓ ప్రియుడా ! నీవు జన్మించుటచేత, వ్రజము సర్వో త్కర్షముగా నున్నది. ఎందువలన నన — లక్ష్మీకూడ, ఈ నంద గోకులమునే ఆశ్రయించినది. ఈ గోపికలుమాత్రము నీయందే ప్రాణము లిడుకొని అన్నిదిక్కుల నిన్నే వెదకుచున్నారు. కావున, దర్శన మిమ్ము. ౧

ఓ సురతనాథ ! నీవు వరదుడవుకదా ? శరత్సరోవరము నందలి సరసిజశ్రీ నపహరించు క్రీగంటిచూపుతో నీవు, ప్రతి ఫలము నపేక్షింపక నీ దాస్యమును చేయుచున్న యీ గోపికలను ప్రహరించి, బాధించుట వధ కాదా ? ౨

ఓ శ్రేష్ఠుడా ! విషమయమైన మడుగునుండియు, సర్ప రూపుడైన రాక్షసునిబారినుండియు, పెద్ద గాలివాననుండియు,

వృషమయాత్మజా ద్విశ్వతో భయా
దృషభ ! తే వయం రక్షితా ముహుః. ౩

న ఖలు గోపికానందనో భవా
నఖిలదేహినా మంతరాత్మదృక్,
విఖనసార్థితో విశ్వగుప్తయే
సఖ ! ఉదేయివాన్ సాత్వతాం కులే. ౪

విరచితాభయం వృష్ణిధుర్య ! తే
శరణ మీయుషాం సంసృతే ర్భయాత్,
కరసరోరుహం కాంత ! కామదం
శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్. ౫

---

పిడుగుపాటులనుండియు, దావాగ్నినుండియు, మయాసురుని బారి నుండియు, మఱి యితరములైన అనేక భయఘట్టములనుండియు నీవు మమ్ము పలుమారులు రక్షించియే యుంటివిగదా? ౩

ఓ సఖుడా ! నీవు నిజమునకు గోపికానందనుడవు కావు. అఖిలదేహులలో నంతరాత్మవుగా నుండువాడవు. బ్రహ్మ ప్రార్థింపగా, లోకములను రక్షించుటకై సాత్వతకులమున నుదయించితివి. ౪

ఓ వృష్ణివర్యా ! మనఃకాంతుడా ! కృష్ణా ! సంసారమునకు వెఱచి శరణు పొందినవారలకు అభయ మొసగి, సమస్త కామముల నిచ్చునట్టియు, శ్రీని చెట్టబట్టినట్టియు, నీ కరపద్మమును మా శిరస్సున నుంచుము. ౫

వ్రజజనార్తిహన్! వీర! యోషితాం
నిజజనస్మయధ్వంసనస్మిత!
భజ సఖే! భవత్కింకరీ స్స్మ నో
జలరుహాననం చారు దర్శయ. ౬

ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనమ్,
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్. ౭

మధురయా గిరా వల్గువాక్యయా
బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ!
విధికరీ రిమా వీర! ముహ్యతీ
రధరసీధునా ప్యాయయస్వ నః. ౮

---

ఓ సఖుడా! నీవు వీరాధివీరుడవు. నిజజనుల గర్వమును నవ్వుతోడనే హరించువాడవు. వ్రజవాసుల ఆర్తిని బాపగొట్టువాడవు. కావున, నీ సేవికలమైన మాదగ్గఱకు రమ్ము. చక్కని నీ ముఖారవిందము నీ గోపికలకు జూపుము. ౬

ప్రణతులగువారల పాపముల నశించునదియు, శ్రీకి నివాస మైనదియు, గోవులవెంట నడచివచ్చినదియు, కాళీయుని పడగలపై నిలువబడినదియు, నగు నీ పాదారవిందమును, మా కుచములపై నిడి, మా హృదయవ్యథను తొలగింపుము. ౭

ఓ పుండరీకాక్ష! బుధులమనస్సులను హరించి, చమత్కారము లైన వాక్యములతో మధురమధురమైన నీపలుకులకు మోహపడి సర్వాత్మనా నీయాజ్ఞావర్తినుల మైన, ఈ మమ్ము అధరామృతముతో తృప్తిపఱుపుము. ౮

తవ కథాఽమృతం తప్తజీవనం
కవిభి రీడితం కల్మషాపహమ్,
శ్రవణమంగళం శ్రీమ దాతతం
భువి గృణంతి యే భూరిదా జనాః. ౯

ప్రహసితం ప్రియ! ప్రేమవీక్షితం
విహరణం చ తే ధ్యానమంగళమ్,
రహసి సంవిదో యా హృదిస్పృశః
కుహక! నో మనః క్షోభయంతి హి. ౧౦

చలసి య ద్వ్రజా చ్చారయన్ పశూన్
నలినసుందరం నాథ! తే పదమ్,
శిలతృణాంకురైః సీదతీతి నః
కలిలతాం మనః కాంత! గచ్ఛతి. ౧౧

---

నీకథామృతము తాపత్రయతప్తు లగువారలకు జీవనము గలిగించునది. మహాకవులు దానినే కీర్తించుచుందురు. సమస్త కల్మషములను హరించునది. వీనులకు విందులు గూర్చునది. అతివిస్తారమై, శ్రీమంతమైనది. భూలోకమున నద్దానిని గీర్తించువారు, బహుసుకృతులు సుమా! ౯

ఓ ప్రియుడా! నీచిఱునవ్వు, ప్రేమపూరితమైన చూపు, విహారము, హృదయమున నదుకు నర్మక్రీడలు, ఓ కపటవర్తనుడా! మా మనస్సును చాల క్షోభపెట్టుచున్నవి. ౧౦

ఓ మనఃకాంతుడా! నీవు ఆవులను దోలుకొని, వ్రజములోనుండి బయలుదేఱగానే నలినసుందరమైన నీచిన్నియడుగు, ఱాళ్లు, ముండ్లు, తృణములు మున్నగువాని వలన, కంది, ఎంత బాధపడునో యని మా మనస్సు ఊరక వ్యథ పడెడిది. ౧౧

దినపరిక్షయే నీలకుంతలై
ర్వనరుహాననం బిభ్ర దావృతమ్,
ఘనరజస్వలం దర్శయన్ ముహు
ర్మనసి నః స్మరం వీర! యచ్ఛసి. ౧౨

ప్రణతకామదం పద్మజార్చితం
ధరణిమండనం ధ్యేయ మాపది,
చరణపంకజం శంతమం చ తే
రమణ! నః స్తనే ష్వర్పయాధిహన్ ! ౧౩

సురతవర్ధనం శోకనాశనం
స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్,
ఇతరరాగవిస్మారణం నృణాం
వితర వీర! న స్తేఽధరామృతమ్. ౧౪

---

ఓకృష్ణా! సాయంకాలమున నల్లని ముంగురులు క్రమ్ముకొని గో ధూళితో నిండియుండు, నీవదనారవిందము మాటిమాటికి జూపుచు, మా మనస్సులయందు దడగని మదనతాపమును గూర్చుచున్నావు.

నీ చరణపంకజము శరణ మనినవారల కెల్లకోరికలను ఇచ్చును. బ్రహ్మదేవుడు దానినే అనవరతము పూజించుచుండును. ఈ భూమికి అది అలంకారమైనది. ఆపదలు సంభవించి నపుడు ధ్యానించిన, అది సకలక్షేమములను సమకూర్చునుగదా! ఓ రమణుడా! అద్దానిని నీవు మా మనోవ్యధ లడగునట్లు మా స్తనములయందు దర్పింపుము. ౧౩

సురతవర్ధనము, శోకనాశనము మొరయింపబడు వేణువుచే పరిచుంబితము, మానవుల కితరరాగ విస్మారణము నగు నీ అధరామృతమును మాకు దయచేయుము. ౧౪

అటతి యద్భవా నహ్ని కాననం
త్రుటి యుగాయతే త్వా మపశ్యతామ్,
కుటిలకుంతలం శ్రీముఖం చ తే
జడ ఉదీక్షతాం పక్ష్మకృ ద్దృశామ్. ౧౫

పతిసుతాన్వయభ్రాతృబాంధవా
నతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః,
గతివిద స్తవోద్గీతమోహితాః
కితవ! యోషితః క స్త్యజే న్నిశి? ౧౬

రహసి సంవిదం హృచ్ఛయోదయం
ప్రహసితాననం ప్రేమవీక్షణమ్,
బృహదురః శ్రియో ధామ వీక్ష్య తే
ముహు రతిస్పృహా ముహ్యతే మనః. ౧౭

---

పగటివేళ నీవు అడవులకు బోయి, మా కన్నుల కగపడక యుండు క్షణకాలమే మాకొక యుగముగా దోచెడిది. కుటిలకుంతలమై మనోహరమైన నీ శ్రీముఖమును జూచు మా కన్నులకు రెప్పలు సృష్టించి, బ్రహ్మ వట్టి తెలివితక్కువవాడైనాడు. ౧౫

భర్తలను, అత్తమామలను, కొడుకులను, కూతులను, [illegible]ంప గోడి వదలివైచి, నీ నడిచు మని నీవే కావలెనని, నీ గీతము [illegible]చే మోహితలమై ఇటు వచ్చితిమి. ఓ ధూర్తుడా! ఎవడైన [illegible]రాత్రివేళ, కావలెనని వచ్చిన స్త్రీల నుపేక్షించునా? ౧౬

నీ నర్మక్రీడయు, నీ చిఱునవ్వు, నీ ప్రేమవీక్షణము, శ్రీ [illegible]లయమైన నీ విశాలవక్షస్థలమును జూచి, మాటిమాటికి దీఱని [illegible]కోరిక పొడముచున్నది. మా మనస్సు మోహమూనమునుగుచున్నది.

వ్రజవనౌకసాం వ్యక్తి రంగ! తే
వృజినహం త్ర్యలం విశ్వమంగళమ్,
త్యజ మనాక్చ న స్త్వత్స్పృహాత్మనాం
స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్. ౧౮

య త్తే సుజాతచరణాంబురుహం స్తనేషు
భీతాః శనైః ప్రియ! దధీమహి కర్కశేషు,
తేనాటవీ మటసి త ద్వ్యథతే న కింస్వి
త్కూర్పాదిభి ర్భ్రమతి ధీ ర్భవదాయుషాం నః. ౧౯

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే గోపికాగీతం నామ
ఏకత్రింశోధ్యాయః.

---

సమస్తక్లేశహరము, విశ్వమంగళప్రదము, స్వజనహృద్రోగహారము నగు నీ సాక్షాత్కారమును త్వద్గతాత్ములమగు మా వ్రజవనవాసుల కందఱకును అనుగ్రహింపుము. ౧౮

ఓ ప్రియుడా! అతిసుకుమారమైన నీ చరణారవిందమును కర్కశములైన మా స్తనములయందు, అతిభీతులమై మెల్ల మెల్లగా నిడుకొందుము. అట్టి ఆ పదముతో నీవు, అడవులలో సంచరించుచుంటివి. ఎచ్చట ఏ కఠిన పాషాణ కంటక తరు లతా గుల్మాదికములకు కంది, బాధపడుదువో యని మా మనస్సు ఊరక వ్యథ పడుచున్నదిసుమా! ౧౯

ఇది శ్రీ మద్భాగవతము దశమస్కంధమున గోపికాగీత మను ముప్పదియొకటవ యధ్యాయము.

# భ్రమరగీత

పరమ భాగవతరత్నములగు గోపికల నిరూఢ భక్త్యతిశయ వైభవమును దెలుపు ఘట్టములలో భ్రమరగీత యొకటి. ఇది అన్యాపదేశ విధానమున నున్నది. గోపికల వృత్తాంతము నరసి రమ్మని శ్రీకృష్ణుడు పంపగా, ఉద్ధవుడు నందగోకులమునకు వచ్చెను. తెల్లవారుసరికి నందుని యింటిముంగిట రథమును జూచి, శ్రీకృష్ణుని యెడబాటు కలిగించుటకు మఱొక యుత్పాతము వచ్చెనని గోపికలు తొలుదొలుత మిక్కిలి భయమున కంపించిపోయిరి. క్రమముగా వారందఱు ఉద్ధవునిదగ్గఱకు జేరిరి. తమ మనఃప్రియుడగు శ్రీకృష్ణుడు తమకై పంపిన దూతయని తెలిసికొనిన పిమ్మట వారు ఉద్ధవుని తమవానినిగా గౌరవించి, శ్రీకృష్ణునితో గలిసి తా మనుభవించిన అనుభవములను, పొందిన మహానిర్వృతిని ఆ రాసలీలా మహోత్సవములను వర్ణించి వర్ణించి, చెప్పి చెప్పి, ప్రస్తుతము శ్రీకృష్ణుని యెడబాటుతో తాముపడు బాధను ఉద్ధవునకు దెలియబలుక మొదలిడిరి. భ్రమరగీత బాహ్యమునకు అన్యాపదేశమున శ్రీకృష్ణుని అసూయతో నిందించుచున్నట్లు కనబడినను, అంతరమున మహోదాత్తమైన అభిప్రాయముతో ఉత్తమ భక్తిరస నిర్భరమై యున్నది.

శ్రీ శుక ఉవాచ

తం వీక్ష్య కృష్ణానుచరం వ్రజస్త్రియః
ప్రలంబబాహుం నవకంజలోచనమ్,
పీతాంబరం పుష్కరమాలినం లస
న్ముఖారవిందం పరిమృష్టకుండలమ్.
శుచిస్మితాః కోఽయ మపీచ్యదర్శనః
కుతశ్చ కస్యాచ్యుతవేషభూషణః,
ఇతీవ సర్వాః పరివవ్రు రుత్సుకా
స్త ముత్తమశ్లోకపదాంబుజాశ్రయమ్.
తం ప్రశ్రయే ణావనతా స్సుసత్కృతం
సవ్రీడహాసేక్షణసూనృతాదిభిః,
రహ స్యపృచ్ఛ న్నుపవిష్ట మాసనే
విజ్ఞాయ సందేశహరం రమాపతేః.

---

శ్రీ శుకుడు చెప్పెను

ఆజానుబాహువు, నవపద్మలోచనుడు, పీతాంబరుడు, పద్మ
మాలాలంకృతుడు, సుందర ముఖారవిందుడు, మణికుండలాలంకృ
తుడు శ్రీకృష్ణసఖుడు నగు నయ్యుద్ధవుని జూచి, వ్రజాంగనలు—
చూడ ముచ్చట గొలుపుచున్నవాడు. ఈత డెవడో ?
ఎందుండి వచ్చినాడో ? ఎవరివాడో ? అచ్చుగా శ్రీకృష్ణుని వేష
భూషణములతో నున్నవాడుసుమా ! అని ఉత్సుకలై ఉత్తమ
శ్లోక పదాంబుజాశ్రయు డగు నయ్యుద్ధవునిచుట్టును మూగిరి.
శ్రీకృష్ణసందేశహరుడగు నయ్యుద్ధవుని వినయమున ప్రమో
సవ్రీడ హాసేక్షణ సూనృతాదులతో గారవించి, ఏకాంతమున
శుభాసనమున గూర్చుండబెట్టి, గోపికలు వాని నిట్లని యడిగిరి.

జానీమ స్త్వాం యదుపతేః పార్షదం సముపాగతమ్,
భర్త్రేహ ప్రేషితః పిత్రో ర్భవాన్ ప్రియచికీర్షయా. ౪

అన్యథా గోవ్రజే తస్య స్మరణీయం న చక్ష్మహే,
స్నేహానుబంధో బంధూనాం మునే రపి సుదుస్త్యజః. ౫

అన్యే ష్వర్థకృతా మైత్రీ యావ దర్థవిడంబనా,
పుంభిః స్త్రీషు కృతా యద్వత్ సుమనస్స్వివ షట్పదైః. ౬

నిస్స్వం త్యజంతి గణికా, అకల్యం నృపతిం ప్రజాః,
అధీతవిద్యా ఆచార్య, మృత్విజో దత్తదక్షిణమ్. ౭

---

ఓయీ! నీవు యదుపతి సేవకుడవు. మా భర్తయగు శ్రీకృష్ణుడు, తన తలిదండ్రులకు సంతసము గూర్పవలె నని, పంపగా నీ విచ్చటికి వచ్చితి వని మే మెఱుగుదుము. ౪

అట్లు గాకున్న ఆ శ్రీకృష్ణున కీ నందగోకులములో స్మరింప దగినది యేమున్నది? బంధువులపై గల స్నేహానుబంధము మునియైనవానికి గూడ విడువరానిదిగదా? ౫

పురుషులు స్త్రీలపై వలెను, తుమ్మెదలు పూవులపై వలెను, బంధువులుకాని వారలపై గావింపబడు స్నేహము, స్వార్థము ననుసరించి కృత్రిమమై యుండును. ౬

ధనము గోలుపోయినవానిని వేశ్యలును; అసమర్థుడగు ప్రభువును ప్రజలును; చదువు ముగిసినవెనుక ఆచార్యుని శిష్యులును; దక్షిణ లిచ్చివేసినవెనుక యజమానుని ఋత్విక్కులు; ౭

ఖగా వీతఫలం వృక్షం, భుక్త్వా చాతిథయో గృహమ్,
దగ్ధం మృగా స్తథారణ్యం, జారో భుక్త్వా రతాం స్త్రియమ్. ౮

శ్రీ శుక ఉవాచ

ఇతి గోప్యో హి గోవిందగతవాక్కాయమానసాః,
కృష్ణదూతే వ్రజం యాతే ఉద్ధవే త్యక్తలౌకికాః. ౯
గాయంత్యః ప్రియకర్మాణి రుదంత్యశ్చ గతహ్రియః,
తస్య సంస్మృత్య సంస్మృత్య యాని కైశోరబాల్యయోః. ౧౦
కాచి న్మధుకరం దృష్ట్వా ధ్యాయంతీ కృష్ణసంగమమ్,
ప్రియప్రస్థాపితం దూతం కల్పయిత్వేద మబ్రవీత్. ౧౧

---

పండ్లయిపోయినవెనుక వృక్షమును, పక్షులును; భుజించి వెనుక గృహమును, అతిథులును; తగులబడిపోయిన అరణ్యమును మృగములును; అనుభవించినవెనుక తన్ను గోరిన స్త్రీని జారుడును; వదలివేయుట ప్రసిద్ధమేకదా? ౮

శ్రీ శుకుడు చెప్పెను

కృష్ణదూతయై ఉద్ధవుడు గోకులమునకు వెళ్ళగా, గోపికలిట్లు గోవిందగత వాక్కాయ మానసలై లౌకికక్రియల న్నెల్ల వదలివైచి_ ౯

ప్రియుడగు శ్రీకృష్ణుడు కిశోర బాలావస్థలయందు చేసిన పనులను ఊరక స్మరించి స్మరించి, చెప్పికొని, సిగ్గువిడిచి పెద్దగా విలపింపసాగిరి. ౧౦

ఒక గోపిక, అపుడొక తుమ్మెదను చూచి, కృష్ణునితోడి సంగమమును గోరుచు, స్వప్రియుడగు శ్రీకృష్ణునిచే దూతగా పంపబడిన ఉద్ధవు నుద్దేశించి, ఇట్లనెను. ౧౧

## గోపికోవాచ

మధుప! కితవబంధో! మా స్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచవిలులితమాలాకుంకుమశ్మశ్రుభి ర్నః,
వహతు మధుపతి స్తన్మానినీనాం ప్రసాదం
యదుసదసి విడంబం యస్య దూత స్త్వ మీదృక్. ౧౨
సకృ దధరసుధాం స్వాం మోహినీం పాయయిత్వా
సుమనస ఇవ సద్య స్తత్యజేఽస్మాన్ భవాదృక్,
పరిచరతి కథం తత్పాదపద్మం ను పద్మా?
అపి బత హృతచేతా హ్యుత్తమశ్లోకజల్పైః? ౧౩
కి మిహ బహు షడంఘ్రే! గాయసి త్వం యదూనా
మధిపతి మగృహాణా మగ్రతో నః పురాణమ్?

---

ఓ భ్రమరా! నీవు వట్టి వంచకుని మిత్రుడవు. సపత్నీ కుచ విలులిత మాలా కుంకుమములతో నిండుపడిన యీ మీసలతో మా పాదములను ముట్టుకొనకుము. మధురాపతి యగు శ్రీకృష్ణుడు, ఆ నాగరిక స్త్రీల అనుగ్రహమునే పడయునుగాక! తద్ద్వారా యదుసభలో కలుగు అపహాస్యములను ఆతడే పొందునుగాక! నీవు అట్టివానికేగదా యిట్లు దూత వైతివి? ౧౨

మోహపెట్టి మాయలమచ్చులు చల్లు తన యధరసుధారసము నొకసారి త్రావనిచ్చి నీవు పూవులనువలె, ఆతడు మమ్ము వదలివైచినాడు. అట్టి ఆతని పాదపద్మమును లక్ష్మీదేవి యెట్లు సేవించుచున్నదో? బహుశః ఆతని ఆ గొప్పమాటలకు మోసపడి, లోబడిపోయినది కాబోలు? ౧౩

ఓ షట్పదమా! అశరణలమైయున్న మాయెదుట ఊరక ఆతని పురాణమును గానము చేసెదవేల? చాలును. ఇది మాకు

విజయసఖసఖీనాం గీయతాం తత్ప్రసంగః
క్షపితకుచరుజ స్తే కల్పయం త్వీష్ట మిష్టాః. ౧౪
దివి భువి చ రసాయాం కాః స్త్రియ స్తద్దురాపాః
కపట రుచిర హాస భ్రూవిజృంభస్య యాః స్యుః,
చరణరజ ఉపా స్తే యస్య భూతి ర్వయం కా
హ్యపిచ కృపణపక్షే హ్యుత్తమశ్లోకశబ్దః ? ౧౫
విసృజ శిరసి పాదం వే ద్మ్యహం చాటుకారై
రనునయవిదుష స్తేఽభ్యేత్య దౌత్యై ర్ముకుందాత్,
స్వకృత ఇహ విసృష్టాపత్యపత్యన్యలోకా
వ్యసృజ దకృతచేతాః కిం ను సంధేయ మస్మిన్ ? ౧౬

---

తెలియనిది గాదు. పోమ్ము. ఆ విజయసఖ సఖుని స్త్రీలయెదుట మధురలో గానము చేయుము. వారు తమ హృదయవ్యథలు తొలగి, నీకు కావలసిన దేదియోని యిత్తురు. ౧౪

ద్యులోకమునగాని, భూలోకమునగాని, ఏస్త్రీ లాతనికి పొందరానివారు? మోసపు నవ్వులు, పలుకులు, భ్రూభంగములు, ఆతని సొమ్ములే గదా? సాక్షాత్తు శ్రీదేవియే ఆతని చరణారజము సేవించుచుండ, ఇక మే మాతనిదృష్టిలో నెవరము? కృపణ పక్షమున నీ యుత్తమశ్లోక శబ్దము సైతము బాగుగానున్నది. ౧౫

అట్లు ఊరకే తలపై నడుగు లిడుకొనెద వేల? మానుము. ముకుందుని దగ్గఱనుండి సందేశవాక్యములను గొనివచ్చి, అనునయకోవిదుడవై, చాటూక్తులను బలుకు నీవిషయమంతయు నే మెఱుంగుదుము. తన కై సంతానమును, భర్తలను, ఇతరలోకము లను, సమస్తమును వదలుకొనిన మమ్ము కృతఘ్నుడై వదలి వైచిన ఆతని కింక కూర్పవలసిన దేమున్నది? ౧౬

మృగయు రివ కపీంద్రం వివ్యధే లుబ్ధధర్మా,
స్త్రియ మకృత విరూపాం స్త్రీజితః కామయానామ్,
బలి మపి బలి మత్త్వా వేష్టయ ద్ధ్వాంక్షవ ద్య
స్త దల మసితసఖ్యై ర్దుస్త్యజ స్తత్కథార్థః. ౧౭

యదనుచరితలీలాకర్ణపీయూషవిప్రు
ట్సకృదదనవిధూతద్వంద్వధర్మా వినష్టాః,
సపది గృహకుటుంబం దీన ముత్సృజ్య దీనా
బహవ ఇవ విహంగా భిక్షుచర్యాం చరంతి. ౧౮

వయ మృత మివ జిహ్మవ్యాహృతం శ్రద్దధానాః
కులికరుత మివాజ్ఞాః కృష్ణవధ్వో హరిణ్యః,
దదృశిమ సకృ దేత త్తన్నఖస్పర్శతీవ్ర
స్మరరుజ ఉపమంత్రిన్! భణ్యతా మన్యవార్తా. ౧౯

---

అతడు లుబ్ధధర్ముడై, వేటకానివలె, వానరేంద్రుని వధించెను. తన్ను గామించి వచ్చిన స్త్రీని స్త్రీజితుడై విరూప నొనరించివైచెను. అతనివలన బలిని గొని, బలిచక్రవర్తిని, కాకివలె, బంధించివైచెను. కావున ఆనల్లనివానితో చెలిమి మాకిక చాలును. అతని కథార్థము విడువరానిదసుమా! ౧౭

ఆతని కథామృతమున నొక్కబిందువును కర్ణపుటములతో నొక్కమారు చవిజూడ బాల్పడినమాత్రమున ద్వంద్వ ధర్మములను విడనాడి, గృహములను దీనమైన కుటుంబమును విడిచివైచి, పలువురు విహంగములవలె భిక్షుచర్య నాచరింతురు. ౧౮

ఓయీ దూతుడా! వేటకాని సంగీతధ్వనిని నమ్మి, లేళ్ళవలె, మే మా కృష్ణునిమాటలను నిజమని నమ్మి, నఖస్పర్శముతో

ప్రియసఖ! పునరాగాః ప్రేయసా ప్రేషితః కిం
వరయ కిమనురుంధే మాననీయోఽసి మేఽంగ!
నయసి కథమిహాస్మాన్ దుస్త్యజద్వంద్వపార్శ్వం
సతతమురసి సౌమ్య! శ్రీవధూ స్సాకమాస్తే. ౨౦

అపి బత మధుపుర్యామార్యపుత్రోఽధునాస్తే
స్మరతి స పితృగేహాన్ సౌమ్య! బంధూంశ్చ గోపాన్?
క్వచిదపి స కథా నః కింకరీణాం గృణీతే
భుజమగురుసుగంధం మూర్ధ్న్యధాస్యత్కదా ను? ౨౧

---

చెప్పరాని స్మరవ్యథలపాలైతిమి. కావున మాకీ ప్రసంగము వలదు. చాలించి మఱొకటేదేని చెప్పుము. ౧౯

ఓయీ! శ్రీకృష్ణునిచే పంపబడి మరల వచ్చుచున్నావా యేమి? అయిన సంతోషమే. నేను నిన్నిదే గౌరవించుచున్నాను. వదలుకొనలేని మిథునీభావమున మునిగి యున్న ఆ శ్రీకృష్ణు దగ్గఱకు మమ్మిచ్చటినుండి కొనిపోదువా యేమి? ఆతని ఱొమ్మునందే అసహాయినియై లక్ష్మీదేవి నివసించుచున్నదిగదా.

ఓ బుద్ధిమంతుడా! ఇపుడు శ్రీకృష్ణుడు మధుపురిలో నివసించుచున్నాడుగదా! ఎన్నడేని ఆతడు పితృకులములను గోపాలురను, స్మరించునా? తన చరణసేవికలమైన మమ్మెపుడేని స్మరించునా? అగరుగంధముతో పరిమళించు నాతని భుజమును మా మస్తకముపై నెపుడిడునోగదా? ౨౧

శ్రీ శుక ఉవాచ

అథోద్ధవో నిశమ్యైవం కృష్ణదర్శనలాలసాః,
సాంత్వయన్ ప్రియసందేశై ర్గోపీ రిద మభాషత. ౨౨

ఉద్ధవ ఉవాచ

అహో! యూయం స్మ పూర్ణార్థా, భవత్యో లోకపూజితాః,
వాసుదేవే భగవతి యాసా మత్యర్పితం మనః. ౨౩
ధ్యాన వ్రత తపో హోమ జప స్వాధ్యాయ సంయమైః,
శ్రేయోవిధిభి రన్యైశ్చ కృష్ణే భక్తి ర్హి సాధ్యతే. ౨౪
భగవ త్యుత్తమశ్లోకే భవతీభి రనుత్తమా,
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనా మపి దుర్లభా. ౨౫



శ్రీ శుకుడు చెప్పెను

అనంతరము ఉద్ధవుడు, అది యంతయు విని, కృష్ణసందర్శనలాలసలైన గోపికలను, ప్రియుని సందేశవాక్యములతో ననునయించుచు నిట్లు పలికెను. ౨౨



ఉద్ధవు డనెను

ఆహా గోపికలారా! మీరు సర్వభావమున పూర్ణార్థలు సుడీ! ఎల్లలోకములకును మీరు పూజ్యులుసుడీ! శ్రీ వాసుదేవ భగవానునియందు మీమనస్సిట్లు అత్యంతము నిహితమైయున్నది.

ధ్యానము, వ్రతము, తపము, హోమము, జపము, స్వాధ్యాయము, సంయమము, మున్నగువానివలనను, మఱి యితరములైన పుణ్యవిధానములవలనను, శ్రీకృష్ణునియందు భక్తి సాధ్యపడును.

కాని అవన్నియును లేకుండగనే మీరు ఉత్తమశ్లోకుడైన శ్రీకృష్ణభగవానునియందు మునులకును దుర్లభమైన ఉత్తమోత్తమమైన నిరూఢభక్తిని గావింప గలిగితిరి. ౨౫

దిష్ట్యా పుత్రాన్ పతీన్ దేహాన్ స్వజనం చ గృహాం స్తథా,
హిత్వా వృణీత యూయం యత్ కృష్ణాఖ్యం పురుషం పరమ్.
సర్వాత్మభావోఽధికృతో భవతీనా మధోక్షజే,
విరహేణ మహాభాగా! మహా న్మేఽనుగ్రహః కృతః. ౨౭
శ్రూయతాం ప్రియసందేశో భవతీనాం సుఖావహః,
య మాదా యాగతో భద్రా హ్యహం భర్తూ రహస్కరః. ౨౮

శ్రీ భగవా నువాచ

భవతీనాం వియోగో మే న హి సర్వాత్మనా క్వచిత్,
యథా భూతాని భూతేషు ఖం వాయ్వగ్ని ర్జలం మహీ,
తథాఽహం చ మనఃప్రాణబుద్ధీంద్రియగుణాశ్రయః. ౨౯

---

సుతులను, పతులను, దేహములను, స్వజనమును, గృహములను వదలివైచి, మీరు భాగ్యవశమున శ్రీకృష్ణ నాముడగు పరమపురుషు నాశ్రయించితిరి. ౨౬

అధోక్షజునియందు అత్యంతము ఏకాంతభక్తిని పొందగలిగితిరి. ఆహా! ఈవిరహముచే నేనును ఎంతయు ననుగ్రహింపబడితిని.

ప్రియుడగు శ్రీకృష్ణునియొద్దనుండి ప్రియమై సుఖావహమైన సందేశమును దూతుడనైన నే నిదే కొనివచ్చితిని. తెలిపెద మీరు వినుడు. ౨౮

శ్రీకృష్ణభగవానుడు చెప్పెను

ఓ గోపికలారా! మీకును నాకును సర్వాత్మనా వియోగము ఎన్నడును లేదు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, మహి అను పంచభూతములు భూతము లొండింటియందు అనపాయముగా నుండియుండునట్లు నేను మనః ప్రాణ బుద్ధీంద్రియ గుణముల నాశ్రయించియే యుందును సుమా! ౨౯

ఆత్మన్యే వాత్మనాత్మానం సృజే హ న్మ్యనుపాలయే,
ఆత్మమాయానుభావేన భూతేంద్రియగుణాత్మనా. ౩౦

ఆత్మా జ్ఞానమయః శుద్ధో వ్యతిరిక్తోఽగుణాన్వయః,
సుషుప్తిస్వప్నజాగ్రద్భి ర్మాయావృత్తిభి రీయతే. ౩౧

యేనేంద్రియార్థాన్ ధ్యాయేత మృషా స్వప్నవ దుత్థితః,
తం నిరుంధ్యా దింద్రియాణి వినిద్రః ప్రత్యపద్యత. ౩౨

ఏతదంత స్సమామ్నాయో యోగ స్సాంఖ్యో మనీషిణామ్,
త్యాగ స్తపో దమ స్సత్యం సముద్రాంతా ఇవాపగాః. ౩౩

---

భూతేంద్రియ గుణా త్మకమైన ఆత్మమాయానుభావముచే నేను నాచేత నన్ను సృజించుకొందును. పాలింతును. నశింపజేయుదును.

ఆత్మ, గుణములతో నన్వయింపదు. కావున శుద్ధము. జ్ఞానమయము కావున వ్యతిరిక్తము. అయినను, మాయావృత్తులైన సుషుప్తి స్వప్నజాగ్ర దభిమానులగు విశ్వ తైజస ప్రాజ్ఞ రూపములతో ప్రతీయమాన మగును. ౩౧

నిదురించి మేలుకొనినవాడు, స్వప్నదృష్ట పదార్థములను అసత్యము లనియే తలపోయునట్లు, జీవుడు, ప్రకృతిపరిణామమైన మనస్సుచేత, లేనివే యైన శబ్దాదీంద్రియార్థములను తా ననుభవించినట్లు, తలపోయుచు, ఆ మనస్సుద్వారా బాహ్యేంద్రియములను పొందుచున్నాడు. కావున జాగరూకుడై ఆ మనస్సును అరికట్టవలెను. ౩౨

నదుల కన్నిటికిని సముద్రము అవధి యైనట్లు, ఈ మనోనిరోధమే, వేదమునకును, యోగమునకును, సాంఖ్యమునకును, త్యాగమునకును, తపస్సునకును, దమమునకును, నిక్కువముగా అవధిసుమా! ౩౩

య త్త్వహం భవతీనాం వై దూరే వర్తే ప్రియో దృశామ్,
మనస స్సన్నికర్షార్థం మదనుధ్యానకామ్యయా. ౩౪

యథా దూరచరే ప్రేష్ఠే మన ఆవిశ్య వర్తతే,
స్త్రీణాం చ న తథా చేత స్సన్నికృష్టేఽక్షిగోచరే. ౩౫

మయ్యావేశ్య మనః కృత్స్నం విముక్తాశేషవృత్తయః,
అనుస్మరంత్యో మాం నిత్య మచిరా న్మా ముపైష్యథ. ౩౬

యా మయా క్రీడతా రాత్ర్యాం వనేఽస్మిన్ వ్రజ ఆస్థితాః,
అలబ్ధరాసాః కల్యాణ్యో మాపు ర్మద్వీర్యచింతయా. ౩౭

---

మీ కత్యంతము ప్రియుడనైన నేను, మీచూపుల కతి దూరమున నుంటి నన, నా ధ్యానమునం దాసక్తి బాయక, అత్యంతము మీ మనస్సు నన్ను సమీపించి యుండుటకొఱకే గాని, వేఱొండు గాదు. ౩౪

స్త్రీలకు, దూరమునం దున్న ప్రియతమునిపై నావేశించి యున్నట్లుగా, మనస్సు, సమీపమున నుండి కంటికి కనబడుచున్నప్పుడు, ఉండదు. ౩౫

కావున, ఇతరవృత్తుల నెల్ల విడిచి, సంపూర్ణముగా నాయందే మనస్సును లగ్నము గావించి, నిత్యము నన్నే స్మరించుచు, మీరు అచిరకాలముననే నన్నే పొందగలరు. ౩౬

ఓ కల్యాణులారా! నేను క్రీడించుచున్న ఆరాత్రి, భర్తలచే నిరోధింపబడి, రాసోత్సవసుఖమును పొందనేరక, వ్రజమునందే నిలిచిపోయిన గోపికలు, నాయనుభావమును స్మరించి నన్నే పొందిరిగదా! ౩౭

## శ్రీ శుక ఉవాచ

ఏవం ప్రియతమాదేశ మాకర్ణ్య వ్రజయోషితః,
తా ఊచు రుద్ధవం ప్రీతా స్తత్సందేశాగతస్మృతీః. ౩౮

గోప్య ఊచుః

దిష్ట్యాఽహితో హతః కంసో యదూనాం సానుగోఽఘకృత్,
దిష్ట్యాప్తై ర్లబ్ధసర్వార్థైః కుశల్యా స్తేఽచ్యుతోఽధునా ? ౩౯

కచ్చి ద్గదాగ్రజం సౌమ్యః కరోతి పురయోషితామ్,
ప్రీతిం న స్నిగ్ధసవ్రీడహాసోదారేక్షణార్చితః ? ౪౦

కథం రతివిశేషజ్ఞః ప్రియశ్చ పురయోషితామ్,
నానుబధ్యేత తద్వాక్యై ర్విభ్రమై శ్చానుభాజితః ? ౪౧

---

## శ్రీశుకుడు చెప్పెను

ఇట్లు ప్రియతముని సందేశమును విని గోపికలు, ప్రీతిపడి, తత్సందేశవాక్యములచే నోడలు దెలిసి స్వస్థలై ఉద్ధవున కిట్లనిరి.

యదుకుల కంటకుడగు కంసుడు దైవానుగ్రహమున నిహతుడగుటతో సర్వార్థములను బడయ నేరిచిన ఆప్తులతో, అచ్యుతు డిప్పుడు కుశలముగా నున్నాడుగదా ? ౩౯

సిగ్గుతో ముసిముసి నవ్వులతో, ఉదారములైన వాలు చూపుల కగ్గమై, ఇపుడు గదాగ్రజుడు, మాకుగావింపవలసిన సంప్రీతిని మధురాపురాంగలకు లెస్సగా గావించుచున్నాడు గదా? ౪౦

రతివిశేషజ్ఞుడై, మధురాపురాంగనలకు ప్రియుడైన ఆ శ్రీకృష్ణుడు, వారల విలాసములకును, తీపిపలుకులకును కఱగి, వారలయందే ఎట్లు ఆసక్తుడు కాడు ? ౪౧

అపి స్మరతి న స్సాధో! గోవిందః ప్రస్తుతే క్వచిత్,
గోష్ఠీమధ్యే పురస్త్రీణాం గ్రామ్యా స్స్వైరకథాంతరే? ౪౨

తా: కిం నిశాః స్మరతి యాసు తథా ప్రియాభి
ర్బృందావనే కుముదకుందశశాంకరమ్యే,
రేమే క్వణచ్చరణనూపురరాసగోష్ఠ్యా
మస్మాభి రీడితమనోజ్ఞకథః కదాచిత్? ౪౩

అప్యేష్యతీహ దాశార్హ స్తప్తాః స్వకృతయా శుచా,
సంజీవయన్ను నో గాత్రై ర్యథేంద్రో వన మంబుదైః? ౪౪
కస్మాత్ కృష్ణ! ఇహాయాతి ప్రాప్తరాజ్యో హతాహితః,
నరేంద్రకన్యా ఉద్వాహ్య ప్రీత స్సర్వసుహృద్వృతః. ౪౫

---

ఓ మహానుభావా! నిజము చెప్పుము. ఆ గోవిందుడు పురస్త్రీలతో గోష్ఠులలో ఎన్నడేని పల్లెటూరి పామరస్త్రీల మగు మా విషయమును స్మరించునా? ౪౨

కుముదములతో కుందములతో చంద్రునితో రమ్యమైన బృందావనమునందు ప్రియురాండ్రమగు మేము తనకథలు గానము చేయుచుండగా కాలియందెల్ల చప్పుళ్లతో మాఱు మ్రోగు చున్న రాసగోష్ఠియందు రమించిన ఆరాత్రుల నెన్నడైన నా గోవిందుడు స్మరించుచుండునా? ఆ దాశార్హు డెన్నడైన నిచ్చ టికి వచ్చునా? ౪౩

తాను కలుగజేసిన దుఃఖముతో కుమిలి ఉడికిపోవుచున్న మమ్ము ఇంద్రుడు మేఘములతో అరణ్యమునువలె చల్లని తన యవయవములతో జీవింపజేయునా? ౪౪

ఇసీ! ఆకృష్ణు డిచ్చటి కేల వచ్చును? శత్రువులను వధించి నిష్కంటకమైన రాజ్యమును సంపాదించి నరేంద్రకన్య

కి మస్మాభి ర్వనౌకోభి రన్యాభి ర్వా మహాత్మనః,
శ్రీపతే రాప్తకామస్య క్రియతేఽర్థః కృతాత్మనః ? ౪౬

పరం సౌఖ్యం హి నైరాశ్యం స్వైరిణీ ప్రాహ పింగళా,
తజ్జానతీనాం నః కృష్ణే తథాప్యాశా దురత్యయా. ౪౭

క ఉత్సహేత సంత్యక్తు ముత్తమశ్లోకసంవిదమ్ ?
అనిచ్ఛతోఽపి యస్య శ్రీ రంగాన్న చ్యవతే క్వచిత్ ! ౪౮

సరిచ్ఛైలవనోద్దేశా గావో వేణురవా ఇమే,
సంకర్షణసహాయేన కృష్ణే నాచరితాః ప్రభో ! ౪౯

---

లను పెండ్లియాడి ఆప్తమిత్రవృతుడై సంతోషముతో సుఖించు చున్నవాడుగదా ! ౪౫

సాక్షాల్లక్ష్మీపతియు ఆప్తకాముడు కృతాత్ముడు నగు శ్రీకృష్ణునకు వనచరుల మగు మాతోగాని, మఱి మావంటి యితరస్త్రీలతోగాని యేమి పని ? ౪౬

స్వైరిణి యగు పింగళ చెప్పినట్లు నైరాశ్యము అత్యంతము సుఖము అని బాగుగా దెలిసియే యుండియు, మాకు శ్రీకృష్ణునిపై వదలివేయరాని యాశ పొడమినది. ౪౭

ఉత్తమశ్లోకుడగు నాతనితోడి ఏకాంత క్రీడావృత్తాంతము నెవడు విడువ నుత్సహించును ? ఇష్టపడకపోయినను, ఆతని శరీరమునుండి విడివడి లక్ష్మి పోనేరకున్నదిగదా ! ౪౮

ఈ నదులు, కొండలు, అటవీప్రదేశములు, ఆవులు, వేణురవములు, ఇవన్నియు, సంకర్షణ సహాయుడగు నా శ్రీకృష్ణునిచే అనుసేవింపబడినవి. ౪౯

పునః పునః స్మారయన్తి నందగోపసుతం బత,
శ్రీనికేతై స్తత్పదకై ర్విస్మర్తుం నైవ శక్నుమః. ౫౦

గత్యా లలితయోదారహాసలీలావలోకనైః,
మాధ్వ్యా గిరా హృతధియః కథం తం విస్మరామహే? ౫౧

హేనాథ! హేరమానాథ! వ్రజనాథార్తినాశన!
మగ్న ముద్ధర గోవింద! గోకులం వృజినార్ణవాత్. ౫౨

శ్రీ శుక ఉవాచ

తత స్తాః కృష్ణసందేశై ర్వ్యపేతవిరహజ్వరాః,
ఉద్ధవం పూజయాంచక్రుః జ్ఞాత్వాత్మాన మధోక్షజం. ౫౩

---

శ్రీనికేతనము లైన ఆతని పాదారవిందముల చిహ్నములతోడి యివన్నియు మమ్ము మాటిమాటికి వీనినే స్మరింపజేయుచున్నవి. మఱచిపోద మన్నను మాకు సాధ్యము కాకున్నది.

లలితమై గంభీరమైన నడకతో, తీయని నవ్వుతో, లీలావలోకన విలాసములతో, మనోహరమైన పలుకులతో, ఆతడు, మా మనస్సులను పూర్తిగా హరించివైచినాడు. ఇంక మే మెట్లు వానిని మఱవగలము? ౫౧

ఓ నాథ! ఓ రమానాథ! ఓ వ్రజనాథ! ఓ ఆర్తినాశన! ఓ గోవింద! వృజినార్ణవమున మునిగి యాకులమై పోయిన యీ గోకులమును ఉద్ధరింపుము. ౫౨

శ్రీకృష్ణుడు చెప్పెను

అనంతర మా గోపికలు, కృష్ణ సందేశ వాక్యములతో, విరహజ్వరతాపములు తొలగి, శ్రీకృష్ణుని యాంతర్యము సర్వము చేసికొని, తమయొడలు దెలసి, ప్రియుని దూత యగు నుద్ధవుని లెస్సగ బూజించిరి. ౫౩

ఉవాస కతిచి న్మాసాన్ గోపీనాం వినుదన్ శుచః,
కృష్ణలీలాకథా గాయన్ రమయామాస గోకులమ్. ౫౪

యావం త్యహాని నందస్య వ్రజేఽవాత్సీ త్స ఉద్ధవః,
వ్రజౌకసాం క్షణప్రాయా ణ్యాసన్ కృష్ణస్య వార్తయా. ౫౫

సరిద్వనగిరిద్రోణీ ర్వీక్షన్ కుసుమితద్రుమాన్,
కృష్ణం సంస్మారయన్ రేమే హరిదాసో వ్రజౌకసామ్. ౫౬

దృష్ట్వైవమాది గోపీనాం కృష్ణావేశాత్మవిక్లబమ్,
ఉద్ధవః పరమప్రీత స్తా నమస్య న్నిదం జగౌ. ౫౭

---

ఉద్ధవుడును గోపికల దుఃఖములను బాపుచు, కొన్ని మాసము లచ్చటనే యుండి, కృష్ణలీలాకథా గానముతో గోకులము నంతయు రమింప జేసెను. ౫౪

ఉద్ధవుడు నందవ్రజములో నున్న రోజు లన్నియు శ్రీకృష్ణ కథాప్రసంగములతో క్షణప్రాయముగ గడచిపోయెను. ౫౫

నదులును, వనములును, గిరిద్రోణులును, కుసుమితములైన వృక్షములును, జూచుచు, హరిదాసు డగు నయ్యుద్ధవుడు వ్రజవాసులను మాటిమాటికి శ్రీకృష్ణుని స్మరింప జేయుచు, మహానందము ననుభవించెను. ౫౬

ఈవిధముగా గోపికలకు శ్రీకృష్ణావేశముచే గలిగిన మనోవైకల్యమును గన్నులార జూచి, ఉద్ధవుడు, పరమప్రీతుడై వారలకు నమస్కరించుచు, ఇట్లు గానము చేసెను. ౫౭

ఉద్ధవ ఉవాచ

ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో
గోవింద ఏవ మఖిలాత్మని రూఢభావాః,
వాంఛంతి య ద్భవభియో మునయో వయం చ
కిం బ్రహ్మజన్మభి రనంతకథారసస్య ? ౫౮

క్వేమాః స్త్రియో వనచరా వ్యభిచారశీలాః?
కృష్ణే క్వ చైష పరమాత్మనిరూఢభావః ?
న న్వీశ్వరోఽనుభజతోఽవిదుషోఽపి సాక్షాత్
శ్రేయ స్తనో త్యగదరాజ ఇవోపయుక్తః. ౫౯

---

ఉద్ధవు డనెను

ఆహా! ఈ గోపికలే కృతార్థజన్మలు సుమా! భవభీతిలో బడి మహామునులును మేమును అనవరతము నెవ్వానిని గోరుచుందుమో, ఆ అఖిలాంతరాత్మ యగు గోవిందునియందు, సర్వాత్మనా నిరూఢమైన భావమును జేయగలిగినారు. అనంతుని కథలయం దత్యంతము ననురాగము గలవానికి బ్రాహ్మణాది జన్మములతో పనిగాని విశేషముగాని ఏమి ? ౫౮

వనచరలు వ్యభిచారశీలలు నగు గోపకాంత లెక్కడ ? పరమాత్మ యగు శ్రీకృష్ణునియందు నిరూఢమైన యీ భావ మెక్కడ ? ఏమియు నెఱుగని వాడైనను, తన్ను సర్వాత్మనా భజించువానికి పరమేశ్వరుడు, సేవింపబడిన అమృతరసమువలె, శ్రేయస్సును సమకూర్చును జుమ్మా ! ౫౯

నాయం శ్రియోఽఙ్గ ఉ నితాన్తరతేః ప్రసాదః
స్వర్యోషితాం నళినగన్ధరుచాం కుతోఽన్యాః,
రాసోత్సవేఽస్య భుజదణ్డగృహీతకణ్ఠ
లబ్ధాశిషాం య ఉదగా ద్వ్రజవల్లవీనామ్. ౬౦

ఆసా మహో చరణరేణుజుషా మహం స్యాం
బృన్దావనే కి మపి గుల్మలతౌషధీనామ్,
యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా
భేజు ర్ముకున్దపదవీం శ్రుతిభి ర్విమృగ్యామ్. ౬౧

యా వై శ్రియార్చిత మజాదిభి రాప్తకామై
ర్యోగేశ్వరై రపి యదాత్మని రాసగోష్ఠ్యామ్,

---

రాసోత్సవమునందు శ్రీకృష్ణునిచే స్వయంగ్రాహగృహీత లైన యీ గోపాంగనలకు గలిగిన ప్రసాదము, అనవరతాన పాయిని యగు లక్ష్మికిగాని, మఱి యితర దేవతాంగనలకుగాని, మఱి యే యింకెవ్వరికిగాని, లేదు. ౬౦

దుస్త్యజమైన స్వజనమును, ఆచారాదికమును వదలి శ్రుతి విమృగ్యమైన ముకుంద పదవిని సేవింపగలిగిన యీ వల్ల వాంగనల పవిత్ర పాదపరాగములను మోయు భాగ్యము గడించిన యీ బృందావన లతౌషధులలో నొకటిగ నేనుకూడ నగుదును గాక ! ౬౧

లక్ష్మీదేవిచేతను, బ్రహ్మాదుల చేతను, ఆప్తకాములగు యోగీశ్వరులచేతను, సమర్చితమైన శ్రీకృష్ణభగవానుని చరణార విందమును రాసగోష్ఠిలో తమ హృదయములందును, స్తనముల

కృష్ణస్య త ద్భగవత శ్చరణారవిందం
న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్. ౬౨

వందే నందవ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః,
యాసాం హరికథోద్గీతం పునాతి భువనత్రయమ్. ౬౩

శ్రీ శుక ఉవాచ

అథ గోపీ రనుజ్ఞాప్య యశోదాం నంద మేవ చ,
గోపా నామంత్ర్య దాశార్హో యాస్య న్నారురుహే రథమ్. ౬౪

తం నిర్గతం సమాసాద్య నానోపాయనపాణయః,
నందాదయోఽనురాగేణ ప్రావోచ న్నశ్రులోచనాః. ౬౫

---

యందును, నిడుకొని కౌగిలించుకొని యీ గోపికలు తాపమును బాసిరి గదా! ౬౨

ఎవరి హరికథోద్గీతము భువనత్రయమును పరమ పవిత్రము చేయుచున్నదో, ఆయీ నందవ్రజస్త్రీల పాదరేణువును మాటి మాటికి సర్వాత్మనా నమస్కరించుచున్నాడను. ౬౩

శ్రీ శుకుడు చెప్పెను

అనంతరము ఉద్ధవుడు, గోపికలకును, యశోదకును, నందునకును, గోపాలకులకును, చెప్పి, సెలవు గైకొని, మధుర కేగ రథారూఢు డయ్యెను. ౬౪

అట్లు ప్రయాణోన్ముఖుడై యున్న ఉద్ధవుని దరిసి, నానా విధములైన కానుకలను దెచ్చి సమర్పించి నందాదు లనురాగమున కన్నీరు నించుచు నిట్లనిరి. ౬౫

మనసో వృత్తయో న స్స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః,
వాచోఽభిధాయినీ ర్నామ్నాం కాయ స్తత్ప్రహ్వణాదిషు. ౬౬

కర్మభి ర్భ్రామ్యమాణానాం యత్ర క్వాపీశ్వరేచ్ఛయా,
మంగళాచరితై ర్దానై రతి ర్నః కృష్ణ ఈశ్వరే. ౬౭

ఏవం సభాజితో గోపైః కృష్ణభక్త్యా నరాధిప!
ఉద్ధవః పున రాగచ్ఛ న్మథురాం కృష్ణపాలితామ్. ౬౮

కృష్ణాయ ప్రణిపత్యాహ భక్త్యుద్రేకం వ్రజౌకసామ్,
వాసుదేవాయ రామాయ రాజ్ఞే చోపాయనా న్యదాత్. ౬౯

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే సప్తచత్వారింశోఽధ్యాయః.

---

మామనోవృత్తు లా శ్రీకృష్ణునిపాదాంబుజములయందును, వాక్కు లాతనినామోచ్చారణమునందును, కాయ మాతనిసేవా విధానమునందును, నిలుచునుగాక ! ౬౬

ఈశ్వరేచ్ఛచే కర్మములకు వశపడి యెందెందో భ్రమించుచు నుండు మాకు, మంగళాచారములచేతను, దానాదికములచేతను, శ్రీకృష్ణపరమాత్మయందు బాయనియనురాగము నిలుచునుగాక ! ౬౭

ఇట్లు శ్రీకృష్ణ భక్తిభావమున గోపాలురచే గారవింపబడి ఉద్ధవుడు శ్రీకృష్ణభుజపాలితయైన మధురకు మరల వచ్చెను.

కృష్ణునకు నమస్కరించి, వ్రజవాసుల భక్త్యుద్రేకమును విన్నవించి, యాతడు బలరామునకును, ఉగ్రసేనునకును, కానుకల నర్పించెను. ౬౯

ఇది శ్రీమద్భాగవతము దశమస్కంధమున
నలుబది యేడవ యధ్యాయము.



# ౩ హంసగీత

ఏకాంతభక్తి కలిగి, గురువులను సేవించి జ్ఞాన మనెడు కఠినమైన గొడ్డలి సంపాదించుకొని, దానితో త్రిగుణాత్మకమైన లింగశరీరమును ఛేదించివైచి, పరమాత్మను బడసి, ఆ పిదప, సాధనమునుగూడ వదలివేయవలెను జీవుడు — అని ఉద్ధవునకు బోధించి శ్రీకృష్ణభగవానుడు – అట్టి జ్ఞానము, సత్త్వగుణావృద్ధి వలన గలుగును – అని నిరూపించును, గుణములను, వాని కలయికలను, వాని యొకబాటులను, గుణములద్వారా కలుగు చిత్తవికారాదులను, సత్త్వప్రభావమును, లెస్సగా బోధింప మొదలిడెను. అందుకు నిదర్శనముగా హంసగీతోపాఖ్యానమును వివరించెను.

తన్నడిగిన సనకాదులకు యోగపరాకాష్ఠను వివరింప నేరక, బ్రహ్మదేవుడు తికమకపడుచుండగా, వాసుదేవుడు స్వయముగా హంసస్వరూపియై వారలకు దర్శన మిచ్చి, ఆ దంతయు నుపదేశించిన ట్లీ కథావిధానము, శ్రీమద్భాగవతైకాదశ స్కంధమున త్రయోదశాధ్యాయమున శ్రీ వేదవ్యాస భగవానునిచే గ్రథితమై యున్నది.

నిత్య పారాయణమున దీని నర్థము చేసికొని, అనుభవమునకు దెచ్చుకొనగలుగు పుణ్యాత్ములకు గుణజయము, సత్త్వవృద్ధి, తద్ద్వారా విద్యోదయము, దానివలన యోగపరాకాష్ఠ, లభింప గలవని భగవదాదేశము.

## శ్రీకృష్ణ ఉవాచ

సత్త్వం రజ స్తమ ఇతి గుణా బుద్ధే ర్న చాత్మనః,
సత్త్వేనాన్యతమౌ హన్యా త్సత్త్వం సత్త్వేన చైవహి. ౧

సత్త్వా ద్ధర్మో భవే ద్వృద్ధా త్పుంసో మద్భక్తిలక్షణః,
సాత్త్వికోపాసయా సత్త్వం తతో ధర్మః ప్రవర్తతే. ౨

ధర్మో రజ స్తమో హన్యా త్సత్త్వవృద్ధి రనుత్తమః;
ఆశు నశ్యతి తన్మూలో హ్యధర్మ ఉభయే హతే. ౩

ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ,
ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః. ౪

---

## శ్రీకృష్ణుడు చెప్పెను

సత్త్వము, రజస్సు, తమము, అను నీగుణములు బుద్ధివి గాని, ఆత్మవు గావు. సత్త్వముతో నితర రజస్తమముల నడంచి వేయవలెను. సత్త్వమును సత్త్వముచేతనే అడచివేయవలెను. ౧

శుద్ధమైన సత్త్వమువలన మద్భక్తిలక్షణ మగు ధర్మము పుట్టును. సాత్త్వికములైన పదార్థములను సేవించుటచే సత్త్వము వృద్ధి యగును. దానివలన ధర్మము వృద్ధి నొందును. ౨

ధర్మము రజస్తమముల నడచివేయును. కావున, సత్త్వ వృద్ధి ఉత్తమోత్తమ మైనది. ఇట్లు రజస్తమములు రెండును నశించిపోగా, తన్మూలమైన అధర్మము అవశ్యము నశించును. ౩

శాస్త్రము, జలము, జనము, దేశము, కాలము, కర్మము, జన్మము, ధ్యానము, మంత్రము, సంస్కారము అను నివి పది, గుణవృద్ధికి హేతువులు. ౪

తత్త్సాత్త్వికమేవైషాం యద్వృద్ధాః ప్రచక్షతే,
నిందంతి తామసం తత్త్రద్రాజసం తదుపేక్షితమ్. ౫

సాత్త్వికా న్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయే,
తతో ధర్మ స్తతో జ్ఞానం యావత్ స్మృతి రపోహనమ్. ౬

వేణుసంఘర్షజో వహ్ని ర్దగ్ధ్వా శామ్యతి తద్వనమ్,
ఏవం గుణవ్యత్యయజో దేహ శ్శామ్యతి తత్క్రియః. ౭

ఉద్ధవ ఉవాచ

విదంతి మర్త్యాః ప్రాయేణ విషయాన్ పద మాపదామ్,
తథాపి భుంజతే కృష్ణ! తత్కథం శ్వఖరాజవత్. ౮

---

వీనిలో దేనిని వృద్ధు లగువారు ప్రశంసింతురో, అది సాత్త్వికము. దేనిని నిందింతురో, అది తామసము. దేని నుపేక్షింతురో, అది రాజసము. ౫

సత్త్వము వృద్ధియగుటకు, పురుషుడు సాత్త్వికము లగు వానినే సేవింపవలయును. సత్త్వవృద్ధివలన, ధర్మము; దానివలన, జ్ఞానము; దానివలన నాస్వరూపాదికములను గుఱించిన స్మృతి; దానివలన, దేహద్వయముయొక్కయు, తత్కారణభూతము లగు గుణములయు, నిరాసము కలుగును. ౬

వెదురుల రాపిడివలన పుట్టిన అగ్ని, ఆ పొద నంతయు గాల్చివేసి, తానుకూడ శమించిపోవునట్లు, గుణవ్యత్యయమువలన పుట్టిన దేహముకూడ తనకు మూలమైన ఆగుణములను అడగించి, తానుకూడ అడగిపోవుచున్నది. ౭

ఉద్ధవు డనెను

కృష్ణా! విషయము లాపదలకు స్థానము లని మానవులు బాగుగా దెలిసియే యున్నారు. అయినను, వారు కుక్కలు

శ్రీ భగవానువాచ

అహ మిత్యన్యథా బుద్ధిః ప్రమత్తస్య యథా హృది
ఉత్సర్పతి రజో ఘోరం తతో వైకారికం మనః. ౯

రజోయుక్తస్య మనసః సంకల్పస్సవికల్పకః,
తతః కామో గుణధ్యానా ద్దుర్ధరః స్యాద్ధి దుర్మతేః. ౧౦

కరోతి కామవశగః కర్మా ణ్యవిజితేంద్రియః,
దుఃఖోదర్కాణి సంపశ్యన్ రజోవేగవిమోహితః. ౧౧

---

గాడిదలు మేకలు మున్నగువానివలె, వానిని సేవింప బూనుచున్నారేల ? ౮

శ్రీకృష్ణుడు చెప్పెను

వివేకము లేనివానికి, దేహాదులయందు నేను అను మిథ్యాబుద్ధి కలిగినంతనే, దానివలన వానిమనస్సు సాత్త్వికాహంకార వికారమును బొందిన దగును. దానివలన మహాఘోరమై దుఃఖాత్మక మైన రజోగుణ మాతనిమనస్సును క్రమ్మివేయును. ౯

రజోయుక్తమైన మనస్సునందు సంకల్పములు వికల్పములు పుట్టుచుండును. వానివలన 'అహో రూపం, అహో భావః' ఇత్యాది గుణముల ధ్యానము కల్గును. దానివలన ఆ వివేకశూన్యపురుషునకు దుర్ధర మైన కామము జనించును. ౧౦

కామమునకు గురి యయినవాడు, అవిజితేంద్రియుడై, కర్మములను జేయ మొదలిడును. అవి భావికాలమున అత్యంత దుఃఖ ఫలమునే ఈయ గలిగిన వని చూచుచునే యుండియు, రజోవేగవిమోహితుడై యాత డా కర్మములను జేయుచునే యుండును, ౧౧

రజ స్తమోభ్యాం యదపి విద్వాన్ విక్షిప్తధీః పునః,
అతంద్రితో మనో యుంజన్ దోషదృష్ట్యా న సజ్జతే. ౧౨
అప్రమత్తోఽనుయుంజీత మనో మయ్యర్పయన్ శనైః,
అనిర్విణ్ణో యథాకాలం జితశ్వాసో జితాసనః. ౧౩
ఏతావాన్ యోగ ఆదిష్టో మచ్ఛిష్యైః సనకాదిభిః,
సర్వతో మన ఆకృష్య మ య్యద్ధావేశ్యతే యథా. ౧౪

ఉద్ధవ ఉవాచ

యదా త్వం సనకాదిభ్యో యేన రూపేణ కేశవ!
యోగ మాదిష్టవా నేత ద్రూప మిచ్ఛామి వేదితుమ్. ౧౫

---

విద్వాంసు డగువాడు ఒకప్పుడు, రజ స్తమస్సులచేత వికలము చేయబడిన మనస్సు కలవా డైనను, జాగరూకుడై తెలివి గలిగి, తన మనస్సును మరల నిరోధింప గలుగునేని, విషయదోష దృష్టిబాధింప బడడు. ౧౨

కావున, అప్రమత్తుడై, అలసత బోగొట్టుకొని, వివేకి యగువాడు, మనస్సును క్రమక్రమముగా నాయందు నిలిపి, శ్వాసలను ఆసనమును జయించి, నన్నే ధ్యానింపవలెను. ౧౩

అన్ని విషయములనుండియు మనస్సు నాకర్షించివేసి, నాయం దే రూఢముగా నిలిపివేయ వలెను; అని, ఈ రూప మైన యోగమునే, నాశిష్యు లగు సనకాదులకు సైతము నే నుపదేశించితిని. ౧౪

ఉద్ధవు డనెను

కేశవా! నీవు ఎప్పుడు ఏరూపమున సనకాదులకు యోగము నుపదేశించితివో, ఆరూపమును జూడవలయుననియు, ఆ వృత్తాంతమును వినవలయు ననియు, నాకు గోరికగా నున్నది.

శ్రీకృష్ణ ఉవాచ

పుత్త్రా హిరణ్యగర్భస్య మానసా స్సనకాదయః,
పప్రచ్ఛుః పితరం సూక్ష్మాం యోగ స్యైకాంతికీం గతిమ్. ౧౬

సనకాదయ ఊచుః

గుణే ష్వావిశతే చేతో గుణా శ్చేతసి చ ప్రభో!
కథ మన్యోన్యసంత్యాగో ముముక్షో రతితితీర్షోః? ౧౭

ఏవం పృష్టో మహాదేవః స్వయంభూ ర్భూతభావనః,
ధ్యాయమానః ప్రశ్నబీజం నాభ్యపద్యత కర్మధీః. ౧౮

---

శ్రీకృష్ణుడు చెప్పెను

బ్రహ్మమానసపుత్త్రులగు సనకాదులు, యోగపరాకాష్ఠను దెలుపు మని, తండ్రి యగు బ్రహ్మదేవు నడిగిరి. ౧౬

సనకాదులు ప్రశ్నించిరి

రాగాదివశ మైన చిత్తము, విషయములయందు బ్రవేశించును. అనుభూతము లైన ఆ విషయములు, వాసనారూపమున జిత్తమున బ్రవేశించును గదా? అట్టియెడ, వానిని దాటి ముక్తి నొందగోరువానికి, ఆ చిత్త విషయముల యొండొంటిని విడఁబాటుట యెట్లు ఘటిల్లగలదు? ౧౭

అని సనకాదు లడుగగా, భూతభావను డగు బ్రహ్మదేవుడు చాలసేపు ఆలోచించి, కర్మవిక్షిప్తమతి యగుటచే, ఈ ప్రశ్నము అజ్ఞానమూలకమని యెఱుగ నేరకపోయెను. ౧౮

స మా మచింతయ ద్దేవం ప్రశ్నపారతితీర్షయా,
తస్యాహం హంసరూపేణ సకాశ మగమం తదా. ౧౯

దృష్ట్వా మాం త ఉపవ్రజ్య కృత్వా పాదాభివందనమ్,
బ్రహ్మాణ మగ్రతః కృత్వా పప్రచ్ఛుః కో భవా నితి. ౨౦

ఇ త్యహం మునిభిః పృష్ట స్తత్త్వజిజ్ఞాసుభి స్తదా,
య దవోచ మహం తేభ్య స్త దుద్ధవ! నిబోధ మే. ౨౧

వస్తునో య ద్యనానాత్వ మాత్మనః ప్రశ్న ఈదృశః,
కథం ఘటేత వో విప్రా! వక్తు ర్వా మేక ఆశ్రయః. ౨౨

పంచాత్మకేషు భూతేషు సమానేషు చ వస్తుతః,
కో భవా నితి వః ప్రశ్నో వాచారంభో హ్యనర్థకః. ౨౩

---

అప్పు డాత డా ప్రశ్నమునకు సమాధానమును దెలిసికొనఁగోరి, నన్ను స్మరించెను. అపుడు హంసరూపమున నేనాతనిపాలి కేతేరితిని.

అట్లు వచ్చిన నన్ను జూచి సనకాదులు దరిసి, పాదాభివందన మాచరించి, బ్రహ్మను ముం దిడుకొని, నీ వెవఁడ, వని నన్ను బ్రశ్నించిరి ? ౨౦

తత్త్వజిజ్ఞాసువు లగు సనకాదు లట్లడుగగా, నేను వారికి జెప్పిన విషయమును నీకు జెప్పుచున్నాను. ఉద్ధవా! వినుము. ౨౧

ఆత్మవస్తువు ఒక్కటియే యయినప్పుడు, ఇట్టి ప్రశ్న యిం కెట్లు ఘటిల్ల నేర్చును? బ్రాహ్మణులారా! నాకును మీకును ఆశ్రయ మొక్కటియేకదా? ౨౨

నిజమునకు, పంచాత్మకము లైన భూతములు సమానములే అయినప్పుడు, నీ వెవడ వని మీ రడిగిన ప్రశ్న కేవలము వాచారంభమును నిరర్థకమును గదా? ౨౩

మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యై రపీంద్రియైః,
అహ మేవ న మత్తోఽన్య దితి బుధ్యధ్వ మంజసా. ౨౪

గుణే ష్వావిశతే చేతో గుణా శ్చేతసి చ ప్రజాః!
జీవస్య దేహ ఉభయం గుణా శ్చేతో మదాత్మనః. ౨౫

గుణేషు చావిశ చ్చిత్త మభీక్ష్ణం గుణసేవయా,
గుణాశ్చ చిత్తప్రభవా మద్రూప ఉభయం త్యజేత్. ౨౬

జాగ్రత్ స్వప్న సుషుప్తిశ్చ గుణతో బుద్ధివృత్తయః,
తాసాం విలక్షణో జీవ స్సాక్షిత్వేన వినిశ్చితః. ౨౭

---

మనస్సుచేతను, వాక్కుచేతను, దృష్టిచేతను తక్కుంగల యెల్ల యింద్రియములచేతను, నేనే గ్రహింపబడుచున్నాను గాని, నాకంటె మఱొకటి గా దని, తత్త్వవిచారమున మీరు మీ నిశ్చయాత్మక మైన బుద్ధితో తెలిసికొనుడు. ౨౪

ఓపుత్త్రికులారా! చిత్తము గుణములయందును, గుణములు చిత్తమునందును, ప్రవేశించుట నిక్కువమే. చిత్తము గుణములు ఇవి రెండును, మదాత్మకు డగు జీవునకు అధ్యస్తోపాధిమాత్రమే.

మాటిమాటికి గుణములను సేవించుటచేత చిత్తము గుణములయందు ప్రవేశించును. గుణములు సయితము. వాసనారూపమున చిత్తమునం దత్యంతము జొచ్చుచున్నవి. కావున, ముముక్షు వగువాడు మద్రూపుడై, ఈ రెంటిని విడువవలెను.

జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అను నివి బుద్ధివ్యాపారములు. అవి గుణమువలన గలుగుచున్నవి. జీవుడు వానికంటె విలక్షణుడు. ఆతడు వానికి సాక్షిమాత్రుడుగా నుండు నని విజ్ఞులు చెప్పుచున్నారు. ౨౭

యర్హి సంసృతిబంధోఽయ మాత్మనో గుణవృత్తిదః
మయి తుర్యే స్థితో జహ్యాత్ త్యాగ స్తద్గుణచేతసామ్. ౨౮

అహంకారకృతం బంధ మాత్మనోఽర్థవిపర్యయమ్,
విద్వా న్నిర్విద్య సంసారచింతాం తుర్యే స్థిత స్త్యజేత్. ౨౯

యావ న్నానార్థధీః పుంసో న నివర్తేత యుక్తిభిః,
జాగ ర్త్యపి స్వప న్నజ్ఞః స్వప్నే జాగరణం యథా. 30

---

ఈ సంసారబంధము, జీవునకు గుణవృత్తులను గలిగించును. కావున, వీని కన్నిటికి నతీతుడనై తురీయుడ నగు నాయందు నిలిచి, సంసారబంధమును విడువవలెను. అప్పుడు, గుణమును చిత్తమును వదలివైచినట్లే యగును. ౨౮

అహంకారముచేత ఆత్మకు బంధము కలిగింప బడినది. ఆ బంధము, పురుషార్థములను తాఱుమాఱు చేసి, చెఱచి వేయును. కావున, విద్వాంసు డగువాడు దీని నెఱిగి, నిర్వేదము నొంది, తురీయుడ నగు నాయందు నిలిచి, ఆ సంసార చింతను విడువవలెను. ౨౯

బహువిధములైన భేదభావములతో గూడియుండిన బుద్ధి, తన్నిరాసకము లైన ప్రమాణోక్తి యుక్తులద్వారా తొలగి పోకుండునంతవఱకు, పురుషుడు, మూఢుడే అజ్ఞుడే అని చెప్ప వలెను. ఆతడు, స్వప్నములో జాగరణమును వలె, మేలుకొని యుండియు స్వప్నమును జూచుచున్నవాడే యగును. 30

అసత్త్వా దాత్మనోఽన్యేషాం భావానాం తత్కృతాభిధా,
గతయో హేతవ శ్చాస్య మృషా స్వప్నదృశో యథా. ౩౧

యో జాగరే బహి రనుక్షణధర్మిణోఽర్థాన్
భుంక్తే సమస్తకరణై ర్హృది తత్సదృక్షాన్,
స్వప్నేఽథ సుప్త ఉపసంహరతే స ఏకః
స్మృత్యన్వయా త్త్రిగుణవృత్తిదృ గింద్రియేశః. ౩౨

---

ఆత్మకు దేహాదిభావములును, వర్ణాశ్రమాదిరూప మగు నభిధయు, లేవుగావున, దానికి స్వర్గాదిఫలములును, కర్మములును గలుగ జాలవు. స్వప్నమును జూచినవాని కందలి వన్నియు నసత్యము లైనట్లే, ఆత్మ కివన్నియు నసత్యములు. ౩౧

జాగరావస్థయందు జీవుడు, క్షణికమైన ధర్మము గల వేనివేని ననుభవించునో, వాసనారూపమున హృదయములో నున్న వానినే, స్వప్నమున ననుభవించును. సుషుప్తియందు వానినే ఉపసంహరించుకొనును. కావున, జీవు డొక్కడే జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు మూటికిని ద్రష్టయగు చున్నాడు. నేను మేలుకొంటి ననియు, స్వప్నమును జూచితి ననియు, నిదురించితి ననియు, ఉత్తరోత్తరము పూర్వాపూర్వస్మృతి జీవున కుండుట వలన, నిశ్చయముగా నాత డొక్కడే కావలయును. కావున, విశ్వ తైజస ప్రాజ్ఞ నామములు కూడ అవస్థాభేదమున కలిగినవే కాని, వాస్తవమున జీవు డొక్కడే. ౩౨

ఏవం విమృశ్య గుణతో మనస స్త్ర్యవస్థా
మన్మాయయా మయి కృతా ఇతి నిశ్చితార్థాః,
సంఛిద్య హార్ద మనుమాన సదుక్తి తీక్ష్ణ
జ్ఞానాసినా భజత మాఽఖిలసంశయాధిమ్. 33

ఈక్షేత విభ్రమ మిదం మనసో విలాసం
దృష్టం వినష్ట మతిలోల మలాతచక్రమ్,
విజ్ఞాన మేక మురుధైవ విభాతి మాయా
స్వప్న స్త్రిధా గుణవిసర్గకృతో వికల్పః. 3౪

---

ఇట్లు లెస్సగా విమర్శించి, గుణములవలన మనస్సునకు మూడవస్థలు సంభవించినవి; అవియు, నామాయచేత నాయందు కల్పితములైనవి; అని నిశ్చయముగా నెఱిగికొని, హృదయమునందు గల సకలసంశయములు అను మహావ్యాధిని, అనుమాన ప్రమాణా ద్యుక్తులతోడను, తీక్ష్ణమైన జ్ఞానఖడ్గముతోడను, ఛేదించి, మీరు నన్నే సేవింపుడు. 33

ఈ జగ మంతయు విచిత్రమైన దనియు, భ్రమింపజేయున దనియు, మనోవిలాసము మాత్రమే యనియు నెఱుగవలెను. ఇది కనబడుచు, నశించుచు, నుండును. ఇది తిరుగుచున్న అలాతచక్రము వంటిది. జీవుడు జ్ఞానైకస్వరూపుడు. ఆరూప మొక్కటియే యయ్యు, నానారూపముల దోచుచున్నది. ఈ భేదము సయితము, ముత్తెఱగు లైనది. అదియు గుణపరిణామముచే గావింపబడినది. మేలుకొనినపిదప స్వప్నము అసత్యమైనట్లే, జీవాత్మలస్వరూపము నెఱిగికొనిన పిమ్మట, ఈ భేద మంతయు మాయయు మృషయు నగును. 3౪

దృష్టిం తతః ప్రతినివర్త్య నివృత్తతృష్ణ
స్తూష్ణీంభవే న్నిజసుఖానుభవో నిరీహః,
సందృశ్యతే క్వచి దిదం యదవస్తుబుద్ధ్యా
త్యక్తం భ్రమాయ న భవేత్ స్మృతి రానిపాతాత్. ౩౫

దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా
సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమత్ స్వరూపమ్,
దైవా దపేత మథ దైవవశా దుపేతం
వాసో యథా పరికృతం మదిరామదాంధః. ౩౬

---

కావున, ఈ దృశ్యమాన ప్రపంచమునుండి దృష్టి మరలించి, తృష్ణ లడచికొని, నిరీహుఁడై ఆత్మానందము ననుభవించుచు నుండవలెను. ఈ కనబడున దంతయు అవస్తువు అనగా యథార్థము కానిది; అని నిశ్చయముగా త్రోసివేసిన పిమ్మట, అది మరల భ్రమమును గలిగింప నేరదు. కాని, దేహపాత మగునంతవఱకు స్మృతిరూపమున అనగా సంస్కారమాత్రముగా నవభాసించుచు నుండును. ౩౫

ఇట్లు సమాధినిష్ఠుఁడై సిద్ధుఁ డగువానికి దేహవిచారమే యుండదు. కల్లు త్రాగి మత్తు గొన్నవాఁడు, కట్టుకొనిన తన వస్త్రము ఉన్నను ఊడిపోయినను ఏమైనను గమనింపఁడు. అట్లే ఆ సిద్ధుఁడును, నశ్వర మైన ఈ దేహము అట్లే నిలిచి యున్నను, కూర్చుండి యున్నను, లేచినను, దైవవశమున ఉన్నను, పోయినను, ఏమైనను గమనింపఁడు. సమాధి చక్కఁగా కుదిరినయాతఁ డీ దేహము యొక్క స్వరూపమును లెస్సగా దెలిసికొని యున్నవాఁడు గావున, అట్లు మెలఁగును. ౩౬

దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతి సమీక్ష్యత ఏవ సాసుః,
తం న ప్రపంచ మధిరూఢసమాధియోగః
స్వాప్నం పున ర్న భజతే ప్రతిబుద్ధవస్తుః. ౩౭

మయైత దుక్తం వో విప్రా గుహ్యం య త్సాంఖ్యయోగయోః,
జానీత మాగతం యజ్ఞం యుష్మద్ధర్మవివక్షయా. ౩౮

అహం సాంఖ్యస్య యోగస్య సత్య స్యర్తస్య తేజసః,
పరాయణం ద్విజశ్రేష్ఠాః ! శ్రియః కీర్తే ర్దమస్య చ. ౩౯

---

శరీరము దైవవశమున సంభవించుచున్నది. అది ప్రారబ్ధ కర్మ ముండునంతవఱకు ప్రాణములతో నిలుచును. కావున, బాగుగా సమాధి కుదిరినయోగి, పరమార్థవస్తువును లెస్సగా దెలిసికొని యున్నవా డగుటవలన, స్వప్నతుల్య మగు ఈ శరీరమును మరల పొందడు. ౩౭

బ్రాహ్మణులారా ! సాంఖ్యమునందును యోగమునందును రహస్య మైన యీ విషయమును మీకు నే నెఱిగించినాను. మీధర్మములను వివరించునిమిత్తము ఇట్లరుదేరిన నన్ను యజ్ఞుడు అనగా విష్ణువుగా నెఱుగుడు. ౩౮

ఓ ద్విజశ్రేష్ఠులారా ! నేను సాంఖ్యమునకును, యోగమునకును, సత్యమునకును, ఋతమునకును, తేజమునకును, శ్రీకిని, కీర్తికిని, దమమునకును, పరమాశ్రయస్థానము నగుదునుజుడీ ! ౩౯

మాం భజంతి గుణాః సర్వే నిర్గుణం నిరపేక్షకమ్,
సుహృదం ప్రియ మాత్మానం సామ్యాసంగాదయో గుణాః. ౪౦

శ్రీ భగవా నువాచ

ఇతి మే ఛిన్నసందేహా మునయ స్సనకాదయః,
సభాజయిత్వా పరయా భక్త్యా గృణత సంస్తవైః. ౪౧

తై రహం పూజిత స్సమ్యక్ సంస్తుతః పరమర్షిభిః,
ప్రత్యేయాయ స్వకం ధామ పశ్యతః పరమేష్ఠినః. ౪౨

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే హంసగీతం నామ
త్రయోదశోఽధ్యాయః.



నిర్గుణుడను నిరపేక్షుడను సర్వభూతసుహృత్తును ప్రియుడను పరమాత్ముడను అగు నన్నే గుణాపరిణామ భూతములు గాబోని సామ్యాసంగాది గుణములు అన్నియు నాశ్రయించును.

శ్రీ భగవానుడు చెప్పెను

అని నేను చెప్పగా విని, సనకాది మునులు తమ సందేహములు తొలగి, పరమభక్తితో నన్ను పూజించి, స్తుతించి, సేవించిరి. ౪౧

అట్లు ఆ పరమర్షులచే బూజింపబడి స్తుతింపబడి ప్రీతుడనై నేను, బ్రహ్మదేవుడు చూచుచు నుండగా నా ధామమునకు దిరిగి వచ్చితిని. ౪౨

ఇది శ్రీ మద్భాగవతము ఏకాదశ స్కంధమున హంసగీతమను పదమూడవ అధ్యాయము.



# ౭ భిక్షుగీత

శ్రీకృష్ణ భగవాను డుద్ధవున కాత్మతత్త్వ ముపదేశించుచు, ముముక్షు వగువానికి ముఖ్యముగా మనస్సంయమము కావలె నని యుపదేశింప మొదలిడెను. సాధారణముగా దుర్జనులవలన సంభవించు నుపద్రవము దుస్సహరూపమున నుండును. ఎంతవారికేని అది మనోవికారమును గలిగింపక మానదు. అయినను, మహాత్ము లగువారు అట్టి వికారమునకు గురి కాకుండునట్లు బుద్ధిబలమున మనస్సు నరికట్టి, భగవత్పరాయణు లగుదురు. మానావమానములు, వానివికారములు, వారి కంటవు. ప్రాపంచిక విషయ వ్యాపారమే లేకుండ వారు అంతర్ముఖులై సంచరింతురు — అని భిక్షుగీతోపాఖ్యాన నిదర్శనమున ఉద్ధవునకు బోధించెను. ఆ కథావిధానమున ఆ భిక్షువుచే గానము చేయబడిన గీతము, శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున ఇరువదిమూడవ యధ్యాయమున వ్యాసభగవానునిచే నిరూపిత మైనది. అది యిటు లున్నది.

శ్రీ శుక ఉవాచ

స ఏవ మాశంసిత ఉద్ధవేన
భాగవతముఖ్యేన దాశార్హ్యబుషభః,
సభాజయన్ భృత్యవచో ముకుంద
స్త మాబభాషే శ్రవణీయవీర్యః. ౧

---

శ్రీశుకు డనెను

దేహాభిమానము రాగద్వేషములు బలీయములు. నీ భక్తులు తప్ప తక్కినవా రెవరును వాని విడువలేరు. కావున దుష్టులు తమ కవమానము గావించిరేని దానిని సహించుట యెట్టివారికిని కష్ట మని తలతు నని భాగవతశ్రేష్ఠు డగు నుద్ధవు డనగా, దాశార్హముఖ్యుడు, వినదగిన అద్భుత చరిత్రములు గలవాడు, నగు శ్రీకృష్ణ భగవానుడు, వానినిగూర్చి యిట్లనెను. ౧

## శ్రీ భగవానువాచ

బార్హస్పత్య! స న హ్యాత్ర భాషితై ర్దుర్జనేరితైః,
దురుక్తై ర్భిన్న మాత్మానం య స్సమాధాతు మీశ్వరః. ౧

న తథా తప్యతే విద్ధః పుమాన్ బాణై రజిహ్మగైః,
యథా తుదంతి మర్మస్థా హ్యసతాం పరుషేషవః. ౩

కథయంతి మహ త్పుణ్య మితిహాస మిహోద్ధవ!
త మహం వర్ణయిష్యామి నిబోధ సుసమాహితః. ౪

కేనచి ద్భిక్షుణా గీతం పరిభూతేన దుర్జనైః,
స్మరతా ధృతియుక్తేన విపాకం నిజకర్మణామ్. ౫

---

## శ్రీకృష్ణుడు చెప్పెను

ఉద్ధవా! దుర్జనులు పలికిన దుర్భాషణములతో నొచ్చిన తన్ను సమాధానపఱుచుకొన జాలిన సాధు వెవడేని లేడనుట నిక్కమే. ౧

దుర్మార్గుల పరుషవాక్యములతో నొచ్చి, బాధపడినంతగా, పురుషుడు, తీక్ష్ణములైన పరులబాణములు వచ్చి మర్మములందు దాకి నొప్పించినను, బాధపడడు. ౩

ఉద్ధవా! ఈ విషయమున అత్యంతము పుణ్యమైన యితిహాస మొకటి వచింతురు. దానిని నీకు నేను చెప్పెదను. సావధానుడవై వినుము. ౪

దుర్జనులు మిక్కిలి పరిభవింపగా నొకానొక భిక్షువు, అది యెల్ల తనకర్మముల ఫలితముగా నిశ్చయించుకొని, ధృతి వహించి, తన యనుభవములను కొన్ని గీతములుగా పలికెను. ౫

అవంతీషు ద్విజః కశ్చి ద్దాసీ దాఢ్యతమః శ్రియా,
వార్తావృత్తిః కదర్యశ్చ కామీ లుబ్ధోఽతికోపనః. ౬

జ్ఞాతయోఽతిథయ స్తస్య వాఙ్మాత్రేణాప్యనర్చితాః,
శూన్యావసథ ఆత్మాపి కాలే కామై రనర్చితః. ౭

దుశ్శీలస్య కదర్యస్య ద్రుహ్యంతే పుత్త్రబాంధవాః,
దారా దుహితరో భృత్యా విషణ్ణా నాచరన్ ప్రియమ్. ౮

తస్యైవం యక్షవిత్తస్య చ్యుతస్యోభయలోకతః,
ధర్మకామవిహీనస్య చుక్రుధుః పంచభాగినః. ౯

---

అవంతీదేశములయం దొక ద్విజుఁడు కలఁడు. ఆతఁడు మిక్కిలి ధనవంతుఁడే యయ్యును, లుబ్ధుఁడు, అత్యాశాపరుఁడు, అతికోపనుఁడు, స్వోదర పూరణ పరాయణుఁడు నై వర్తకము తోడను, వడ్డీవ్యాపారముతోడను జీవించుచుండెను. ౬

ఆతఁడు తన జ్ఞాతులను నోటిమాటతోనైన గౌరవింప లేదు. ధర్మ కామ విహీనమైన ఆతనియింట, వాఁడైనను ఆయా కాలములందు ఆయాకామముల ననుభవించినవాఁడు కాఁడయ్యె. ౭

ఇట్లు దుశ్శీలుఁడై, పుత్త్రదారాదులను బీడించుచు, దేవతా తిథిపూజలు కూడ లేకుండ, బ్రదుకుచున్న ఆతనిని, పుత్త్రులు, బంధువులు, భార్య, కుమార్తెలు, భృత్యులు మున్నగువారు, చాల ఏవగించుకొని, వాని కేమాత్రము ప్రియము నాచరింప కుండిరి. ౮

ఊరకే ధనమును గూడబెట్టి యిట్లు పోషించుచు, ధర్మ కామవిహీనుఁడై ఉభయలోకములకు గాకుండ పోయిన ఆతనిపై పంచయజ్ఞ దేవతలుకూడ కోపము వహించిరి. ౯

తదవధ్యానవిస్రస్త పుణ్యస్కంధస్య భూరిద !
అర్థోప్యగచ్ఛన్నిధనం బహ్వాయాసపరిశ్రమః. ౧౦

జ్ఞాతయో జగృహుః కించిత్ కించిద్దస్యవ ఉద్ధవ !
దైవతః కాలతః కించిద్ బ్రహ్మబంధో ర్నృపార్థివాత్. ౧౧

స ఏవం ద్రవిణే నష్టే ధర్మకామవివర్జితః,
ఉపేక్షిత స్సర్వజనై శ్చింతా మాప దురత్యయామ్. ౧౨

తస్యైవం ధ్యాయతో దీర్ఘం నష్టరాయ స్తపస్వినః,
ఖిద్యతో బాష్పకంఠస్య నిర్వేద స్సుమహా నభూత్. ౧౩

---

ఆ పంచయజ్ఞ దేవతలకు జరిగిన ఆ పరాభవమునకు ఫలముగా అతనిపుణ్యస్కంధము సడలిపోయి ఎంత శ్రమపడినను కృష్యాదులలో సరియగు ఫలము కలుగక, చేతిలోని ధనము కూడ నశించిపోయెను. ౧౦

ఉద్ధవా ! అతని ధనమును కొంత జ్ఞాతులును, కొంత చోరులును, హరించిరి. కొంత దైవము, కొంత కాలము, హరించి వేసెను. కొంత వారు వీరును, కొంత రాజు, హరించి వేసిరి. ౧౧

ఇట్లు తన ధన మంతయు కోలుపోయి, ధర్మకామములకు గూడ చెడియున్న ఆతని నెవ్వరును జూడక ఉపేక్షించిరి. అప్పు డాతడు చాల చింతపడెను. ౧౨

రేయుంబవళ్లు తన పోయిన ధనమును, తన దుర్గతిని, తలచి తలచి, ఏడ్చి ఏడ్చి, ఖేదపడుచు నుండగా నాతనికి గొప్ప నిర్వేదము కలిగెను. ౧౩

స చాహేహ మహో కష్టం! వృథాత్మా మేఽనుతాపితః,
న ధర్మాయ న కామాయ యస్యార్థాయాస ఈదృశః. ౧౪

ప్రాయేణార్థం కదర్యాణాం న సుఖాయ కదాచన,
ఇహ చాత్మోపతాపాయ మృతస్య నరకాయ చ. ౧౫

యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యా యే గుణినాం గుణాః,
లోభః స్వల్పోఽపి తాన్ హంతి శ్విత్రం రూప మివేప్సితమ్.

అర్థస్య సాధనే సిద్ధ ఉత్కర్షే రక్షణే వ్యయే,
నాశోపభోగ ఆయాస స్త్రాసశ్చింతా భ్రమో నృణామ్. ౧౭

---

అప్పు డాత డిట్లనుకొనెను- అక్కటా! కష్టము! ధర్మమునకును కామమునకును గాని యీ అర్థార్జనాయాసమున బడి నేను చాల బాధపడినాను. ౧౪

ధర్మకామములకును దేవతలకును అతిథులకును వినియోగింపక, కూడబెట్టు పరమలోభులకు ధన మెప్పుడును సుఖకారణము కానేరదు. అది యీలోకమునందు పడరాని తాపమును చనిపోయినతరువాత భయంకర నరకమును గూర్చును. ౧౫

యశోవంతు లగువారి శుద్ధయశస్సును గుణవంతు లగు వారి ఉత్తమ గుణములను సైతము, లోభము ఈషణ్మాత్రమే యైనను, చిన్న బొల్లిమచ్చ చక్కని రూపమునువలె చెఱచి వేయును. ౧౬

ధనము సంపాదించుటయందును, పెంచుటయందును, కాపాడుటయందును, వ్యయించుటయందును, తఱిగిపోయినను, అనుభవించుటయందును, మనుజులకు కష్టము, ఆయాసము, దుఃఖము, భ్రమము, గలుగును. ౧౭

స్తేయం హింసాఽనృతం దంభః కామః క్రోధః స్మయో మదః,
భేదో వైర మవిశ్వాసః సంస్పర్ధా వ్యసనాని చ. ౧౮

ఏతే పంచదశానర్థా హ్యర్థమూలా మతా నృణామ్,
తస్మా దనర్థ మర్థాఖ్యం శ్రేయోఽర్థీ దూరత స్త్యజేత్. ౧౯

భిద్యంతే భ్రాతరో దారాః పితరః సుహృద స్తథా,
ఏకాస్నిగ్ధాః కాకణినా సద్యః సర్వేఽరయః కృతాః. ౨౦

అర్థేనాల్పీయసా హ్యేతే సంరబ్ధా దీప్తమన్యవః,
త్యజం త్యసూ౯ స్పృధో ఘ్నంతి సహసోత్సృజ్య సౌహృదమ్.

---

దొంగతనము, హింస, అసత్యము, దంభము, కామము, క్రోధము, గర్వము, మదము, భేదము, వైరము, అవిశ్వాసము, స్పర్థ, స్త్రీవ్యసనము, ద్యూతము, మదము; ౧౮

ఈ పదునైదనర్థములు నరులకు ధనమువలన గలుగుచున్న వని చెప్పబడుచున్నవి. కావున శ్రేయస్సును గోరువాడు అర్థ మనెడు అనర్థమును దూరముగా విడిచివేయవలెను. ౧౯

తమ్ములు, భార్య, తండ్రులు, స్నేహితులు ఒక్కటిగా కలిసియుండి, ఏకప్రాణులై అతిస్నేహముతో నున్నవారు సయితము భేదభావము నొంది, ధనమువలన వెనువెంటనే తీఱని పగవారుగా నగుదురు. ౨౦

అల్పాల్పమైన ధనముమూలమున, శత్రువులై క్రోధమును క్రౌర్యమును బూని, మండిపడి, పరస్పరస్పర్థలతో తలపడి, తమ సౌహార్దము నడచివేసికొని పరస్పరము తగవాడి కొట్టుకొని, తుదకు ప్రాణములనే కోల్పోదురు. ౨౧

లబ్ధ్వా జన్మామరప్రార్థ్యం మానుష్యం తద్ద్విజాగ్ర్యతామ్,
తదనాదృత్య యే స్వార్థం ఘ్నంతి యాం త్యశుభాం గతిమ్.
స్వర్గాపవర్గయో ర్ద్వారం ప్రాప్య లోక మిమం పుమాన్,
ద్రవిణే కోఽనుషజ్జేత మర్త్యోఽనర్థస్య ధామని ? ౨౩
దేవర్షి పితృభూతాని జ్ఞాతిబంధూంశ్చ భాగినః,
అసంవిభజ్య చాత్మానం యక్షవిత్తః పత త్యధః. ౨౪
వ్యర్థయార్థేహయా విత్తం ప్రమత్తస్య వయో బలమ్,
కుశలా యేన సిధ్యంతి జరఠః కిన్ను సాధయే ? ౨౫

---

దేవతలుకూడ కావలెనని కోరుకొనుచుండు మానుష జన్మమును, అందును బ్రాహ్మణజన్మమును పొందియు, దానిని లెక్కింపక అనాదరించి, తమపురుషార్థమును నశింపజేసికొను వారు దుర్గతిని పొందుదురు. ౨౨

స్వర్గమునకును అపవర్గమునకును ద్వారమైన యీలోకమున జన్మింప గలిగి, ఏమర్త్యుఁడు, అనర్థములకు స్థానమైన ధనమునందు ప్రసక్తుఁ డగును? ౨౩

దేవతలకు, ఋషులకు, పితరులకు, భూతములకు, జ్ఞాతులకు, బంధువులకు, పంచయజ్ఞ దేవతలకు, పంచి యీయక, అన్నాదులతో తృప్తి గూర్పక, కేవలము ధనమును గూడబెట్టు నాతఁడు అధఃపతితుఁ డగును. ౨౪

వ్యర్థమైన అర్థకాంక్షతో ప్రమత్తుఁడ నైన నాకు, ధనము వయస్సు, బలము, మున్నగున వన్నియు నశించిపోయినవి. వివేకవంతు లగువారు ధనముతో ధర్మము కామము మున్నగువాని నార్జించి ముక్తులగుదురు. ఇపుడు నేను వృద్ధుఁడనుకూడ నైనాను. ఇం కేమి ఎట్లు సాధింపగలను ? ౨౫

కస్మాత్ సంక్లిశ్యతే విద్వాన్ వ్యర్థమార్థేహయా సకృత్,
కస్యచి న్మాయయా నూనం లోకోఽయం సువిమోహితః. ౨౬

కిం ధనై ర్ధనదై ర్వా కిం కామై ర్వా కామదై రుత ?
మృత్యునా గ్రస్యమానస్య కర్మభి ర్వోత జన్మదైః ? ౨౭

నూనం మే భగవాన్ ప్రీత స్సర్వదేవమయో హరిః,
యేన నీతో దశా మేతాం నిర్వేద శ్చాత్మనః ప్లవః. ౨౮

సోఽహం కాలావశేషేణ శోషయిష్యేఽంగ మాత్మనః,
అప్రమత్తోఽఖిలస్వార్థే యది స్యా త్సిద్ధ ఆత్మని. ౨౯

---

వ్యర్థమైన అర్థాన్, అనర్థములకు మూల మని తెలిసియే యున్నవాడనైతము, దానికొఱకు బాధపడుచునే యుండును. ఏల యన- ఎవనిమాయచేతనో యీలోక మంతయు గాఢముగా మోహితమై యున్నది. ౨౬

ధనముకోసమే ప్రవర్తింపజేయు నీ ధనములతో నేమి ప్రయోజనము ? కామములనే గలిగించు కామములతో మాత్రము లాభ మేమి ? మాటిమాటికి జన్మముల నిచ్చు కర్మములుమాత్ర మెందుకు ? ప్రతిజీవియు మృత్యువుచే గబళించివేయ బడుచునే యుండునుగదా ? ౨౭

సర్వదేవమయు డగు శ్రీహరి నిశ్చయముగా నన్ననుగ్రహించినాడు. అందువలననే నా కట్టిదశయు ఆత్మోద్ధారకమైన యీ నిర్వేదమును గలిగినవి. ౨౮

కావున, నే నింక నాశరీరమును కృశింపజేసికొని, యమ నియమాదులు గలిగి, ధర్మాదిసాధనమున నేమాత్రము ఏమఱక, ఈ మిగిలియున్న నా జీవితకాలమునకే సంతుష్టుడనై సిద్ధుడ నయ్యెదను. ౨౯

తత్ర మా మనుమోదేరన్ దేవా స్త్రిభువనేశ్వరాః,
ముహూర్తేన బ్రహ్మలోకం ఖట్వాంగ స్సమసాధయత్. ౩౦

శ్రీ భగవా నువాచ

ఇ త్యభిప్రేత్య మనసా హ్యావంత్యో ద్విజసత్తమః,
ఉన్ముచ్య హృదయగ్రంథీన్ శాంతో భిక్షు రభూ న్మునిః. ౩౧

స చచార మహీ మేతాం సంయతాత్మేంద్రియానిలః,
భిక్షార్థం నగరగ్రామా నసంగోఽలక్షితోఽవిశత్. ౩౨

తం వై ప్రవయసం భిక్షు మవధూత మసజ్జనాః,
దృష్ట్వా పర్యభవన్ భద్ర! బహ్వీభిః పరిభూతిభిః. ౩౩

---

త్రిభువనేశ్వరు లగు దేవత లెల్లరు ఈ నా సంకల్పమున కనుమతింతురుగాక! ముహూర్తమాత్రమున ఖట్వాంగుడు బ్రహ్మలోకమును సాధించెనుగదా! ౩౦

శ్రీ భగవానుడు చెప్పెను

అని మనసున నిశ్చయించుకొని, అవంతీవాసి యగు నా బ్రాహ్మణుడు, హృదయగ్రంథుల నెడలించుకొని, శాంతుడై మునియై భిక్షుకు డయ్యెను. ౩౧

ఇంద్రియములను శ్వాసలను నియమించుచు, నాతడు, ఈ భూమియం దెల్లెడ దిరుగ నారంభించెను. భిక్షార్థమై నగరములయందును గ్రామములయందును బ్రవేశించుచు, అసంగుడై యుండెను. ౩౨

ఉద్ధవా! వృద్ధుడై అవధూతచర్య నవలంబించిన ఆ భిక్షువును దుర్మార్గులగు జనులు దృష్టులై బహువిధములైన పరాభవములతో బాధింప దొడగిరి. ౩౩

కేచి త్త్రివేణుం జగృహు రేకే పాత్రకమండలూ,
పీఠం చైకేఽక్షసూత్రం చ కంథాం చీరాణి కేచన. ౩౪

ప్రదాయ చ పున స్తాని దర్శితా న్యాదదు ర్మునేః. ౩౫

అన్నం చ భైక్షసంపన్నం భుంజానస్య సరిత్తటే,
మూత్రయంతి చ పాపిష్ఠా నిష్ఠీవం త్యస్య మూర్ధని. ౩౬

యతవాచం వాచయంతి తాడయంతి న వక్తిచేత్,
తర్జయం త్యపరే వాగ్భిః స్తేనోఽయ మితి వాదినః. ౩౭

---

కొందఱు దండమును, కొందఱు పాత్రమును, కొందఱు కమండలమును, కొందఱు పీఠమును, కొందఱు అక్షమాలను, కొందఱు కతుపాలను, కొందఱు బొంతను, కొందఱు నీర్కావి పంచెలను, లాగికొని పోగిరి. ౩౪

ఇదిగో ఇచ్చుచున్నాము. తీసికొనుము. అని చూపి, ఇచ్చి మరల లాగికొనియు, నీయకయు, నిట్లు పెక్కుతెఱగుల వారతనిని బాధించిరి. ౩౫

భిక్షాటనము చేసి తెచ్చికొనిన యన్నమును నదీతీరమున గూర్చుండి భుజించుచు నుండగా, పాపిష్ఠులు కొందఱు చేరి, సరసనే మూత్రములను విడుచుచు, వానితలపై తుబుక్కున నుమియుచు, నుండిరి. ౩౬

వారేమి చేసినను, కిమ్మనక యూరకుండిన, వారు మాటాడించెడివారు. మాటాడకయే యున్న కొట్టెడివారు. కొందఱు దురుక్తులతో నదరించుచు బెదరించుచు నుండెడివారు. వీడు వట్టిదొంగ యని యూరక నిందించువారు. ౩౭

బధ్నంతి తం రజ్జ్వా కేచి ద్బధ్యతాం బధ్యతా మితి,
క్షిపం త్యేకేఽవజానంతి హ్యేష ధర్మధ్వజః శఠః,
క్షీణవిత్త ఇమాం వృత్తి మగ్రహీత్ స్వజనోజ్ఝితః. ౩౭

అహో ఏష మహాసారో ధృతిమాన్ గిరిరాడివ,
మౌనేన సాధయ త్యర్థం బకవ ద్దృఢనిశ్చయః. ౩౮

ఇ త్యేకే విహాసం త్యేన మన్యే దుర్వాతయంతి చ,
తం బబంధు ర్నిరురుధు ర్యథా క్రీడనకం ద్విజమ్. ౪౦

ఏవం స భౌతికం దుఃఖం దైహికం దైవికం చ యత్,
భోక్తవ్య మాత్మనో దిష్టం ప్రాప్తం ప్రాప్త మబుధ్యత. ౪౧

---

పట్టుకొనుడు, కట్టివేయుడు, ఈతడు మోసగా డని పలుకుచు, కొందఱు త్రాళ్ళతో కట్టివేయ సాగిరి. కొందఱు విదలించివేయ దొడగిరి. ఈతడు వట్టి ధర్మధ్వజుడు, శఠుడు. ఈ వేషము వేసినాడు. తన ధన మంతయు నయిపోవుటచేత, స్వజనుల కందఱకు దూరమై ఈత డీవృత్తి నవలంబించి, ఈవేషము వేసినా డని ఊరక నిందింప దొడగిరి. ౩౭

ఆహా! ఈతడు చాల బలము గలవాడు. పెద్దకొండవలె అత్యంతము ధైర్యము కలవాడు. కొంగవలె దృఢనిశ్చయముతో చలింపక, ఇట్లు మౌనముగా నుండి, తనకు గావలసిన యర్థమును సంపాదించుకొనుచున్నాడు. ౩౮

అని కొంద ఱిట్లు ఎగతాళి చేయుచుండిరి. మఱికొందఱు వానిపై అపానవాయువులను విడుచుచుండిరి. ఇట్లు దుష్టులు కొందఱు వానిచుట్టును గ్రమ్మి, పెంపుడు పక్షినివలె బట్టుకొని బంధించిరి.

ఇట్లాభిక్షువు, భౌతిక మైనట్టియు, దైహిక మైనట్టియు, దైవిక మైనట్టియు, దుఃఖము నెల్ల నది తన ప్రారబ్ధము వలన

పరిభూత ఇమాం గాథా మగాయత నరాధమైః,
పాతయద్భిః స్వధర్మస్థో ధృతి మాస్థాయ సాత్త్వికీమ్. ౪౨

భిక్షు రువాచ

నాయం జనో మే సుఖదుఃఖహేతు
ర్న దేవతాత్మగ్రహకర్మకాలాః,
మనః పరం కారణ మామనంతి
సంసారచక్రం పరివర్తయే ద్యత్. ౪౩

మనో గుణాన్ వై సృజతే బలీయ
స్తతశ్చ కర్మాణి విలక్షణాని,

---

సంభవించినదే యనియు, తా ననుభవించి తీరవలసినదే యనియు, తలచి, అనుభవించుచు నుండెను. ౪౧

అట్లాదుర్జనులు పెక్కురీతుల ద న్నవమానించియు, స్వధర్మమున నిలిచి చలింపక యున్న త న్నధఃపతితుని జేయ బూనియు, బాధింపగా, ఏమాత్రము క్రోధముగాని, వికారము గాని, పొందక, ఆతడు సాత్త్వికమైన ధృతి వహించి, ఈ గాథ నిట్లు గానము చేసెను. ౪౨

భిక్షు వనెను

ఈ జనముగాని, దేవతలుగాని, ఆత్మగాని, గ్రహములు గాని, కర్మగాని, కాలముగాని, నాకు సుఖదుఃఖములకు హేతువులు కావు. సంసారచక్రమును ప్రవర్తింపజేయు మనస్సే సుఖదుఃఖములకు పరమకారణము అని వచింతురు. ౪౩

మనస్సు అతిబలిష్ఠమైనది. అది గుణములను సృజించును. వానివలన శుక్లములు కృష్ణములు అతిలోహితములు నై విల

శుక్లాని కృష్ణా న్యతిలోహితాని
తేభ్యః సవర్ణాః సృతయో భవంతి. ౪౪

అనీహ ఆత్మా మనసా సమీహతా
హిరణ్మయో మత్సఖ ఉద్విచష్టే,
మనః స్వలింగం పరిగృహ్య కామాన్
జుష న్నిబద్ధో గుణసంగతో౽సౌ. ౪౫

దానం స్వధర్మో నియమో యమశ్చ
శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని,
సర్వే మనోనిగ్రహలక్షణాంతాః
పరో హి యోగో మనస స్సమాధిః. ౪౬

---

క్షణములైన కర్మములు కలుగుచున్నవి. వానివలన, తత్తత్క ర్మానురూపము లగు దేవ తిర్య జ్నరాది జాతులలో జన్మములు సంభవించుచున్నవి. ౪౪

నియంతయై మనస్సుతోగూడ వర్తించుచున్నను, ఆత్మకు ఎట్టి క్రియాసంగము లేదు. ఆతడు విద్యాశక్తిప్రధానుడు. కేవలము బుద్ధిసాక్షి. జీవుని నియమించుచు అతిరోహిత మైన జ్ఞానముతో చూచుచు, సాక్షియై మాత్రమే యుండును. జీవుడు మాత్రము తనదేహము నాత్మగా దలచి, మనోగుణములైన కర్మలతో సంగతుడై శబ్దాది విషయముల ననుభవించుచు, వానిచే బద్ధు డగుచున్నాడు. ౪౫

దానము స్వధర్మము నియమము యమము శ్రుతము కర్మములు వ్రతములు మున్నగువాని కన్నిటికిని మనోనిగ్రహమే ఫలము. మనస్సు నరికట్టుటయే ఉత్తమోత్తమమైన యోగము.

సమాహితం యస్య మనః ప్రశాంతం
దానాదిభిః కిం వద తస్య కృత్యమ్,
అసంయతం యస్య మనో వినశ్యద్
దానాదిభిశ్చే దపరం కిమేభిః ? ౪౭

మనోవశేఽన్యే హ్యభవంశ్చ దేవా
మనశ్చ నాన్యస్య వశం సమేతి,
భీష్మో హి దేవ స్సహస స్సహీయాన్
యుంజ్యా ద్వశే తం స హి దేవదేవః. ౪౮

తం దుర్జయం శత్రు మసహ్యవేగ
మరుంతుదం త న్న విజిత్య కేచిత్,
కుర్వం త్యసద్విగ్రహ మత్ర మర్త్యై
ర్మిత్రా ణ్యుదాసీనరిపూం శ్చ మూఢాః. ౪౯

---

ఎవనిమనస్సు సమాహితమై ప్రశాంతమై యుండునో, వానికి దానాదులతో నేమి పని? ఎవనిమనస్సు సమాహితము కాకుండ ఆలస్యాదులకు లోనై యుండునో, దానాదు లాచరించియు, వానికి గలుగ గలుగు ప్రయోజనాంతర మేమి గలదు?

దేవతలు తదితరులు సైతము మనస్సునకు లోబడి యున్నారు. మనస్సుమాత్ర మెవనికిని లోబడియుండలేదు. మనోలక్షణ మగు దేవుడు బలవంతులకంటెను బలవంతుడును, భయంకరుడును. కావున ఆ మనోలక్షణదేవుని దనవశమున గొననేర్చు వానిని దేవదేవుడే యని యనవచ్చును. ౪౮

సహింపరాని రాగాదిరూప వేగము గలిగి, జయింప నలవి గాక, మర్మములు ఛేదించు మనశ్శత్రువును జయింపనేరక,

దేహం మనోమాత్ర మిమం గృహీత్వా
మమాఽహ మి త్యంధధియో మనుష్యాః,
ఏషోఽహ మన్యోఽహ మితి భ్రమేణ
దురంతపారే తమసి భ్రమంతి. ౨౦

జనోఽస్య హేతు స్సుఖదుఃఖయో శ్చేత్
కి మాత్మన శ్చాత్ర హి భౌమయో స్తత్ ?
జిహ్వాం క్వచిత్ స్వాం దశతి స్వదద్భి
స్తద్వేదనాయాం కతమాయ కుప్యేత్? ౨౧

దుఃఖస్య హేతు ర్యది దేవతా స్తు
కి మాత్మన స్తత్ర వికారయో స్తత్?

---

కొందఱు మర్త్యులు మూఢులై మిత్రు లనియు, శత్రు లనియు, తటస్థు లనియు, నితరులను భావించుచు, వ్యర్థముగా గొంద ఱితో వైరము బెట్టుకొనుచు నుందురు. ౧౯

మనోమాత్ర పరికల్పిత మైన యీ దేహమును నా దనియు, నే ననియు, దలపోసి, అంధదృష్టులై మనుష్యులు ఇతడు నేను, ఇతఁడు పరుఁడు నను భ్రమముతో దాట రాక నిరవధిక మైన సంసారమునందు పడిపోయి భ్రమించుచు నుందురు. ౨౦

ఈ దేహమునకు సుఖదుఃఖములను గల్పించునది దేహమే యని యనుకొన్నను ఆ రెండు దేహములు పృథివీవికారములే గదా! అట్టిచో, నొకటి మఱొకదానిని బాధించు టెట్లు? తన దంతములతో తననాలుకను కొఱికికొన్నచో, అపుడు కలుగు ఆ బాధనుగుఱించి, ఎవరిపై గోపింప వలనుపడును? ౨౧

ఒకవేళ దేహాధిష్ఠాత లగు దేవతలు దుఃఖమునకు గారణ మని యన్నను వికారములు గలవానికే గదా సుఖదుఃఖములు

యదంగ మంగేన నిహన్యతే క్వచిత్
క్రుధ్యేత కస్మై పురుష స్తతోఽన్యః? ౫౨

ఆత్మా యది స్యా త్సుఖదుఃఖహేతుః
కి మన్యత స్తత్ర నిజస్వభావః?
న హ్యాత్మనోఽన్య ద్యది త న్మృషా స్యాత్
క్రుధ్యేత కస్మా న్న సుఖం న దుఃఖమ్. ౫౩

గ్రహా నిమిత్తం సుఖదుఃఖయో శ్చేత్
కి మాత్మనోఽజస్య జనస్య తే వై?

---

గలుగునది? ఆత్మయును దేవతలును నిర్వికారులే. ఒకప్పు డొక యవయవము మఱొక యవయవమును కొట్టిన దగునేని, తదన్యు డగు పురుషు డెవనిని గోపింప నగును? ౫౨

ఆత్మ సుఖదుఃఖములకు గారణ మని యందుమేని, ఆత్మ యొక్క నిజస్వభావము మఱొకరీతిగా నెట్లు పరిణమింపగలదు? అంతియగాక, ఒకయాత్మవలన మఱొకయాత్మకు సుఖదుఃఖములు గలుగు టెట్లు? ఆత్మకంటె వేఱయిన దెయ్యదియు లేదుగదా? ఒకవేళ ప్రత్యగాత్మ అట్లు చేయుచున్న దని యన్నను, ఆత్మ సుఖదుఃఖాది వికారముల కాశ్రయ మైనదని చెప్పవలసి వచ్చును. అట్టి లక్షణము ఆత్మకు లేదు. అట్టిచో, ఆత్మ కెవనివలన సుఖము గాని, దుఃఖముగాని, కలుగ గలదు? ఆత్మస్వభావ మిట్టిది కావున, నింక నెవనినిగుఱించి కోపింప వీలగును? ౫౩

సుఖదుఃఖములకు గ్రహములు కారణ మని యందుమేని అవి జనించువానికి గదా! ఆత్మ అజము. కావున, గ్రహము లింక నాత్మపై దమ ప్రభావము నెట్లు ప్రసరింపజేయ గలవు?

గ్రహై ర్గ్రహాస్యైవ వదంతి పీడాం
క్రుధ్యేత కస్మై పురుష స్తతోఽన్యః ? ౫౪

కర్మాఽస్తు హేతు స్సుఖదుఃఖయో శ్చేత్
కి మాత్మన స్తద్ధి జడాజడత్వే ?
దేహ స్త్వచిత్ పురుషోఽయం సుపర్ణః
క్రుధ్యేత కస్మై న హి కర్మమూలమ్ ? ౫౫

కాలస్తు హేతుః సుఖదుఃఖయో శ్చేత్
కి మాత్మన స్తత్ర తదాత్మకోఽసౌ,
నాగ్నే ర్హి తాపో న హిమస్య తత్ స్యాత్
క్రుధ్యేత కస్మై న పరస్య ద్వంద్వమ్ ? ౫౬

---

అది యటు లుండ, గ్రహములవలన గ్రహములకే పీడ గలుగుచున్న దని యందురు. కావున, వాని యన్నిటికంటె నన్యుడైన పురుషు డెవనిని గోపింప నగును ? ౫౪

కర్మము, సుఖదుఃఖములకు గారణ మని యన్నను, ఆత్మకు కర్మములు లేవు. దేహము జడము. దానికి స్వయముగా నెట్టి ప్రవృత్తియు లేదు. ఆత్మ అజడము. చిత్స్వరూపము. ఇవి రెండును స్వభావమున పరస్పరము విరుద్ధములు. కావున, నిది కర్మమూలము కాదని నిశ్చిత మగుచుండ, నిక నెవనిపై గోపింప వీలగును ? ౫౫

సుఖదుఃఖములకు గారణము కాల మని యన్నను, కాలము ఆత్మస్వరూపమే యగుటవలన దానివలన నాత్మకు గలుగున దేమి? స్వాంశమువలన తనకే యెట్టి వికృతియు గలుగ

న కేనచిత్ క్వాపి కథం చ నాస్య
ద్వంద్వోపరాగః పరతః పరస్య,
యథాహమ స్సంసృతిరూపిణః స్యా
దేవం ప్రబుద్ధో న బిభేతి భూతైః. ౫౭

ఏతాం స ఆస్థాయ పరాత్మనిష్ఠా
మధ్యాసితాం పూర్వతమై ర్మహర్షిభిః,
అహం తరిష్యామి దురంతపారం
తమో ముకుందాంఘ్రినిషేవయైవ. ౫౮

---

నేరదుకదా? అగ్నికి అగ్నిజ్వాలవలన తాపముగాని, మంచునకు ఒక మంచుబొట్టువలన చల్లదనముగాని, కలుగ నేరదుగదా? ఆ అంశము పరమేకావున, దానివలన ఆత్మకు సుఖదుఃఖములు కలుగు నని యనరాదు. అగ్నిజ్వాల అగ్నికిగాని, తుషారకణము తుషారమునకుగాని, బాధకము కానట్లు, పరము పరము నెన్నడు బాధింప నేరదు. అట్టియెడ నింక నెవనిపై గోపింపవచ్చును? ౫౬

ఇట్లు పూర్వోదాహృతములైన యాఱింటిచేగాని, మఱి యింక దేనిచేతగాని, ఎప్పుడుగాని, ఏవిధముగాగాని, యీ యాత్మకు సుఖదుఃఖాదులు కలుగనేరవు. సంసారమును గలిగించు అహంకారమువలననే యీ సుఖదుఃఖాదు లన్నియు గలుగుచున్నవి. కావున, మనస్సును నియమించుకొన గలవానికి అట్టివానిసాక్షినియు నుండదు. అని యిట్లు నిశ్చయముగా దెలిసికొనినవానికి, భూతములవలన నేమాత్రము భీతియేగలుగదు.

ఇట్లాభిక్షువు తలపోసి, పూర్వతములగు మహర్షులచే నవలంబింపబడిన పరాత్మనిష్ఠను పొంది, నేనుకూడ ముకుంద

శ్రీ భగవానువాచ

నిర్విద్య నష్టద్రవిణో గతక్లమః
ప్రవ్రజ్య గాం పర్యటమాన ఇత్థమ్,
నిరాకృతోఽసద్భి రపి స్వధర్మా
దకంపితోఽమూం ముని రాహ గాథామ్, ౫౯

సుఖదుఃఖప్రదో నాన్యః పురుష స్యాత్మవిభ్రమః,
మిత్రోదాసీనరిపవ స్సంసార స్తమసః కృతః. ౬౦

---

పాదారవిందసేవతో దురంతపారమైన సంసారమును దాటుదు నని నిశ్చయించుకొనెను. ౫౮

శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను

అట్లు ధన మంతయు పోయి, నిర్వేదము నొంది, దాని వలన నేమియు బాధపడక, సన్న్యసించి, భూమియందు సంచరించుచు, అసత్పురుషు లగువారు నిరాకరించి పరాభవించినను, స్వధర్మమునుండి చలింపక, స్థిరుడై మౌనియై యున్న ఆ ముని ఈగాథను గానము చేసెనుజుమా! ౫౯

పురుషునకు సుఖమును దుఃఖమును గలుగజేయునది మనోవిభ్రమమేగాని, వేఱొండు గాదు. మిత్రులు శత్రులు ఉదాసీనులు సంసారము సమస్తము అజ్ఞానమువలననే కలుగుచున్నది. కావున, ఒకటి చూచి మఱొకటిగా భ్రమించి భావించు మనస్సు వలననే ఈ అనర్థ మంతయు గలుగుచున్నది. ౬౦

తస్మాత్సర్వాత్మనా తాత! నిగృహాణ మనో ధియా,
మయ్యావేశితయా యుక్త ఏతావాన్ యోగసంగ్రహః. ౬౧

య ఏతాం భిక్షుణా గీతాం బ్రహ్మనిష్ఠాం సమాహితః,
ధారయన్ శ్రావయన్ శృణ్వన్ ద్వంద్వై ర్నైవాభిభూయతే.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే భిక్షుగీతం నామ
త్రయోవింశోఽధ్యాయః.



---

కావున నో ఉద్ధవా! నాయందు ప్రవేశింపజేయబడి నిగూఢమై నిశ్చయాత్మకమైన బుద్ధి కలిగి, నీవు సర్వాత్మనా మనస్సును నిగ్రహింపుము. ఇదియే యోగము. దీనిని సంగ్రహముగా నీకు నే నుపదేశించినాను. ౬౧

భిక్షువుచే గానము చేయబడిన యీ బ్రహ్మనిష్ఠను సమాహితమైన మనస్సు గలవాడై యెవడు ధారణచేయునో, వినునో వినిపించునో, ఆతడు ద్వంద్వములచే బాధింపబడడు. ౬౨

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున భిక్షుగీత మను
ఇరువదిమూడవ యధ్యాయము.



# అవధూతగీత

అవధూతగీత, శ్రీవిష్ణుభాగవతము దశమస్కంధమునందలిది. శ్రీకృష్ణ భగవానుడు, సంన్యాసయోగము నుపదేశింపగా విని, పరమ భాగవతోత్తము డగు నుద్ధవుడు – దేవా! భవన్మాయామోహితుడనై మూఢచిత్తుడ నగు నాకు నీయుపదేశించిన సంన్యాసయోగము సాధింప నలవి గానిదిగా తోచుచున్నది. నే నది యెట్లు ధరించి, సాధింపగలనో, ఉపదేశింపుము. నీకంటె దెలిసిన వాడును, ఉపదేష్టయు లేడు. కావున, నన్ననుగ్రహింపు – మని వేడగా, శ్రీకృష్ణ భగవాను డిట్లనెను —

"ఉద్ధవా! నీ వనినది సత్యమే. లోకములో తత్త్వవిచక్షణులైన మునులు తమ్ము దామే యుద్ధరించుకొందురు. మానవసృష్టిలో గల విశేషము సమితి మయ్యదియే. పశువులు జ్ఞానరహితములు. మానవు లట్లు గాదు. కావున, దేహ గేహాభిమానములను వదలి, సమభావనులై, అసంగులై చరించుచు, మదారాధనమున నన్నే పొందవలయును. అట్టి వ్రతమున నుండువా రవధూత లని వచింపబడదురు. వారికి మద్భావన తప్ప ఇతర ముండదు. వారి నాయా లక్షణములతోడనే బుద్ధిమంతు డగువాడు తెలిసికొనవలెను. ఆత్మారాము లగు నట్టి మహనీయులు, నిగూఢతేజమున లోకోద్ధరణ పరాయణులై సంచరించుచు, నాయా లక్షణములతోడను, ప్రమాణములతోడను, నన్నే విచారించుచుందురు. వివేకము గలవాడు. నిర్విణ్ణుడై, యిట్టి స్థితినే పొందవలెను. అంతియగాక – లోకములో మత్సృష్టము లైన ప్రాణు లనేకము లున్నవి. వానియన్నిటివలన నొక్కొక విశేషమును తత్త్వవివిత్సు వగువాడు, నేర్చికొనవలెను. అట్టివాడే. తనకు దానే గురువుగా బనుపడి, లోకతత్త్వము నెఱిగికొని, ఆత్మోద్ధరణము గావించుకొన నేర్చును."

అని బోధించుచు, అవధూత యదు సంవాద రూపమైన యితిహాసమును దృష్టాంతమునకై నొడివినట్లు, శ్రీశుకుడు పరీక్షిత్తున కుపదేశించెను. ఇందు, సముడై, లోకవ్యవహారాతీతు డగు మహనీయుని మహోన్నతస్థితి సర్వాత్మనా వర్ణింపబడుచు, సంన్యాసిధర్మములుకూడ, నిరూపితము లైనవి.

## శ్రీకృష్ణ ఉవాచ

అవధూతం ద్విజం కఞ్చి చ్చరంత మకుతోభయమ్,
కవిం నిరీక్ష్య తరుణం యదుః పప్రచ్ఛ ధర్మవిత్. ౧

## యదు రువాచ

కుతోను ధీ రియం బ్రహ్మ న్నకర్తు స్సువిశారదా,
యా మాసాద్య భవాన్ లోకే విద్వాం శ్చరతి బాలవత్. ౨

ప్రాయో ధర్మార్థకామేషు వివిత్సాయాం చ మానవాః,
హేతునేహ సమీహంతే ఆయుషో యశసః శ్రియః. ౩

త్వం తు కల్యః కవి ర్దక్ష స్సుభగో మితభాషణః,
న కర్తా నేహసే కించి జ్జడోన్మ త్తపిశాచవత్. ౪

---

## శ్రీకృష్ణుడు చెప్పెను

ఎవరివలనను ఎట్టి భయము లేక, చరించుచు, సర్వజ్ఞుడై, యువావస్థలో నున్న ఒకానొక అవధూతను జూచి, ఒకప్పుడు ధర్మవేత్త యైన యదుమహారాజి ట్లని ప్రశ్నించెను. ౧

## యదు పనెను

బ్రాహ్మణుడా! ఏ కర్మములను జేయ నిచ్ఛగింపక, అతి ప్రసన్న మైన బుద్ధిని నీ వెట్లు పొంద గలిగితివి? ఈబుద్ధితో నీవు, విద్వాంసుడవే అయ్యు, బాలుడువలె సంచరించుచున్నావు. ౨

ఈలోకమునందు తఱచు, మానవులు, ధర్మార్థకామము లను దెలిసికొనుటకును, ఆయువు, యశస్సు, సంపద, వీనిని బడ యుటకును, ప్రయత్నించు చుందురు. ౩

నీవో, సమర్థుడవు, తెలిసినవాడవు, అందగాడవు, గుణ భూషితుడవు, మితభాషివి, అయియుండియు, ఏపనిని జేయ నిచ్ఛ

జనేషు దహ్యమానేషు కామలోభభవాగ్నినా,
న తప్యసేఽగ్నినా ముక్తో గంగాంభస్స్థ ఇవ ద్విపః.

త్వం హి నః పృచ్ఛతాం బ్రహ్మ న్నాత్మ న్యానందకారణమ్,
బ్రూహి స్పర్శవిహీనస్య భవతః కేవలాత్మనః. ౬

## శ్రీకృష్ణ ఉవాచ

యదునైవం మహాభాగో బ్రహ్మణ్యేన సుమేధసా,
పృష్టః సభాజితః ప్రాహ ప్రశ్రయావనతం ద్విజః. ౭

---

గింపక, దేనిని కోరక, జడుడువలె, ఉన్మత్తుడువలె, పిశాచమువలె, ప్రవర్తిలుచున్నావు. ౪

లోకములో నందఱు జనులు, కామ లోభములవలన, బుట్టిన అగ్నితో తగులబడి పోవుచున్నారు. నీవు మాత్రము, గంగానదినీటిలో నున్న గజమువలె ఆ అగ్నితాపమునకు గుఱి గాకున్నావు. ౫

కావున, ఓ బ్రాహ్మణుడా! విషయభోగ రహితుడవై, కళత్రాది శూన్యుడవై, కేవలుడవై యున్న నీవు, ఆత్మానందము నె ట్లనుభవించుచున్నావో, చెప్పుము. తెలిసికొనవలె నని వే మడుగుచున్నాము. ౬

## శ్రీకృష్ణుడు చెప్పెను

బ్రహ్మణ్యుడు మహామేధావి యగు యదు విట్లు సగౌరవముగా నడుగగా, వినయముతో నమస్కరించుచున్న ఆ యదువునుగూర్చి, ఆ అవధూత యి ట్లనెను. ౭

బ్రాహ్మణ ఉవాచ

సంతి మే గురవో రాజన్! బహవో బుద్ధ్యుపాశ్రితాః,
యతో బుద్ధి ముపాదాయ ముక్తోఽటామీహ తాన్ శృణు. ౮
పృథివీ వాయు రాకాశ ఆపోఽగ్ని శ్చంద్రమా రవిః,
కపోతోఽజగరః సింధుః పతంగో మధుకృ ద్గజః. ౯
మధుహా హరిణో మీనః పింగళా కురరోఽర్భకః,
కుమారీ శరకృ త్సర్ప ఊర్ణనాభి స్సుపేశకృత్. ౧౦
ఏతే మే గురవో రాజం శ్చతుర్వింశతి రాశ్రితాః,
శిక్షావృత్తిభి రేతేషా మన్వశిక్ష మిహాత్మనః. ౧౧

---

బ్రాహ్మణుడు చెప్పెను

రాజా! నాకు పలువురు గురువులు గలరు. వారి నందఱను నేను నాబుద్ధితోనే ఆశ్రయించినాను. వారిని జూచి నేర్చుకొనిన, యీబుద్ధితో, ముక్తుడనై చరించుచున్నాను. ఆ గురువులను జెప్పెదను వినుము. ౮

పృథివి, వాయువు, ఆకాశము, నీరు, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, పావురము, కొండచిలువ, సముద్రము, మిడుత, తేనె టీగ, ఏనుగు; ౯

తేనెను గ్రహించువాడు, హరిణము, చేప, పింగళ యను వేశ్య, కురరము, పసిపిల్లవాడు, కన్య, ఇషుకారుడు, పాము, సాలీడు, తుమ్మెద; ౧౦

రాజా! ఈ యిరువదినలుగురను నేను నా గురువులనుగా స్వీకరించినాను. వారివారి చర్యలనుబట్టి, నాకు నేనుగా నేర్చు కొనినాను. ౧౧

యతో యదనుశిక్షామి యథా వా నాహుషాత్మజ !
త త్తథా పురుషవ్యాఘ్ర ! నిబోధ కథయామి తే. ౧౨

భూతై రాక్రమ్యమాణోఽపి ధీరో దైవవశానుగైః,
త ద్విద్వా న్న చలే న్మార్గా దన్వశిక్షం క్షితే ర్వ్రతమ్. ౧౩

శశ్వ త్పరార్థసర్వేహః పరార్థైకాంతసంభవః,
సాధు శ్శిక్షేత భూభృత్తో నగశిష్యః పరాత్మతామ్. ౧౪

ప్రాణవృత్త్యైవ సంతుష్యే న్ముని ర్నైవేంద్రియప్రియైః,
జ్ఞానం యథా న నశ్యేత నావకీర్యేత వా జ్మనః. ౧౫

---

యదుమహారాజా! ఎవరివలన ఏది నేర్చుకొంటినో, అది యంతయు నీకు జెప్పుచున్నాను. వినుము. ౧౨

దైవవశానుగములైన భూతము లాక్రమించి [illegible] పీడించినను, ధీరుడై యుండి, విద్వాంసు డగువాడు, స్వధర్మ మార్గమునుండి చలింపరాదు. ఇది నేను పృథివివలన నేర్చుకొంటిని.

పరులకొఱకే తన సమస్తము నుపయోగించుటయు, పరుల కొఱకే పుట్టుటయు, కొండలవలనను, పరాధీనత్వము చెట్లవలనను, సాధు వగువాడు నేర్చుకొనవలెను. ( పర్వత వృక్ష స్వరూపమైన పృథివినుండి నే నిది నేర్చుకొంటిని. ) ౧౪

జ్ఞానము నశింపకుండుటకును, వాక్కు మనస్సు విక్షేపమును పొందకుండుటకును, ప్రాణాధారణమునకు మాత్రమే సరిపడు నాహారాదికములను సేవింపవలెనేకాని, ఇంద్రియప్రీతికొఱకు గ్రహింపగూడదు. ౧౫

విషయే ష్వావిశన్ యోగీ నానాధర్మేషు సర్వతః,
గుణదోషవ్యపేతాత్మా న విషజ్జేత వాయువత్. ౧౬
పార్థివే ష్విహ దేహేషు ప్రవిష్ట స్తద్గుణాశ్రయః,
గుణై ర్న యుజ్యతే యోగీ గంధై ర్వాయు రివాత్మదృక్. ౧౭
అంతర్హిత శ్చ స్థిరజంగమేషు
బ్రహ్మాత్మభావేన సమన్వయేన,
వ్యాప్త్యా వ్యవచ్ఛేద మసంగ మాత్మనో
ముని ర్నభ స్త్వం వితతస్య భావయేత్. ౧౮
తేజోబన్నమయై ర్భావై ర్మేఘాద్యై ర్వాయునేరితైః,
న స్పృశ్యతే నభ స్తద్వ త్కాలసృష్టై ర్గుణైః పుమాన్. ౧౯

---

నానాధర్మము లైన శీతోష్ణాది విషయములయందు జొచ్చియు, యోగి యగువాడు, గుణదోషములకు దూరమై, వాయువువలె నెందును దగులువడ గూడదు. ౧౬

పార్థివములైన దేహములందు ప్రవేశించి, బాల్యాదికము లగు వానివాని గుణముల నాశ్రయించినను, యోగి, ఆత్మద్రష్టయై మెలగుచు, వాయువు గంధముచే లిప్తుడు గానట్లు, గుణములచే లిప్తుడు కాకుండ నుండవలెను. ౧౭

స్థిర జంగమములయం దన్నిటి లోపల వెలుపల, అవ్యవచ్ఛిన్నముగా వ్యాపించియున్నను, ఆకాశము దేనితోను అంటక, విస్తారమై యుండును. అట్లే, యెల్లెడ బ్రహ్మాత్మభావమునే దర్శించుచు, ఎందును సంగము గొనక యుండవలెను. ౧౮

వాయుప్రేరితములై వచ్చి క్రమ్మినను, మేఘములచే ఆకాశము అంటబడదు. అట్లే, పృథివ్యప్తేజోన్నమయములై కాల సృష్టము లైన దేహాదులచే, పురుషు డెన్నడును స్పృశింపబడడు.

స్వచ్ఛః ప్రకృతితః స్నిగ్ధో మాధుర్య స్తీర్థభూ ర్నృణామ్,
మునిః పునా త్యపాం మిత్ర మీక్షోపస్పర్శకీర్తనైః. ౨౯

తేజస్వీ తపసా దీప్తో దుర్ధర్షోదరభాజనః,
సర్వభక్షోఽపి యుక్తాత్మా నాదత్తే మల మగ్నివత్. ౩౦

క్వచి చ్ఛన్నః క్వచిత్ స్పష్ట ఉపాస్యః శ్రేయ ఇచ్ఛతామ్,
భుంక్తే సర్వత్ర దాతౄణాం దహ న్ప్రాగుత్తరాశుభమ్. ౩౧

స్వమాయయా సృష్ట మిదం సదసల్లక్షణం విభుః,
ప్రవిష్ట ఈయతే తత్ర తద్రూపోఽగ్ని రివైధసి. ౩౨

---

స్వచ్ఛత్వము, సహజస్నిగ్ధత్వము, మాధుర్యము, పవిత్రత్వము, కలిగి, ముని యగునాతడు, దర్శన స్పర్శన కీర్తనముల చేత, నీరువలె, నరులకు పరమమిత్రము కావలెను. ౨౯

తేజస్వియై, తపోదీప్తుడై, దుర్ధర్షుడై, ఉదరభాజనుడై, అపరిగృహీతయై, సర్వభక్షుడై యుండియు, నియమితేంద్రియుడగు ముని, అగ్నిహోత్రమువలె మాలిన్యము నొందక వెలుగుచుండును. ౩౦

ఒక్కొక్కచో మఱుగుపడి యుండి, ఒక్కొక్కచో స్పృశింపబడుచు, శ్రేయోర్థు లగువారిచే నుపాసింపబడుచు, పరులొసంగినదానిని భక్షించుచు, ముని అగ్నిహోత్రుడువలె, పరుల త్రైకాలికపాపమును నశింప జేయుచుండవలెను. ౩౧

స్వమాయచే సృజింపబడి సదసల్లక్షణ మైన యిద్దానియందు ప్రవేశించి, పరమాత్మ, ఉపాధులయందు జొచ్చిన అగ్నివలె తల్లక్షణములతో భాసించుచున్నట్లు, యోగియు మెలగవలెను. ౩౨

విసర్గాద్యాః శ్మశానాంతా భావా దేహస్య నాత్మనః,
కళానా మివ చంద్రస్య కాలేనావ్యక్తవర్త్మనా. [illegible]

కాలేన హ్యోఘవేగేన భూతానాం ప్రభవాప్యయా,
నిత్యా వపి న దృశ్యేతే హ్యాత్మనోఽగ్నే ర్యథార్చిషామ్. [illegible]

గుణై ర్గుణా నుపాదత్తే యథాకాలం విముంచతి,
న తేషు యుజ్యతే యోగీ గోభి ర్గా ఇవ గోపతిః. [illegible]

బుధ్యతే స్వేన భేదేన వ్యక్తిస్థ ఇవ తద్గతః,
లక్ష్యతే స్థూలమతిభి రాత్మా చాంభస్థితార్కవత్. [illegible]

---

జన్మము మొదలు శ్మశానాంతము మైన [illegible] లన్నియు దేహమునకేగాని, ఆత్మకు గావు. వృద్ధి[illegible] కళలకేగాని, చంద్రునకు గాదుగదా! అగ్నే, అవన్నియు, [illegible] గతి యగు కాలమువలన గలుగుచున్నవి. [illegible]

అగ్నికి గాక, అగ్నిజ్వాలలకు మాత్రమే [illegible] ములయందు ఉత్పత్తిలయములు గలుగునట్లు, [illegible] అతివేగవంతమైన కాలమువలన ఉత్పత్తిలయములు [illegible] కలుగుచున్నవి గాని, ఆత్మకు గాదు. [illegible]

సూర్యుడు తనకిరణములతో నీటిని గ్రహించి, [illegible] విడిచిపుచ్చునటులు, యోగి, గుణములతో [illegible] గ్రహించి, యథాకాలముగా విడిచిపెట్టుచు[illegible] దభినివేశము బూనడు. [illegible]

నీటిలో ప్రతిఫలించిన సూర్యునివలె, [illegible] నాత్మను, తమబుద్ధివలననే, స్థూలబుద్ధు లగువారు, [illegible] భేదభావమున దలపోయుచుందురు.

నాతిస్నేహః ప్రసంగో వా కర్తవ్యః క్వేచిత్ క్వచిత్,
కుర్వన్ విందేత సంతాపం కపోత ఇవ దీనధీః. ౨౮

కపోతః కశ్చ నారణ్యే కృతనీడో వనస్పతౌ,
కపోత్యా భార్యయా సార్థ ముపాస కతిచి త్సమాః. ౨౯

కపోతౌ స్నేహగుణితహృదయౌ గృహధర్మిణౌ,
దృష్టిం దృష్ట్యాంగ మంగేన బుద్ధిం బుద్ధ్యా బబంధతుః. ౩౦

శయ్యాస నాటన స్థాన వార్తా క్రీడాశ నాదికమ్,
మిథునీభూయ విస్రబ్ధౌ చేరతు ర్వనరాజిషు. ౩౧

---

ఎవనితోడను, ఎచ్చటను, ఎన్నడును, అతిస్నేహముగాని, అతిప్రసంగముగాని, చేయగూడదు. చేసినచో, దీనతకు లోనై, కపోతమువలె సంతాపము నొందవలసి వచ్చును. ౨౮

ఒకయడవిలో నొకపావురము ఒకచెట్టుపై గూడు కట్టుకొని, తనపెంటితో సుఖముగా వసించుచుండెను. ౨౯

ఆ పావురములు రెండును పరస్పర మత్యంత స్నేహమున చూపులు బుద్ధి యొకటిగా బనుపడి, గృహధర్మమును నెఱపుచు నుండెను. ౩౦

పరుండుట కూర్చుండుట తిరుగుట నిద్రించుట భుజించుట నిలుచుట మున్నగు పనులయందు రెండును జంటలై, కలసి మెలసి, పాయక, ఆ అరణ్యమున దిరుగుచు, ఆ గూట నివసించుచు నుండెను. ౩౧

యం యం వాంఛతి సా రాజన్! తర్పయం త్యనుకంపితా,
తం తం సమానయ త్కామం కృచ్ఛ్రేణా ప్యజితేంద్రియః. 32

కపోతీ ప్రథమం గర్భం గృహ్ణాతి కాల ఆగతే,
అండాని సుషువే నీడే స్వపత్యు స్సన్నిధౌ సతీ. 33

తేషు కాలే వ్యజాయంత రచితావయవా హరేః,
శక్తిభి ర్దుర్విభావ్యాభిః కోమలాంగతనూరుహాః. 34

ప్రజాః పుపుషతుః ప్రీతౌ దంపతీ పుత్త్రవత్సలౌ,
శృణ్వంతౌ కూజితం తాసాం విన్వృతౌ కలభాషితైః. 35

---

ఆడుపావురము ఏమేమి కోరునో, అది యది యెల్ల ఎంత కష్టమైనను ఓర్చి, ఆ మగపావురము, తద్వశమై, సమకూర్చి యిచ్చుచు నుండెను. 32

ఆడుపావురము చూలు మోసి, ప్రసవసమయమున రెండు గ్రుడ్లు పెట్టెను. అపు డా మగపావురముకూడ ఆ గూటి దానిని బాయక యుండెను. 33

ఆ గ్రుడ్లు పగిలి పిల్లలై, యవి, దుర్విభావ్యము లైన కాలకర్మస్వభావముల ననుసరించి, చిన్ని చిన్ని మృదువులైన రోమములు, చిన్ని అవయవములు కలిగిన వయ్యెను. 34

పుత్త్రవత్సలములై ఆ పావురములు రెండును, వాని అవ్యక్తమధురములైన పలుకులు విని మహానందము నొందుచు మిక్కిలి గారాబమున వానిని పోషించుకొనుచు నుండెను. 35

తాసాం పతత్త్రైః సుస్వరైః కూజితై ర్వల్గుచేష్టితైః,
ప్రత్యుద్గమై రదీనానాం పితరౌ ముద మాపతుః. ౩౬

స్నేహానుబద్ధహృదయా వన్యోన్యం విష్ణుమాయయా,
విమోహితౌ దీనధియా శిశూన్ పుపుషతుః ప్రజాః. ౩౭

ఏకదా జగ్మతు స్తాసా మన్నార్థే తౌ కుటుంబినౌ,
పరితః కాననే తస్మి న్నర్థినౌ చేరతు శ్చిరమ్. ౩౮

దృష్ట్వా తాన్ లుబ్ధకః కశ్చి ద్యదృచ్ఛాతో వనేచరః,
జగృహే జాల మాతత్య చరతః స్వాలయాంతికే. ౩౯

---

వాని కూతలకు, చేతలకు సంతోషపడుచు, వాని ఱెక్కలు సవరించి, వాని మేనులు దువ్వి, తాకి, ముద్దాడి, ఆ పావురములు రెండును మిక్కిలి ఆనందము ననుభవించు చుండెను. ౩౬

ఇట్లు, విష్ణుమాయా మోహితములై ఆ పావురములు రెండును తమపిల్లలయం దత్యంతము మమకారము అభిమానము చేసి, తత్పోషణమున వ్యగ్రములై యుండెను. ౩౭

ఒక్కనా డా పావురములు రెండు తమపిల్లల కాహారము గొనివచ్చుటకై, అడవిలోనికి బోయి, యెప్పటికన్న నెక్కువగా ఆలస్యము చేసెను. ౩౮

ఆ సమయమున వేటకా డొక డడవిలో తిరుగుచు, విధి వశమున గూటిముంగల సంచరించు ఆపిల్లలను జూచి, వల పన్ని, పట్టుకొనెను. ౩౯

కపోత శ్చ కపోతీ చ ప్రజాపోషే సదోత్సుకౌ,
గతౌ పోషణ మాదాయ స్వనీడ ముపజగ్మతుః. ౬౦
కపోతీ స్వాత్మజాన్ వీక్ష్య బాలకాన్ జాలసంవృతాన్,
తా నభ్యధావత్ క్రోశంతీ క్రోశతో భృశదుఃఖితాన్. ౬౧
సాసకృత్ స్నేహగుణితా దీనచి త్తాజమాయయా,
స్వయం చాబధ్యత శిచా బద్ధాన్ పశ్యం త్యపస్మృతిః. ౬౨
కపోత శ్చాత్మజాన్ వీక్ష్య ఆత్మనోఽభ్యధికాన్ ప్రియాన్,
భార్యాం చాత్మసమాన్ దీనో విలలాప సుదుఃఖితః. ౬౩
అహో మే పశ్యతాపాయ మల్పపుణ్యస్య దుర్మతేః,
అతృ ప్త స్యాకృతార్థస్య గృహ స్త్రైవర్గికో హతః. ౬౪

---

సరిగా నదే సమయమునకు మగపావురము, ఆడుపావురము, ముక్కులనిండ మేత నింపుకొని, తనగూటికి వచ్చెను. ౬౦

వలలో దగుల్కొని యున్న తనపిల్లలను జూచి ఆడుపావురము, గుండె, పగిలి పెద్దగా ఏడ్చుచు, దగ్గఱకు బోయెను. ౬౧

దైవమాయా మోహితమై అట్లు పోయి, అది, పిల్లలకై యేడ్చుచు, తానుకూడ ఆ వలలో దగుల్కొనెను. ౬౨

అట్లు వలలో బడిపోయిన తన పిల్లలను, ప్రాణాధికప్రియయగు నిల్లాలిని, జూచి, మగపావురము, మిక్కిలి దీనముగా విలపింప దొడగెను. ౬౩

అక్కటా! నే నెంత పాపము చేసికొంటిని? నట్టి వ్యర్థుడను మూఢుడను అయిపోయినాను. ఇంకను గృహధర్మమున తృప్తి కలుగకపోవుటయే గాక, సంతానాదికములద్వారా నాకింకను కృతార్థతయు గలుగలేదు. ఈనాడు నా కులమునకే విచ్ఛేదము సంభవించినది. ౬౪

అనురూపానుకూలా చ యస్య మే పతిదేవతా,
శూన్యే గృహే మాం సంత్యజ్య పుత్రైః స్వర్యాతి సాధుభిః.
సోఽహం శూన్యే గృహే దీనో మృతదారో మృతప్రజః,
జిజీవిషే కిమర్థం వా విధురో దుఃఖజీవితః ? ౪౬

తాం స్తథై వావృతాన్ సిగ్ధ్వ ర్మృత్యుగ్రస్తాన్ విచేతసః,
స్వయం చ కృపణః సిక్తు పశ్య న్న ప్యబుధోఽపతత్. ౪౭

తం లబ్ధ్వా లుబ్ధకః క్రూరః కపోతం గృహమేధినమ్,
కపోతకాన్ కపోతీం చ సిద్ధార్థః ప్రయయా గృహమ్. ౪౮

---

అనుకూలయు అనురాగవతియు నగు నా ప్రియభార్య, నన్ను గూట వదలి, తన కన్న సంతానముతో స్వర్గమునకు వెళ్ళి పోవుచున్నది. ౪౫

భార్యయు పిల్లలును జనిపోయి, శూన్యశూన్యుడనై నేను ఈ శూన్యమైన గృహమున, దుఃఖజీవితముతో విధురుడనై నకెందుకు బ్రదికియుండవలెను ? ౪౬

అని తలచి, వగచుచు, ఆ మగపావురము, అంతకుమున్నే వలలో బడి చనిపోవుటకు సిద్ధముగా నున్న భార్యను పిల్లలను కన్నులార జూచుచు నుండియు, తెలివిమాలి, తానును దీనదీన స్థితిం బడి, వారితోపాటు తానుకూడ నశించుటకై యా వలలో బడెను. ౪౭

వెంటనే, క్రూరు డగు ఆ లుబ్ధకుడు, వలలో బడి చిక్కు-పడిన ఆ మగపావురమును, ఆడుపావురమును, పిల్లలను, జూచి, ఈనాడు పెద్ద అదృష్టము కలిసి వచ్చిన దని సంతోషించుచు, తన యింటికి బోయెను. ౪౮

ఏవం కుటుంబ్యశాంతాత్మా ద్వంద్వారామః పతత్త్రివత్,
పుష్ణన్ కుటుంబం కృపణః సానుబంధోఽవసీదతి. ౭౩

యః ప్రాప్య మానుషం లోకం ముక్తిద్వార మపావృతమ్,
గృహేషు ఖగవ త్సక్త స్త మారూఢచ్యుతం విదుః. ౭౪

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే సప్తమోఽధ్యాయః.



---

ఇట్లే గృహమేధి యగువాడు, అశాంతాత్ముడై, ద్వంద్వములయందు దగులువడి, కుటుంబమును పోషించుచున్నవాడు, దీనుడై, పావురమువలె, తుదిని సానుబంధముగా నశించును. ౭౩

తెఱవబడిన ముక్తిద్వార మగు మర్త్యలోకమును బడసి, ఇట్లు పక్షివలె, గృహాసక్తుడై యుండువానిని ఆరూఢచ్యుతుని గా ౭౪ యందురు.

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున
ఏడవ యధ్యాయము.



బ్రాహ్మణ ఉవాచ

సుఖ మైంద్రియకం రాజన్! స్వర్గే నరక ఏవచ,
దేహినో య ద్యథా దుఃఖం తస్మా న్నేచ్ఛేత త ద్బుధః. ౧

గ్రాసం సుమృష్టం విరసం మహాంతం స్తోక మేవ వా,
యదృచ్ఛయై వాపతితం గ్రసే దాజగరోఽక్రియః. ౨

శయీతాహాని భూరీణి నిరాహారోఽనుపక్రమః
యది నోపనయే ద్గ్రాసో మహాహి రివ దిష్టభుక్. 3

ఓజస్సహోబలయుతం బిభ్ర ద్దేహ మకర్మకమ్,
శయానో వీతనిద్రశ్చ నేహేతేంద్రియవా నపి. ౪

---

బ్రాహ్మణుడు చెప్పెను

రాజా! ఇంద్రియములవలన గలుగు సుఖము, స్వర్గము నందును నరకమునందును గూడ గలుగును. దేహికి దుఃఖ మెట్లు కలుగునో, సుఖముకూడ అట్లే తనకు దానే కలుగును. కావున, పండితు డగువాడు, తాను దానిని గోరగూడదు. ౧

రుచి కలదిగాని, లేనిదిగాని, అధికముగాగాని, స్వల్పముగా గాని, యదృచ్ఛాలబ్ధమైన ఆహారమునే,ఉదాసీనుడై అజగరవృత్తి నవలంబించి భుజించుచుండవలెను. ౨

ఆహారము లభింపకపోవునెడల, ఎన్నినా ళ్ళయినను పరే, నిరాహారుడుగా, ఆ ఆహారముకోసము ఎట్టి ప్రయత్నము చేయక, మహాహివలె పడియుండవలెను. 3

ఓజస్సహోబలయుత మైన దేహమును ధరించి, ఎట్టికర్మయం దును బ్రవర్తింపక, జాగరూకుడై శయనింపవలయునేగాని, ఇంద్రి యములు కలవాడే మైనన్ను, తద్వ్యాపారముల నభిలషింపరాదు. ౪

మునిః ప్రసన్నగంభీరో దుర్విగాహ్యో దురత్యయః,
అనంతపారో హ్యక్షోభ్యః స్తిమితోద ఇవార్ణవః. ౫

సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః,
నోత్సర్పేత న శుష్యేత సరిద్భి రివ సాగరః. ౬

దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావై రజితేంద్రియః,
ప్రలోభితః పత త్యంధే తమ స్యగ్నౌ పతంగవత్. ౭

యోషిద్ధిరణ్యాభరణాంబరాది
ద్రవ్యేషు మాయారచితేషు మూఢః,
ప్రలోభితాత్మా హ్యుపభోగబుద్ధ్యా
పతంగవ న్నశ్యతి నష్టదృష్టిః. ౮

---

ప్రసన్నగంభీరుడై, దుర్విగాహ్యుడై, దురత్యయుడై, అవధి లేనివాడై, క్షోభింపజేయ గలుగనివాడై, ముని, నిశ్చలోదక మైన సముద్రమువలె నుండవలెను. ౫

సమృద్ధకాము డయ్యును, హీను డయ్యును, ముని యగు వాడు, నారాయణపరాయణుడై, నదులతో సముద్రమువలె, ఎదుగు పొడుగులు లేక యుండవలెను. ౬

దేవమాయామయి యైన స్త్రీని జూచి, తద్భావములచే మోహితుడై, ఇంద్రియముల నడచుకొన నేరక, తద్వశు డగు వాడు, అగ్నిలో మిడుతవలె, అంధతామసమున బడి సమూలముగ నశించును. ౭

మాయారచితము లైన ధన కనక వనితా ఆభరణాదుల యందు లోభము గలిగి, మూఢుడై, వాని ననుభవింత మను బుద్ధితో ఆశించునతడు నష్టదృష్టియై, మిడుతవలె నశించును. ౮

స్తోకం స్తోకం గ్రసే ద్గ్రాసం దేహో న శ్యేత యావతా,
గృహా నహింస న్నాతిష్ఠే ద్వృత్తిం మాధుకరీం మునిః. ౯

అణుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యః కుశలో నరః,
సర్వత స్సార మాదద్యా త్పుష్పేభ్య ఇవ షట్పదః. ౧౦

సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్,
పాణిపాత్రోదరామత్రో మక్షికేవ న సంగ్రహీ. ౧౧

సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్,
మక్షికా ఇవ సంగృహ్ణన్ సహ తేన వినశ్యతి. ౧౨

---

మాధుకరవృత్తి నవలంబించి తనశరీరము నిలుచునంత పాటిగా మాత్రమే ఆహారమును కొంచెము కొంచెము గ్రహించుచు, తన కాహారము నిచ్చు గృహములను అనగా గృహస్థులను బాధింపక మెలగవలెను. ౯

మనుజుడు, చిన్నవియు పెద్దవియు నగు శాస్త్రములవలన, పుష్పములలోనుండి తుమ్మెదవలె, నేర్పున సారము గ్రహింపవలెను.

తనదోసిలి నిండునంతయో, లేక తనయుదరము నిండునంతయో, ఆహారమును గ్రహించి, భుజింపవలెనేగాని, సాయంతనమున కని, రేపటి కని, తుమ్మెదవలె, నిలువ చేసికొన గూడదు.

తాను భిక్షించుకొనిన యాహారమును, రేపటి కని మాపటి కని సంగ్రహింప గూడదు. అట్లు చేసినయెడల తేనె కూడబెట్టిన తేనెటీగలువలె, దానితో గూడ నశించును. ౧౨

పదాపి యువతీం భిక్షు ర్న స్పృశే ద్దారవీ మపి,
స్పృశన్ కరీవ బధ్యేత కరిణ్యా అంగసంగతః. ౧౩

నాధిగచ్ఛేత్ స్త్రియం ప్రాజ్ఞః కర్హిచి న్మృత్యు మాత్మనః,
బలాధికై స్స హన్యేత గజై రన్యై ర్గజో యథా. ౧౪

న దేయం నోపభోగ్యం చ లుబ్ధై ర్య ద్దుఃఖసంచితమ్,
భుంక్తే త దపి తచ్చాన్యో మధుహేవార్థవి న్మధు. ౧౫

సుదుఃఖోపార్జితై ర్విత్తై రాశాసానాం గృహాశిషః,
మధుహే వాగ్రతో భుంక్తే యతి ర్వై గృహమేధినామ్. ౧౬

---

కొయ్యతో చేయబడిన స్త్రీమూర్తినేని, కాలితోగూడ దాకరాదు. అట్లు తాకినయెడల, ఆడయేనుగును గోరి పోయిన మగయేనుగువలె, బద్ధుడగును. ౧౩

ప్రాజ్ఞుడగువాడు స్త్రీ నెన్నడు పొందగూడదు. అది తనకు మృత్యువే యని తెలిసికొనవలెను. అట్లు పొందువాడు, అడవిలో మదించిన యితర గజములచేత గజమువలె, వధింపబడును. ౧౪

ఈయక, అనుభవింపక, లోభముతో నెన్నడును కష్టపడి ధనమును గూడబెట్ట గూడదు. అట్లు కూడబెట్టినచో, తేనెటీగలు సంగ్రహించిన తేనెతుట్టెలను గొట్టువానువలె, ఇతరుడు హరించి వేయును. ౧౫

గృహస్థులు, తమకొఱకని మిక్కిలి కష్టపడి సంపాదించి నిలువ చేసి యుంచికొనిన ధనములను, యతి యగువాడు, తేనెటీగలు ప్రోగుచేసిన తేనెను వానిని గొట్టువానువలె, తాను ముందుమున్నుగా అనుభవించును. (కావున, వానికి ధనసంగ్రహ నావశ్యకత యేమాత్రము లేదు.) ౧౬

గ్రామ్యగీతం న శ్రుణుయా ద్యతి ర్వనచరః క్వచిత్,
శిక్షేత హరిణా ద్బద్ధా న్మృగయో ర్గీతమోహితాత్. ౧౭

నృత్తవాదిత్రగీతాని జుషన్ గ్రామ్యాణి యోషితామ్,
ఆసాం క్రీడనకో వశ్య ఋష్యశృంగో మృగీసుతః. ౧౮

జిహ్వయాతిప్రమాథిన్యా జనో రసవిమోహితః,
మృత్యు మృచ్ఛ త్యసద్బుద్ధి ర్మీనస్తు బడిశై ర్యథా. ౧౯

ఇంద్రియాణి జయం త్యాశు నిరాహారా మనీషిణః,
వర్జయిత్వా తు రసనం త న్నిరస్య న్న వర్ధతే. ౨౦

---

వనచరు డైన యతి యెన్నడును గ్రామ్యగీతములను వినరాదు. లుబ్ధకులసంగీతమును విని మోహితమై పట్టుకొనబడు లేడి వలన ఈశిక్షను బాగుగా పొందవలెను. ౧౭

గ్రామ్యము లైన స్త్రీల నృత్త వాదిత్ర గీతాదికములను విని, మృగీసుతు డగు ఋశ్యశృంగుడు అవశ్యము వారలచేతిలో నొక ఆటబొమ్మగా వశపడి పోయినాడుగదా ? ౧౮

జిహ్వ మిక్కిలి క్షోభ పెట్టు స్వభావము కలది. కావున, రుచికి ఆశపడువాడు, ఎఱ కాశపడి వచ్చిన చేపవలె, నశించును.

నిరాహారు లైన మనీషులు ఇంద్రియములను త్వరగా జయింప గలరు. కావున, రసనేంద్రియమును పూర్తిగా వర్జింపకున్నచో, మరల నింద్రియవ్యాపారము బలిష్ఠ మగును. ౨౦

తావ జ్జితేంద్రియో న స్యా ద్విజితాన్యేంద్రియః పుమాన్,
న జయే ద్రసనం యావ జ్జితం సర్వం జితే రసే. ౨౧

పింగళా నామ వేశ్యాసీ ద్విదేహనగరే పురా,
తస్యా మే శిక్షితం కించి న్నిబోధ నృపనందన ! ౨౨

సా స్వైరి ణ్యేకదా కాంతం సంకేత ఉపనేష్యతీ,
అభూ త్కాలే బహి ర్ద్వారి బిభ్రతీ రూప ముత్తమమ్. ౨౩

మార్గ ఆగచ్ఛతో వీక్ష్య పురుషా న్పురుషర్షభ !
తా న్శుల్కదా న్విత్తవతః కాంతాన్ మేనేఽర్థకాముకా. ౨౪

---

ఇతర ఇంద్రియముల నన్నిటిని నొంచియు, రసనేంద్రియమును పూర్తిగా జయింపనంతవఱకు, మనుజుడు, జితేంద్రియుడు కానేరడు. కావున, రసమును జయించినంతన సర్వము జయింపబడినదే యగును. ౨౧

పూర్వము విదేహ నగరమునందు పింగళ యను నొక వేశ్య యుండెను. ఆమెవలన నే నొకింత నేర్చికొంటిని. అది చెప్పెదను. వినుము. ౨౨

ఆ స్వైరిణి యొకనాడు బాగుగా అలంకారము చేసికొని, విటునికొఱ కెదురు చూచుచు, వెలుపలివాకిట గూర్చుండి యుండెను. ౨౩

దారిని వచ్చు బోవు పురుషులను జూచి, ఆ జారిణి, అర్థకాముకయై యుండి, వారు తనకొఱకే వచ్చుచున్నా రనియు, ధన మీగల రనియు, నెంచుచు నుండెను. ౨౪

ఆగతే ష్వపయాతేషు సా సంకేతోపజీవినీ,
అ ప్యన్యో వి త్తవాన్ కోఽపి మా ముపైష్యతి భూరిదః. ౨౫

ఏవం దురాశయా ధ్వ స్తనిద్రా ద్వా ర్యవలంబినీ,
నిర్గచ్ఛతీ ప్రవిశతీ నిశీథం సమపద్యత. ౨౬

తస్యా వి త్తాశయా శుష్యద్వక్త్రాయా దీనచేతసః,
నిర్వేదః పరమో జజ్ఞే చింతాహేతు స్సుఖావహః. ౨౭

తథా నిర్విణ్ణచిత్తాయా గీతం శ్రుణు యథా మమ,
నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథా హ్యసిః,
న హ్యంగజాతనిర్వేదో దేహబంధం జిహాసతి. ౨౮

---

అట్లు పలువురు దారిని వచ్చి పోగా, మఱొక రెవడో, డబ్బు గలవాడు, వచ్చు ననియు, తనకు బుష్కలముగా నిచ్చు ననియు, గోరుకొనుచు, ఆశతో నామె కూర్చుండి యుండెను.

ఇట్లు దురాశతో ఆ జారిణి నిద్ర మాని, వెలుపలికి వచ్చుచు, లోనికి బోవుచు, నుండెను. అప్పటికి అర్ధరాత్ర మయ్యెను. ౨౬

ధనాశతో ముఖ మెండి, దుఃఖితురాలైన యా పింగళ కప్పుడు పెద్ద నిర్వేదము కలిగెను. ౨౭

అట్లు నిర్విణ్ణచిత్తయై యా జారిణి యి ట్లని తలపోసెను. రాజా! ఆమె తలపోసిన విధమును నీకు నే జెప్పుచున్నాను. వినుము. పురుషునకు నిర్వేదము, ఆశాపాశములకు గత్తివంటిది. ఎందువలన నన — నిర్వేదము కలుగని పురుషుడు దేహబంధమును బాయ నేరడు. ౨౮

పింగళోవాచ

అహో! మే మోహవితతిం పశ్యతాఽవిజితాత్మనః,
యా కాంతా దసతః కామం కామయే యేన బాలిశా. ౨౯

సతం సమీపే రమణం రతిప్రదం
విత్తప్రదం నిత్య మిమం విహాయ,
అకామదం దుఃఖభయార్తిశోక
మోహప్రదం తుచ్ఛ మహం భజేఽజ్ఞా. ౩౦

అహో! మయాత్మా పరితాపితో వృథా
సాంకేత్యవృత్త్యా హ్యతిగర్హ్యవార్తయా,
స్త్రైణా న్నరా దర్థతృషోఽనుశోచ్యాత్
క్రీతేన విత్తం రతి మాత్మనేచ్ఛతీ. ౩౧

---

పింగళ యనుకొనెను

అక్కటా! అజితాత్మ నగు నా అవివేకమును, మోహ ప్రకారమును జూడుడు. తుచ్ఛుడైన కాంతునిద్వారా కామమును గామించుచు నున్నాను. ౨౯

చేరువనే పాయక యుండి, రమింప జేయుచు, రతిప్రదుడై విత్తప్రదుడైన కాంతుని వదలి, కామము నీయ రాకుండుటయే గాక, దుఃఖమును భయమును ఆర్తిని శోకమును మోహమును గలుగజేయు తుచ్ఛకాంతుని బొంద గోరుచుంటిని. ౩౦

అక్కటా! నేను అతిగర్హ్యమైన జారిణీవృత్తి నవలంబించి, నాయాత్మను వ్యర్థముగా తపింప జేసికొంటిని. స్త్రీలంపటులు అర్థలుబ్ధులు అనుశోచ్యులు నగు నరులకు నన్నమ్ముకొని, రతిని విత్తమును పొంద గోరితినిజుమా! ౩౧

యా దస్థిభి ర్నిర్మితవంశవంశ్య
స్థూణాం త్వచా లోమనఖైః పినద్ధమ్,
క్షరన్నవద్వార మగార మేత
ద్విణ్మూత్రపూర్ణం మ దుపైతి కాన్యా ? ౩౨

విదేహానాం పురే హ్యస్మి న్నహ మేకైవ మూఢధీః,
యాఽన్య మిచ్ఛ త్యస త్యస్మా దాత్మదా త్కాంత మచ్యుతాత్.

సుహృ త్ప్రేష్ఠతమో నాథ ఆత్మా చాయం శరీరిణామ్,
తం విక్రీ యాత్మనై వాహం రమేఽనేన యథా రమా. ౩౪

---

లావులైన వెదురుగడలను బోలిన యెముకలతో నిర్మింపబడి, లోమములతో నఖములతో కప్పబడి, స్రవించు నవ ద్వారములు గలిగి, విణ్మూత్రములతో నిండియున్న ఆగారరూప మగు నీ శరీరమును, నేను కాక, మఱొకతె యెవతె, కాంతునిగా దలచి, వాంఛించును ? ౩౨

ఈ విదేహ పురమునందు నిజముగా నే నొక్కతెనే మూఢురాలను. ఎందువలన నన — ఆత్మప్రదుడైన అచ్యుతుని కంటె నితరుని మఱొకనిని కాంతునిగా నమ్మి, దుష్టురాలనై, వానినే కోరుకొనుచున్నాను. ౩౩

శరీరధారులకు సుహృత్తు, మిక్కిలి ప్రియుడు, నాథుడు, ఆత్మయు నగు నీ యీశ్వరునకు నన్నమ్ముకొని, వానితో లక్ష్మీదేవివలె నిక రమింతును. ౩౪

కియత్ ప్రియం తే వ్యభజన్ కామా యే కామదా నరాః,
ఆద్యంతవంతో భార్యాయా దేవా వా కాలవిద్రుతాః? ౩౫

నూనం మే భగవాన్ ప్రీతో విష్ణుః కేనాపి కర్మణా,
నిర్వేదోఽయం దురాశాయా యన్మే జాతః సుఖావహః. ౩౬

మైవం స్యుర్మందభాగ్యాః చేత్ క్లేశా నిర్వేదహేతవః,
యేనానుబంధం నిర్హృత్య పురుషః శమ మృచ్ఛతి. ౩౭

తేనోపకృత మాదాయ శిరసా గ్రామ్యసంగతాః,
త్యక్త్వా దురాశాం శరణం వ్రజామి త మధీశ్వరమ్. ౩౮

---

కామములకును, నరులకును, కామప్రదు లగు దేవతల కుచు, ఆద్యంతములు గలవు. కాలముచే నివి యెల్ల నుపద్రవము నొందుచుండును. కావున, నిట్టివారు భార్య కేమి ప్రియమును సమకూర్ప గలిగి యుందురు? ౩౫

పూర్వము నే నొనరించిన యేసుకృతవిశేషముననో, సర్వవ్యాపి యగు భగవంతుడు ప్రీతుడై నాడు. తదనుగ్రహమున, సుఖావహ మైన యీ నిర్వేదము, దురాశాహత నైన నాకీనాడు కలిగినది. ౩౬

నేను మందభాగ్యురాలనే అయి యుందునేని, నిర్వేదము కలుగుటకు కారణము లైన యిట్టి క్లేశములు నాకు కలుగవు. ఈ నిర్వేదముచేతనే సంసారబంధము నెడసి, మనుజుడు పరమశమము నొంద గలుగుచున్నాడు. ౩౭

ఇంతదనుక, గ్రామ్యవిషయములయందు దగిలి మూఢనై యున్న నే నీనాడు భగవంతుని మహోపకార రూప మగు ఈ నిర్వేదము నవలంబించి, తుచ్ఛ మైన ఆశను త్యజించి, సర్వాధీశ్వరు డగు ఆ భగవంతునే శరణు పొందెదను. ౩౮

సంతుష్టా శ్రద్దధ త్యేవం యథాలాభేన జీవతీ,
విహరా మ్యమునై వాహ మాత్మనా రమణేన వై. ౩౯

సంసారకూపే పతితం విషయై ర్ముషి తేక్షణమ్,
గ్రస్తం కాలాహినాత్మానం కోఽన్య స్త్రం త్రాతు మీశ్వరః? ౪౦

ఆత్మైవ హ్యాత్మనో గోప్తా నిర్విద్యేత యథాఽఖిలాత్,
అప్రమత్త ఇదం పశ్యేద్ గ్రస్తం కాలాహినా జగత్. ౪౧

బ్రాహ్మణ ఉవాచ

ఏవం వ్యవసితమతి ర్దురాశాం కాంతతర్షజామ్,
ఛిత్త్వోపశమ మాసాద్య శయ్యా ముపవివేశ సా. ౪౨

---

ఈ నిశ్చయమును బాయక, శ్రద్ధ బూని, నిత్యసంతుష్టనై యదృచ్ఛాప్రాప్త మగుదానితో జీవించుచు, హృదయరమణు డగు నాత్మారామునితో విహరింతును. ౩౯

విషయములవలన కనులు కానరాక, సంసారకూపమున బడిపోయి, కాలసర్పముచే కాటువేయబడిన తన్నుద్ధరింప భగవంతుడుగాక, మఱొక డెవడు కలడు? ౪౦

ఇట్లు సమస్తజగము కాలాహిచే గ్రస్త మగుచున్న దని ప్రత్యక్షముగా జూచి, ప్రమాదము పొందక, సమస్తమును రోసి, నిర్వేదమును బొందినవానికి రక్షకుడు పరమాత్మయే. ౪౧

బ్రాహ్మణు డనెను

ఇట్లు నిశ్చయించుకొని, విటులమీది యిచ్ఛచే గలిగిన దురాశ బోనడచికొని, ఆ పింగళ, అత్యంతము ఉపశమమును బొంది, ప్రక్కపై పరుండి సుఖముగా నిద్రించెను. ౪౨

ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్,
యథా సంఛిద్య కాంతాశాం సుఖం సుష్వాప పింగళా. ౪౩

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే అష్టమోఽధ్యాయః.

---

బ్రాహ్మణ ఉవాచ

పరిగ్రహో హి దుఃఖాయ య ద్యత్ ప్రియతమం నృణామ్,
అనంతం సుఖ మాప్నోతి త ద్విద్వాన్ య స్త్వకించనః. ౧

---

కావున, ఆశ, పరమ దుఃఖములకు మూలము. నైరాశ్యము, పరమసుఖముసుమా! పింగళ, విటులపై నాశను త్యజించి వేసినపిదప, సుఖముగా నిద్రించినదికదా! ౪౩

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున
ఎనిమిదవ అధ్యాయము.

---

బ్రాహ్మణుడు చెప్పెను

తమ కేదేది యిష్టమో, అది యది కూడబెట్టుకొనుట వలన మిక్కిలి దుఃఖము సంభవించును. ఇది యెఱిగిన అకించనుడు అనంతమైన సుఖము ననుభవించును. ౧

సామిషం కురరం జఘ్ను ర్బలినోఽన్యే నిరామిషాః,
త దామిషం పరిత్యజ్య స సుఖం సమవిందత. ౨

న మే మానావమానౌ స్తో న చింతా గేహపుత్రిణామ్,
ఆత్మక్రీడో హ్యాత్మరతో విచరామీహ బాలవత్. ౩

ద్వా వేవ చింతయా ముక్తౌ పరమానంద ఆప్లుతౌ,
యో విముగ్ధో జడో బాలో యశ్చ బుద్ధేః పరం గతః. ౪

క్వచిత్ కుమారీ త్వాత్మానం వృణానాన్ గృహ మాగతాన్,
స్వయం తా నర్హయామాస క్వాపియాతేషు బంధుషు, ౫

---

ఒక కురరపక్షి, మాంసమును సంపాదించుకొని వచ్చుచుండగా, మాంసము దొరకని యితరపక్షులు, బలము గలవి, దానిని తన్ని, ఆ మాంసమును లాగికొనెను. ఆ మాంసమును వదలివైచిన తరువాత ఆ కురరపక్షి మిక్కిలి సుఖముగా నుండెను. ౨

నాకు మానావమానములుగాని, గేహపుత్త్రాదులు గల్గ గృహస్థుల కుండు దిగులు మున్నగునవిగాని, లేవు. నేను నాలోనేగ ఆడుకొనుచు, నాలో నేనే సంతోషపడుచు, బాలకుడువలె చరించుచుందును. ౩

చింత లేక, పరమానందరసమున మునిగి యుండువారు ఇరువురే సుమా! వా రెవ రన — విముగ్ధుడు జడుడు నగు బాలుడును; ప్రకృతికంటె పరు డగు పరమేశ్వరుని పొందినవాడును. ౪

ఒక కన్యకను పరిణయమునకు నిశ్చయము చేసికొనుటకు బంధువులు వచ్చిరి. అపు డాకన్యతలిదండ్రు లింట లేరు. అపు డాకన్యయే స్వయముగా వారిని గౌరవింపవలసి వచ్చెను, ౫

తేషా మభ్యవహారార్థం శాలీ౯ రహసి పార్థివ !
అవఘ్నంత్యాః ప్రకోష్ఠస్థా శ్చక్రుః శంఖాః స్వనం మహత్. ౬

సా త జ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః,
బభంజైకైకశః శంఖా౯ ద్వౌ ద్వౌ పాణ్యో రశేషయత్. ౭

ఉభయో ర ప్యభూ ద్ఘోషో హ్యవఘ్నంత్యాః స్మ శంఖయోః,
తత్రాప్యేకం నిరభిన దేకస్మా న్నాభవ ద్ధ్వనిః. ౮

అన్వశిక్ష మిమం తస్యా ఉపదేశ మరిందమ !
లోకా ననుచర న్నేతాన్ లోకత త్త్వవివిత్సయా. ౯

---

వారి కాహారమును వండి పెట్టుట కాకన్య, స్వయముగా రహస్యముగా వడ్లు దంప మొదలిడెను. అప్పు డామె ముంజేతుల గాజు లూరక పెద్ద చప్పుడు చేయ దొడగెను. ౬

అది చూచి, అగౌరవముగా తలచి, ఆ కుమారిక, ఒక్కొక్కటి పగులగొట్టి, రెండుచేతుల రెండేసి రెండేసి గాజులను మిగిల్చికొనెను. ౭

అట్లు చేసి, మరల వడ్లు దంప మొదలిడగా, ఆ గాజులు కూడ పెద్ద చప్పుడు చేయ సాగెను. అప్పు డాకుమారి ఒక్కొక్కటి పగులగొట్టి, ఒక్కొక్కచేతికి ఒక్కొక్కటి మాత్రమే మిగిల్చెను. అప్పు డవి యేమాత్రము చప్పుడు చేయలేదు. ౮

లోకతత్త్వము నెఱిగికొను కోర్కెతో చరించుచు నేను, ఆకుమారికవలన ఈ ఉపదేశమును బడయ గలిగితిని. ౯

వాసే బహూనాం కలహో భవే ద్వార్తా ద్వయో రపి,
ఏక ఏవ చరే త్తస్మా త్కుమార్యా ఇవ కంకణః. ౧౦

మన ఏకత్ర సంయుజ్యా జ్జితశ్వాసో జితాసనః,
వైరాగ్యాభ్యాసయోగేన ధ్రియమాణ మతంద్రితః. ౧౧

యస్మి న్మనో లబ్ధపదం యదేత
చ్ఛనై శ్శనై ర్ముంచతి కర్మరేణూన్,
సత్త్వేన వృద్ధేన రజ స్తమశ్చ
విధూయ నిర్వాణ ముపై త్యనింధనమ్. ౧౨

తథైవ మాత్మ న్యవరుద్ధచిత్తో
న వేద కించి ద్బహి రంతరం వా,

---

పెక్కు రున్నచో, కలహము బయలుదేఱును. ఇరువు రున్నను సంతియే. కావున, కుమారీకంకణమువలె, ఒక్కడే సంచరింపవలెను. ౧౦

ఏమాత్రము అలసత్వమును పొందక, శ్వాసలను గెలిచి, ఆసనజయము గలిగి, వైరాగ్యాభ్యాస యోగ వశమున నిరోధించి, మనస్సు నొక్కచో నిలుపవలెను. ౧౧

మనస్సు, భగవంతునియందు నిలుకడ నొందుకొలది, మెల్లమెల్లగా కర్మరేణువులను త్యజించివేయును. అపుడు వృద్ధి పొందిన సత్త్వముతో రజస్సును తమమును దూరము చేసివేసి, గుణకార్యములతో విక్షేపము నొందక, అచంచల మైన బ్రహ్మస్థితిని పొందగలడు. ౧౨

అట్లు పరమాత్మయందు నిలిపిన చిత్తము గలవాడు, ఇషుకారుడు తనప్రక్కనే పోవుచున్న మహారాజునుగూడ జూడ

యథేషుకారో నృపతిం వ్రజంత
మిషౌ గతాత్మా న దదర్శ పార్శ్వే. ౧౩

ఏకచార్యనికేతః స్స్యా దప్రమత్తో గుహాశయః,
అలక్ష్యమాణ ఆచారై ర్మునిరేకోఽల్పభాషణః. ౧౪

గృహారంభో హి దుఃఖాయ విఫల శ్చాధ్రువాత్మనః,
సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖ మేధతే. ౧౫

ఏకో నారాయణో దేవః పూర్వసృష్టం స్వమాయయా,
సంహృత్య కాలకలయా కల్పాంత ఇద మీశ్వరః. ౧౬

---

నట్లే, లోపలగాని, వెలుపలగాని, ఏదిగాని ఏకాంచెమేని, తెలియదు. ౧౩

ముని యగువాడు ఏకాకియై చరింపవలెను. ఒక్కచోట స్థావరము నేర్పఱచుకొని, నిలువరాదు. ప్రమత్తుడు కాగూడదు. గుహాశయుడై, తన యాచారములు వెలిగాకుండ నుండవలెను. అల్పభాషియై యుండవలెను. ౧౪

నశ్వర మైన దేహము గలవాడుగావున, మనుజునకు గృహారంభము కేవలము దుఃఖమునకే గాక, వ్యర్థముకూడ అగును. సర్పము, ఇతరులు చేసినయింట ప్రవేశించి యుండి, సుఖముగా నిలుచుచున్నదిగదా! ౧౫

ఒక్కడే యగు శ్రీమన్నారాయణుడే, స్వమాయచే పూర్వసృష్ట మగు నీ సమస్తమును కాలకలచే నుపసంహారించి —

ఏక ఏ వాద్వితీయోఽభూ దాత్మాధారో నిరాశ్రయః,
కాలే నాత్మానుభావేన సామ్యం నీతాసు శక్తిషు,
సత్త్వాది ష్వాదిపురుషః ప్రధానపురుషేశ్వరః. ౧౭

పరాపరాణాం పరమ ఆస్తే కైవల్యసంజ్ఞితః,
కేవలానుభవానందసందోహో నిరుపాధికః. ౧౮

కేవలాత్మానుభావేన స్వమాయాం త్రిగుణాత్మికామ్,
సంక్షోభయన్ సృజ త్యాదౌ తయా సూత్ర మరిందమ! ౧౯

తా మాహు స్త్రిగుణవ్యక్తిం సృజంతీం విశ్వతోముఖమ్,
యస్మిన్ ప్రోత మిదం విశ్వం యేన సంసరతే పుమాన్. ౨౦

---

అప్పు డాత్మానుభావమున, సత్త్వాదిశక్తులు సామ్యము నొందగా, పరమేశ్వరు డగు నాతడు, ఏ స్ఫూర్తియు లేక, కేవలుడై, సజాతీయ విజాతీయ భేద రహితుడై, సర్వాధారుడై, నిరాశ్రయుడై, ప్రధానపురుషుడై, యుండును. ౧౭

అపుడు, పరములు అనగా బ్రహ్మాదులకును, అపరములు అనగా ముక్తజీవాదులకును, పొంద దగినవాడై, కైవల్య మను పేర వెలయుచుండును. అప్పు డాతని కేయుపాధియు లేదు. కేవలానుభవానంద సందోహమే ఆ పరమేశ్వరుని లక్షణము. ౧౮

అరిందముడ వగు నో యదుమహారాజా! అట్లు కేవలుడై యున్న ఆ పరమాత్మయే కేవలాత్మానుభావముచే, త్రిగుణాత్మిక యగు నిజమాయను సంక్షోభ పెట్టి, మొట్టమొదటగా మహత్తత్త్వ మును సృజించుచున్నాడు. ౧౯

ఆ మహత్తత్త్వమే, త్రిగుణములకు కార్య మనియు, నానావిధమై త్రిగుణాత్మక మైన అహంకారముద్వారా విశ్వమును

యథోర్ణనాభి ర్హృదయా దూర్ణాం సంతత్య వక్త్రతః,
తయా విహృత్య భూయ స్తాం గ్రస త్యేవం మహేశ్వరః. ౨౧

యత్ర యత్ర మనో దేహీ ధారయే త్సకలం ధియా,
స్నేహాద్ ద్వేషా ద్భయా ద్వాపి యాతి త త్తత్సరూపతామ్. ౨౨

కీటః పేశస్కృతం ధ్యాయన్ కుడ్యాం తేన ప్రవేశితః,
యాతి తత్సాత్మ్యతాం రాజన్! పూర్వరూప మసంత్యజన్. ౨౩

---

సృజించుచున్న దనియు, చెప్పుచున్నారు. దానియందే ఈ విశ్వ మంతయు ప్రోతమై యున్నది. దానివలననే పురుషుడు సంసారమున బడుచున్నాడు. ౨౦

సాలెపురుగు, తనకడుపులో నుండి దారమును నోటిద్వారా వెలుపలికి విడిచి, గూడుగా విస్తరింపజేసి, మరల నోటిద్వారా దానిని మ్రింగివేయునటులే, పరమేశ్వరుడును వ్యవహరించుచున్నాడు. ౨౧

దేహధారి, నిశ్చయాత్మక మగు తన బుద్ధిద్వారా ఎందెందు మనస్సు నిలుపునో, స్నేహమువలనగాని, ద్వేషమువలనగాని, భయమువలనగాని, క్రమముగా నాయా స్వరూపములను బొందును. ౨౨

తుమ్మెద, పురుగును దెచ్చి, గూటిలో బెట్టగా, ఆపురుగు భయముచే నిరంతరము ఆ తుమ్మెదనే ధ్యానించుచు ఉండి యుండి, ఆ తుమ్మెదతో సమానమైన రూపమును బొందును. తన స్వరూపమును విడనాడకయే అదేదేహమున అట్టిది సంభవించును. (అట్టిచో, దేహాంతరమున తత్సరూపత్వము కలుగుటన నాశ్చర్య మేమి?) ౨౩

ఏవం గురుభ్య ఏతేభ్య ఏషా మే శిక్షితా మతిః,
స్వాత్మోపశిక్షితాం బుద్ధిం శ్రుణు మే వదతః ప్రభో ! ౨౪

దేహో గురు ర్మమ విరక్తివివేకహేతు
ర్బిభ్రత్ స్మ సత్త్వనిధనం సతతార్త్యుదర్కమ్,
తత్త్వా న్యనేన విమృశామి యథా తథాపి
పారక్య మి త్యవసితో విచరా మ్యసంగః. ౨౫

జాయాత్మ జార్థ పశు భృత్య గృహా ప్తవర్గాన్
పుష్ణాతి యత్ప్రియచికీర్షతయా వితన్వన్,

---

ఇట్లీ గురువులవలన నే నిట్టిది నేర్చుకొంటిని. ఇంక, నా దేహమునుండియు కొంత నేర్చుకొంటిని. అది చెప్పుచున్నాను. వినుము. ౨౪

ఈ నా శరీరము, చావు పుట్టువులు గలదియు, నిరంతరము దుఃఖమే ఉత్తరఫలముగా గలదియు నగుటచే నాకు విరక్తి నొందుటకు గురువైనది. తత్త్వములను లెస్సగా విమర్శించి యథార్థమును దెలిసికొనుటకు సాధన మగుటచే నిది నాకు విరక్తికిని గురు వగుచున్నది. అయినను, ఇది యంతమున సృగాలాది పరాధీనమే యని నిశ్చయించుకొని, అసంగుడనై చరించుచున్నాను.

తనకు భోగాదిప్రియమును సంపాదింప వలె నను నిచ్ఛతో, భార్యను, సంతానమును, ధనమును, పశువులను, భృత్యులను, గృహములను, ఆప్తవర్గములను, బోషించి పోషించి, వృద్ధి నొందించుచు, పడరాని బాధలు పడి ధనములను సంపాదించి యుంచి,

స్వాంతే సకృచ్ఛ మవరుద్ధధన స్స దేహః
సృష్ట్వాస్య బీజ మవసీదతి వృక్షధర్మా. ౨౬

జిహ్వైకతోఽము మపకర్షతి కర్హి తర్షా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్,
ఘ్రాణోఽన్యత శ్చపలదృక్ క్వచ కర్మశక్తి
ర్బహ్వ్యః సపత్న్య ఇవ గేహపతిం లునంతి. ౨౭

సృష్ట్వా పురాణి వివిధా న్యజయాత్మశక్త్యా
వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్,
తై స్తై రతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముద మాప దేవః. ౨౮

---

తుట్టతుదకు దేహాంతరప్రాప్తికి బీజరూప మైన కర్మమును సృజించి, ఈ దేహము, వృక్షమువలె నశించిపోవును. ౨౬

నాలుక, ఉదరము, చర్మము, ముక్కు, చెవి మున్నగు నింద్రియములు బలవంతములై, దేహిని, పలువురు సవతులు గృహయజమానునివలె, వేఱువేఱు త్రోవలకు లాగి చిక్కుపఱుచు చుండును. ౨౭

బ్రహ్మదేవుడు, అజ యగు నాత్మశక్తిచే, వివిధములైన పురములను, వృక్షములను, సరీసృపములను, పశువులను, పక్షులను, దోమలను, మత్స్యములను, సృజించి, వానివానితో తృప్తి పడక, బ్రహ్మదర్శనమునకు సమర్థుడగు వానిని పురుషుని సృజించి, మిక్కిలి సంతోషపడెను. ౨౮

లబ్ధ్వా సుదుర్లభ మిదం బహుసంభవాంతే
మానుష్య మర్థద మనిత్య మపీహ ధీరః,
తూర్ణం యతేత న పతే దపమృత్యు యావ
న్నిశ్శ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్. ౨౯

ఏవం సంజాతవైరాగ్యో విజ్ఞానాలోక ఆత్మని,
విచరామి మహీ మేతాం ముక్తసంగోఽనహంకృతిః. ౩౦

న హ్యేకస్మా ద్గురో ర్జ్ఞాన ముత్థితం స్యా త్సుపుష్కలమ్,
బ్రహ్మైత దద్వితీయం హి గీయతే బహుధర్షిభిః. ౩౧

---

అనిత్య మైనను పురుషార్థములను సమకూర్చి ఈయగల యీ మనుష్యశరీరమును, అత్యంతము దుర్లభ మైన దానిని, అనేకజన్మములతుదిని బడయ గలిగి, పూరుషుడు ధీరుడై, యీ శరీరము మృత్యుముఖమున బడకపూర్వమే, నిశ్శ్రేయసమునకు వేగమే ప్రయత్నింప వలయునుగాని, విషయములలో బడి, కూలిపో గూడదు. ౨౯

ఇట్లు వైరాగ్యమును బొంది, విజ్ఞానదృష్టి గలవాడనై, ఆత్మదర్శనము చేసికొనుచు, నేను ముక్తసంగుడనై, అహంకారమును వదలి, ఈ భూమియందు సంచరించుచున్నాను. ౩౦

ఒక్కగురువువలన పుష్కలమైన జ్ఞానము కలుగనేరదు. అద్వితీయ మగు నీ బ్రహ్మమును బ్రహ్మవేత్త లగు మహర్షులు పలుతెఱగుల గానము చేయుచున్నారు. ౩౧

శ్రీభగవా నువాచ

ఇ త్యుక్త్వా స యదుం విప్ర స్త మామంత్ర్యాంగ! ధీరధీః,
వందితో౽భ్యర్చితో రాజ్ఞా యయౌ ప్రీతో యథాగతమ్. ౩౨

అవధూతవచః శ్రుత్వా పూర్వేషాం న స్స పూర్వజః,
సర్వసంగవినిర్ముక్త స్సమచిత్తో బభూవ హ. ౩౩

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే అవధూతగీతం నామ
నవమో౽ధ్యాయః.

---

శ్రీకృష్ణు డనెను

అని చెప్పగా విని, యదుమహారాజు ఆ బ్రహ్మణ్యమూర్తిని మరల మరల నమస్కరించి, పూజించెను. ఆ అవధూత చంద్రుడును, పోయి వత్తు నని యదువును వీడ్కొని, పరమ ప్రీతితో యథేచ్ఛముగా నేగెను. ౩౨

ఆ అవధూత వాక్యములను విని, మా పూర్వులకు బూర్వుడగు యదుమహారాజు, సర్వసంగవినిర్ముక్తుడై సమచిత్తు డయ్యెను. ౩౩

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున అవధూతగీత మను
తొమ్మిదవ యధ్యాయము.

సాధన గ్రంధ మండలి : ౨౬.

# గీతా కదంబము

## ద్వితీయ దళము

అనువాదకుడు

గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి



ప్రకాశకులు

సాధన గ్రంథమండలి, తెనాలి.

# షట్పదీ

## శ్రీమ దాచార్యస్వామి విరచితా

అవినయ మపనయ విష్ణో! శమయ విషయమృగతృష్ణామ్,
భూతదయాం విస్తారయ తారయ సంసారసాగరతః. ౧

దివ్యధునీమకరందే పరిమల పరిభోగ సచ్చిదానందే,
శ్రీపతిపదారవిందే భవభయఖేదచ్ఛిదే వందే. ౨

సత్యపి భేదాపగమే నాథ! తవాహం న మామకీన స్త్వమ్,
సాముద్రో హి తరంగః క్వచన సముద్రో న తారంగః. 3

ఉద్ధృతనగ! నగభిదనుజ! దనుజకులామిత్ర! మిత్రశశిదృష్టే!
దృష్టే భవతి ప్రభవతి న భవతి కిం భవతిరస్కారః? ౪

మత్స్యాదిభి రవతారై రవతారవతావతా సదా వసుధామ్,
పరమేశ్వర! పరిపాల్యో భవతా భవతాపభీతోఽహమ్. ౫

దామోదర! గుణమందిర! సుందరవదనారవింద! గోవింద!
భవజలధిమథనమందర! పరమం దర మపనయ త్వం మే. ౬

నారాయణ! కరుణామయ! శరణం కరవాణి తావకౌ చరణౌ,
ఇతి షట్పదీ మదీయే వదనసరోజే సదా వసతు. ౭



# మనవి

మహాశయులారా!

సాధన గ్రంథ మండలికి ఎనిమిదవ సంవత్సరము జరుగుచున్నది. ఈ సంవత్సర మింతవరకు, శంకర గ్రంథ రత్నావళి, ప్రథమ సంపుటము మాత్రము వెలువడినది. నేటివరకు మరల గ్రంథము వెలువడకుండుటకు మండలికి తగిన ఆర్థిక సంపద లేక పోవుటయె ప్రధాన కారణము.

ఇట్టి ఉత్తమ గ్రంథముల, సాధక పాఠక లోకమున కందిచ్చుటయందుగల, మండలి ఉత్సాహమునకు తగినంత, ప్రోత్సాహ సాహాయ్యముల కోరుచుంటిమి. సంపూర్ణ సహకారమిచ్చి, మండలి కృషిని ఫలవంతము చేయగలరని విశ్వసించు చుంటిమి.

ప్రస్తుతము, గీతాకదంబము ద్వితీయదళమును, మీ కరకమలములం దుంచుచుంటిమి. ఈ 'గీతాకదంబ' మను శీర్షికతో పురాణాదులలోని గీతల నన్నిటిని ప్రచురించుటయందలి మా ఆశయము తమకు విదితమె. గీతాకదంబము ప్రథమ దళమునకు వలెనె, ఈ ద్వితీయదళమునకు కూడ, సుమధురమగు, అనువాదమును వ్రాసియిచ్చిన, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి గారికి, ఎంతయు కృతజ్ఞుడను.

శ్రీశంకరాచార్యులవారి గ్రంథములన్నియు, మూలానువాదముతో, 24 సంపుటములుగ వెలువరించు మా ప్రయత్నము తమకు విదితమె. ఈ మహాకార్యమునకు, ఆంధ్రుల సంపూర్ణ సహకారము కావలయును. సాధన గ్రంథ మండలి పోషకవర్గము, ఒక్కొక్కరు ఒక్కొక సభ్యుని చేర్పించిన,

# ప్రస్తావన

గీతాకదంబము ప్రథమ దళము, వరుసగా ౧. గోపికా గీత, ౨. భ్రమర గీత, ౩. భిక్షు గీత, ౪. హంస గీత, ౫. అవధూత గీత, అను ఐదు గీతలతో ప్రకటిత మైనది.

ఇప్పు డీ ద్వితీయ దళము, వరుసగా, ౬. ఐల గీత, ౭. శ్రుతి గీత, ౮. శ్రీరామ గీత, ౯. యమ గీత, ౧౦. వేణు గీత, ౧౧. యుగళ గీత, అను ఆఱు గీతలతో ప్రకటిత మగుచున్నది. వీనిలో, ఐల గీత, శ్రీమద్భాగవతము ఏకాదశ స్కంధమున ఇరువది యాఱవ యధ్యాయమున నున్నది. శ్రుతి గీత, శ్రీమద్భాగవతము దశమ స్కంధమున ఎనుబదియేడవ యధ్యాయమున నున్నది. శ్రీరామ గీత, శ్రీమదధ్యాత్మరామాయణమున ఉత్తరకాండమున ఐదవ సర్గమున నున్నది. యమ గీత, విష్ణుపురాణమున తృతీయాంశమున సప్తమాధ్యాయమున నున్నది. వేణుగీత, శ్రీమద్భాగవతము దశమస్కంధమున ఇరువది యొకటవ అధ్యాయమున నున్నది. యుగళగీత, శ్రీమద్భాగవతము దశమస్కంధమున ముప్పదియైదవ యధ్యాయమున నున్నది.

ప్రథమదళమునందలి నియమములే ఈ ద్వితీయదళమున గూడ పాటింపబడినవి. ఇట్లే అన్నిదళముల యందును నియమములు పాటింపబడ గలవు. అన్ని దళములలో అన్ని గీతల సంఖ్య పూర్ణముగా నుండుటకై ప్రథమాదిదళముల యన్నిటి యందును గీతలసంఖ్య క్రమముగా నీయ దలచితిమి.

ఇట్లే క్రమముగా పాఠక సాధక లోకముల అభిమాన విశేషమున గీతాకదంబ దళ ప్రకటనమును గావింతుము.

ప్రకాశకులు

# విషయ సూచిక

# ౬. ఐలగీత

ఐలగీత శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున షడ్వింశాధ్యాయమున నిబద్ధము. దుష్టసంగమువలన యోగమునకు విఘాతము కలుగును. సాధుసంగము వలన యోగనిష్ఠ పరాకాష్ఠ నందుకొనును. కావున యోగి యఘవా డెవడును సంగమున దవ్వులః పడ గూడదు. ప్రమాదవశమున నట్టిది యెన్నడేని సంభవించినను, జాగరూకుడై, యతడు మనస్సును నిరోధించి, విముఖుడు కావలెను. ఆనందానుభవాత్ముడగు పరబ్రహ్మమునందు నిశ్చయముగా మనస్సును నిలిపి, తన పరమలక్ష్యమును సాధింపవలెను – అని ఉద్ధవునకు బోధించుచు, శ్రీకృష్ణ భగవాను డీ ఐలగీత నుపదేశించెను.

### శ్రీ భగవా నువాచ

మల్లక్షణ మిమం కాయం లబ్ధ్వా మద్ధర్మ ఆస్థితః,
ఆనందం పరమాత్మాన మాత్మస్థం సముపైతి మామ్. ౧

గుణమయ్యా జీవయోన్యా విముక్తో జ్ఞాననిష్ఠయా,
గుణేషు మాయామాత్రేషు దృశ్యమానే ష్వవస్తుషు,
వర్తమానోఽపి న పుమాన్ యుజ్యతే వస్తుభి ర్గుణైః. ౨

సంగం న కుర్యా దసతాం శిశ్నోదరతృపాం క్వచిత్,
తస్యానుగ స్తమ స్యంధే పత త్యంధానుగాంధవత్. ౩

---

### శ్రీ భగవంతు డనెను

మత్స్వరూప జ్ఞాపక మైన యీ నరశరీరమును బొంది మద్భక్తిధర్మమునందు స్థిరముగా నిలుచువాడు, నియంతృత్వ ముతో నాత్మయందే యున్నట్టియు, ఆనందస్వరూపుడై నట్టియు, పరమాత్ముడ నైనట్టియు నన్నే పొందును. ౧

త్రిగుణమయ మైన జీవోపాధినుండి విముక్తుడై జ్ఞానము గలిగి వర్తిలుపురుషుడు, మాయామాత్రము లైన ప్రకృతికార్య ములయందు ప్రవర్తించుచున్నను, అయథార్థము లైన వస్తువులను దేహాదులను దనవిగా దలంచుచున్నను, ఆ గుణములతో గాని, ఆ వస్తువులతో గాని, సంగమును పొందడు. అవి వాని కంటు నేరవు. ౨

శిశ్నోదరపరాయణు లైన దుర్జనులతో నేనాడును ఎక్కడను సంగము గావింపరాదు. అట్టివారిలో నేయొకనినేని అనుసరించువాడు, గ్రుడ్డివాని ననుసరించి పోయిన గ్రుడ్డివాడు వలె, భయంకర మైన తమోంధకూపమున గూలిపోవును. ౩

ఐళ స్సమ్రా డిమాం గాథా మగాయత బృహచ్ఛ్రవాః,
ఊర్వశీవిరహా న్మోహా న్నిర్విణ్ణః శోకసంయమే. ౪

త్యక్త్వాత్మానం ప్రజంతీం తాం నగ్న ఉన్మత్తవ న్నృపః,
విలప న్నన్వగా జ్జాయే! ఘోరే! తిష్ఠేతి విక్లబః. ౫

కామా నతృప్తోనుజుషన్ క్షుల్లకాన్ వర్షయామినీః,
న వేద యాంతీ ర్నాయాంతీ రూర్వశ్యాకృష్టచేతనః. ౬

---

సుప్రసిద్ధుడగు పురూరవచక్రవర్తి ఊర్వశీవిరహావశమున మిక్కిలి వగచి, వగచి, తుదకు శోకము నడంచిపెట్టికొని నిర్విణ్ణుడై ఈగాథ నొకదానిని గానము చేసెను. ౪

తన్ను వదలిపెట్టి వెళ్ళిపోవుచున్న ఆ ఊర్వశిని, ఉన్మత్తుడై దిగంబరుడై వెన్నంటి, ఓ ప్రియురాలా! నిష్కరుణురాలా! పోకుము! పోకుము! నిలువుము! నిలువుము! అని దీనుడై బిగ్గరగా బిలిచి బ్రతిమాలుకొనుచు, ఆ పురూరవుడు, మిక్కిలి విలపించుచు పరుగు లిడుచు ననుసరించెను. ౫

అనేక సంవత్సరము లా పురూరవుడు వచ్చుచు బోవుచు నున్న రాత్రుల నేమాత్రము గమనింపక నీచములైన కామసుఖములను దనివి సనక, ఆ యూర్వశితో తదాకృష్టచిత్తుడై భోగించి యుండెను. నాటికిని తృప్తి నొందియుండనికతన ఆత డట్లామెను వేడుకొనుచు, విలపించుచు, వెన్నంటెను. ౬

పురూరవు డనెను

అహో! కామకలుషీకృత చిత్తుడనై పోయిన నా మోహము నేమని యనవలె? ఇది నిరవధికముగా పెరిగిపోయినది.

ఐళ ఉవాచ

అహో! మే మోహవిస్తారః కామః కశ్మలచేతసః,
దేవ్యా గృహీతకంఠస్య నాయుఃఖండా ఇమే స్మృతాః. ౭

నాహం వేదాభినిర్ముక్తః సూర్యో వాభ్యుదితోఽముయా,
ముషితో వర్ష పూగానాం బతాహాని గతా న్యుత. ౮

అహో మ ఆత్మసమ్మోహో! యేనాత్మా యోషితా కృతః,
క్రీడామృగ శ్చక్రవర్తీ నరదేవశిఖామణిః. ౯

సపరిచ్ఛద మాత్మానం హిత్వా తృణ మివేశ్వరమ్,
యాంతీం స్త్రియం చాన్వగమం నగ్న ఉన్మత్తవ ద్రుదన్. ౧౦

---

ఆ ఊర్వశీబాహుబంధములలో బడియుండి, రాత్రిరూపములుగా ఖండఖండములుగా తఱిగిపోవుచున్న నా యాయువునే గమనింప నేర నైతిని. ౭

అక్కటా! ఊర్వశిచేత నే నెంతయు వంచితుడ నైనాను. ఆ మెత్తోడి సుఖములలో దగిలియుండి సూర్యు డుదయించి నదియు, అస్తమించినదియు, ఎన్ని దినములు పక్షములు నెలలు సంవత్సరములు గడచినదియు, తెలియకపోతిని. ౮

ఆహా! నా మోహపరాధీనత్వము నేమనవలె? నరదేవ శిఖామణినై మహాచక్రవర్తినై పేరు గాంచిన నే నొకస్త్రీచే క్రీడామృగము గావింపబడితిని. ౯

సపరికరుడనై మహావిభవకలితుడనై మహారాజనైన నన్ను గడ్డిపరకనువలె వదలివైచి వెళ్ళిపోవుచున్న స్త్రీ ననుసరించి, నగ్నుడనై ఉన్మత్తుడువలె విలపించుచు వెంటబడి పోతిని. ౧౦

కుత స్తస్యానుభావః స్యా త్తేజ ఈశిత్వ మేవ వా,
యోన్వగచ్ఛం స్త్రియం యాంతీం ఖరవత్పాదతాడితః. ౧౧

కిం విద్యయా కిం తపసా కిం త్యాగేన శ్రుతేన వా,
కిం వివిక్తేన మౌనేన స్త్రీభి ర్యస్య మనో హృతమ్. ౧౨

స్వార్థ స్యాకోవిదం ధి జ్మాం మూర్ఖం పండితమానినమ్,
యోఽహ మీశ్వరతాం ప్రాప్య స్త్రీభి ర్గోఖరవ జ్జితః. ౧౩

సేవతో వర్షపూగా న్మే ఊర్వశ్యా అధరాసవమ్,
న తృప్య త్యాత్మభూః కామో వహ్ని రాహుతిభి ర్యథా. ౧౪

---

కాలితో తన్నినను విడువక ఆడుగాడిదను మగగాడిద వలె, తిరస్కరించిపోవుచున్న స్త్రీ ననుసరించి పోసాగిన నాకు మహానుభావత్వముగాని, తేజస్త్వముగాని, చక్రవర్తిత్వముగాని, యుండి, యేమి ప్రయోజనము ? ౧౧

స్త్రీలచే నపహరింపబడిన మనస్సు గలవానికి విద్యగాని, తపస్సుగాని, త్యాగముగాని, శ్రుతముగాని, ఏకాంతసేవిత్వము గాని, మౌనముగాని, యుండి యేమి లాభము ? ౧౨

ఛీ ! ఛీ ! నేను వట్టి మూఢుడను పండితమ్మన్యుడను అయి, స్వపురుషార్థము నేమియు గుర్తింప నేరని అజ్ఞుడ నయి పోయినాను. చక్రవర్తిపదవిని బొందియుండియు, అక్కటా ! స్త్రీలచేత, పశువువలె, గాడిదవలె జయింపబడితిని. ౧౩

పెక్కేండ్లు విడువక ఊర్వశియధరామృతమును పానము చేసినను, నామనస్సున గలిగిన కామము, ఆహుతులతో అగ్ని హోత్రము వలె, ఇసు మంతయు తృప్తి గొనకున్నది. ౧౪

పుంశ్చల్యాపహృతం చిత్తం కో న్వన్యో మోచితుం ప్రభుః,
ఆత్మారామేశ్వర మృతే భగవంత మధోక్షజమ్? ౧౪

బోధితస్యాపి దేవ్యా మే సూక్తవాక్యేన దుర్మతేః,
మనోగతో మహామోహో నాపయా త్యజితాత్మనః, ౧౫

కిం మేతయా నోపకృతం రజ్జ్వా వా సర్పచేతసః,
ద్రష్టుః స్వరూపావిదుషో యోఽహం య దజితేంద్రియః. ౧౬

---

పుంశ్చలి యగు స్త్రీచే నపహరింపబడిన మనస్సును' ఆత్మారాముడు అధోక్షజుడు భగవంతుడు నగు పరమేశ్వరుడు తక్క, మఱియింకొక డెవ్వడు వదలింప గలడు? ౧౪

ఆ ఊర్వశీదేవి, "ప్రశు.— పురూరవో మా మృథా మా ప్రతప్తో మా త్వా వృకాసో అశివాస ఉక్షన్, న వై స్త్రైణాని సఖ్యాని సంతి సాలావృకాణాం హృదయాని చైతా" ఇత్యాది సూక్తవాక్యములతో స్పష్టముగా బోధించినను, అజితాత్ముడ నైన నామనస్సున నుద్భవించిన మహామోహము తొలగి పోకున్నది. ౧౫

రజ్జువును జూచి భ్రమించి యథార్థస్వరూపము నెఱుగక పా మని తలచుచో, దానికి నిజముగా ఆత్రాడు చేసిన దోష మేమి? ఆదోషము ఆభ్రమపడిన యజ్ఞునిదే కదా? అట్లే వాస్తవమున ఊర్వశి కామావిలచిత్తుడ నగు నాయెడ గావించిన అపరాధ మేమున్నది? నేనే అజితేంద్రియుడనై అట్లయినాను. ౧౬

మలినమై దౌర్గంధ్యాదులకు నెలవై అపవిత్రమైన యీ శరీర మెక్కడ! సౌమనస్యము అనగా పూవులకువలె సౌగం

క్వాఽయం మలీమసః కాయో దౌర్గంధ్యాద్యాత్మకోఽశుచిః,
క్వ గుణాః సౌమనస్యాద్యా హ్యధ్యాసోఽవిద్యయా కృతః. ౧౮

పిత్రోః కిం స్వం ను భార్యాయాః స్వామినోఽగ్నేః శ్వగృధ్రయోః,
కిమాత్మనః కిం సుహృదామితి యో నావసీయతే. ౧౯

తస్మిన్ కళేబరేఽమేధ్యే తుచ్ఛనిష్ఠే విషజ్జతే,
అహో సుభద్రం సునసం సుస్మితం చ ముఖం స్త్రియః. ౨౦

---

ధ్యము సౌకుమార్యము మున్నగు గుణము లెక్కడ? అజ్ఞాన వశముననే అధ్యాస గావింపబడుచున్నదిసుమా! అజ్ఞానవశము ననే సౌమనస్యాది గుణములు హేయమగు కాయమునందు స్వపరికల్పితము లగుచున్నవి. ౧౮

ఈ శరీరము కన్నతలిదండ్రులదా? భోగప్రదమైన భార్యదా? పోషకుడైన యజమానునిదా? తుదికి దహింపజేయు నగ్నిహోత్రునిదా? లేక కొఱికి తిను శ్వగృధ్రాదులదా? తత్కృతఫలములగు శుభాశుభముల ననుభవించు తనకే సంబంధించినదా? ఉపకారు లగు మిత్రులదా? ఇది యెవరికి సంబంధించినది? ఎవరి కభిమానపాత్ర మైనది? నిశ్చయముగా తెలియబడదు. ౧౯

అమేధ్యమై తుట్టతుదకు క్రుళ్ళి పురుగులుపడి, విణ్మూత్ర లక్షణమై, భస్మమై పోవు నీ కళేబరమునందు మూఢు డగు వాడు, ఆహా! ఈ స్త్రీముఖ మెంత అందముగా నున్నది? ముక్కెంత ముచ్చటగా నున్నది? అని తలచి, ప్రియముగా భావించి సక్తు డగుచున్నాడు. ఆశ్చర్యము! ౨౦

త్వ జ్మాంస రుధిర స్నాయు మేదో మజ్జాస్థి సంహతౌ,
విణ్మూత్రపూయే రమతాం క్రిమీణాం కియ దంతరమ్ ? ౨౧
తథాపి నో విషజ్జేత స్త్రీషు స్త్రైణేషు చార్థవిత్,
విషయేంద్రియసంయోగా న్మనః క్షుభ్యతి నాన్యథా. ౨౨
అదృష్టా దశ్రుతా ద్భావా న్న భావ ఉపజాయతే,
అసంప్రయుంజతః ప్రాణా౯ శామ్యతి స్తిమితం మనః. ౨౩
తస్మా త్సంగో న కర్తవ్యః స్త్రీషు స్త్రైణేషు చేంద్రియైః,
విదుషా మ ప్యవిస్రబ్ధః షడ్వర్గః కిము మాదృశామ్ ? ౨౪

---

చర్మము, మాంసము, రక్తము, స్నాయువులు, మేదస్సు మజ్జ, ఎముకలు మున్నగువాని ప్రోవై విణ్మూత్రములతో నిండి యుండు నీ శరీరమునందు రమించు మనుజులకును క్రిములకును భేద మేమి ? ౨౧

కావున వివేకవంతు డగువా డెవ్వడును, స్త్రీలతోడను, స్త్రీసక్తు లగువారితోడను, సంగమును పెట్టుకొనరాదు. మనస్సు విషయేంద్రియసంయోగమువలన జలించి వికల మగునుగాని, మఱొక్క తెఱగున గానేరదు. ౨౨

మున్ను తా జూడనట్టియు, విననట్టియు, విషయమువలన తనమనస్సులో, దానినిగుఱించిన విచారమే పుట్టదు. కావున, ఇంద్రియములను విషయములపై బోనీక అరికట్టువానికి, మనస్సు స్తిమితమై చలింపక నిలిచి శమము నొందును. ౨౩

కావున స్త్రీలతోడను, స్త్రీసక్తు లగువారితోడను, ఎన్న డును ఎవ్వడును సంగము గావింపరాదు, విద్వాంసు లగువారల కేని, ఇంద్రియషడ్వర్గము నమ్మదగినది కా దనిన, ఇక మావంటి వారి విషయమును మఱివేఱె చెప్పనేల ? ౨౪

## శ్రీకృష్ణ ఉవాచ

ఏవం ప్రగాయన్ నృపదేవదేవ
స్స ఊర్వశీలోక మథో విహాయ,
ఆత్మాన మాత్మ న్యవగమ్య మాం వై
ఉపారమత్ జ్ఞానవిధూతమోహః. ౨౫

తతో దుస్సంగ ముత్సృజ్య సత్సు సజ్జేత బుద్ధిమాన్,
సంత ఏతస్య ఛిందంతి మనోవ్యాసంగ ముక్తిభిః. ౨౬

సంతో౽నపేక్షా మచ్చిత్తాః ప్రశాంతా స్సమదర్శినః,
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః. ౨౭

---

## శ్రీకృష్ణుడు చెప్పెను

అని తలచి గానము చేయుచు, చక్రవర్తిచూడామణి యగు పురూరవుడు, ఊర్వశీలోకేచ్ఛను బాసి, పరమాత్మ నగు నన్ను మనస్సున నిలిపి, సాక్షాత్కారము గావించుకొని, జ్ఞానము చేత నెల్లమోహములను దొలగించుకొని, ముక్తు డయ్యెను. ౨౫

కావున, బుద్ధిమంతు డగువాడు, దుస్సంగమును వదలి, సత్సంగమును గావించుకొనవలెను. అట్లు కావించినచో, సత్పురుషు లాతని మనోవ్యాసంగమును తగునుక్తులతో వదలించి వేయుదురు. ౨౬

సత్పురుషు లగువారు నిరపేక్షులు, మచ్చిత్తులు, ప్రశాంతులు, సమదర్శులు, నిర్మములు, నిరహంకారులు, నిర్ద్వంద్వులు, నిష్పరిగ్రహులు నై యుందురు. ౨౭

తేషు నిత్యం మహాభాగ! మహాభాగేషు మత్కథాః,
సంభవంతి హి తా నృణాం జుషతాం ప్రపునం త్యఘమ్. ౨౮

తా యే శ్రుణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః,
మత్పరాః శ్రద్దధానాశ్చ భక్తిం విందంతి తే మయి. ౨౯

భక్తిం లబ్ధవతః సాధోః కి మన్య దవశిష్యతే?
మ య్యనంతగుణే బ్రహ్మ ణ్యానందానుభవాత్మని. ౩౦

యథోపశ్రయమాణస్య భగవంతం విభావసుమ్,
శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవత స్తథా. ౩౧

---

మహాభాగులగు ఆ సత్పురుషులు, నిరంతరము నాకథలనే కొనివిచారించుచు నుందురు. ఆ కథలు, పరమపవిత్రములైనవి. అవి, వినువారలపాపములను దొలచివేసి, వారిని పవిత్రుల నొనరించును. ౨౮

ఆ కథలయం దాదరము నిలిపి, శ్రద్ధతో వినువారు, గానము చేయువారు, అనుమోదించువారు, మత్పరులై, నాయందు శ్రద్ధ గలిగి, నాయందు భక్తిని బొందుదురు. ౨౯

అనంతగుణుడనై, కేవలానుభవానందాత్ముడనై, పరబ్రహ్మ నగు నాయందు భక్తిని బొందిన సాధువున కింక గావలసిన దేమున్నది? వాని కింకేది కొదువ? ౩౦

సూర్యభగవాను డుదయించినపిమ్మట శీతబాధ నశించునట్లే, సాధువులసేవ జేసినవారికి, ఆగామికర్మాదిబాధ్యము, ఆగామిసంసారభయము, తన్మూలమైన అజ్ఞానము, నశించిపోవును. ౩౧

నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయణమ్,
సంతో బ్రహ్మవిద శ్శాంతా నౌ ర్దృఢేవాప్సు మజ్జతామ్. 3౨

అన్నం హి ప్రాణినాం ప్రాణ ఆర్తానాం శరణం త్వహమ్,
ధర్మో విత్తం నృణాం ప్రేత్య సంతోఽస్మా ద్బిభ్యతోఽరణమ్.

సంతో దిశంతి చక్షూంషి బహి రర్క స్సముత్థితః,
దేవతా బాంధవా స్సంత స్సంత ఆత్మాహ మేవ చ. 3౪

---

నీటిలో మునిగిపోవువారికి సడవవలె, ఘోరమైన భవ సముద్రమునందు మునుగుచు తేలుచు కొట్టుకొని పోవువారలకు బ్రహ్మవేత్తలు శాంతులు నగు సత్పురుషులే దిక్కుసుమా! 3౨

ప్రాణధారులకు అన్నమే ప్రాణము, అనగా జీవనము. ఆర్తు లగువారికి నేనే రక్షకుడను. పరలోకమున ధర్మమే రక్షకము. ఇహమందు ధనము రక్షకము. అట్లే ఈ సంసారపాతమునకు భయపడువారలకు సత్పురుషులే రక్షకులు. 33

సత్పురుషులు సూర్యునికంటెను గొప్పవారు. సూర్యుడు లెస్సగా ఉదయించి బహిరవలోకనమునకు వీలుపడు నొక కంటిని మాత్రమే యిచ్చును. సత్పురుషు లట్లు గాదు. సగుణ నిర్గుణ జ్ఞానముల నుపదేశించి, ఆంతరికమైన చక్షువును దెలిపింతురు. కావున, సత్పురుషులే దేవతలు. సత్పురుషులే బంధువులు. సత్పురుషులే ఆత్మ. సత్పురుషులే నేనును. 3౪

వైరసేన స్తతోఽప్యేవ మూర్వశ్యా లోకనిస్పృహః,
ముక్తసంగో మహీ మేతా మాత్మారామ శ్చచార హ. ౩౫

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే ఐలగీతం నామ
షడ్వింశోఽధ్యాయః.



ఇట్లు నిశ్చయించి వీరసేనకులోద్భవుడైన ఆ పురూరవ మహారాజు సైతము, ఊర్వశిని జూడవలె ననిగాని, ఊర్వశీలోకమున కేగవలె ననిగాని, కోరక నిస్పృహుడై, ముక్తసంగుడై, ఆత్మారాముడై, ఈ భూమిలో నెల్లెడ సంచరించెను. ౩౫

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున ఐలగీత మను
ఇరువదియాఱవ యధ్యాయము.



# ౭ శ్రుతిగీత

శ్రుతిగీత శ్రీమద్భాగవతము దశమస్కంధమున ఎనుబది యేడవ యధ్యాయముగా శ్రీ వేదవ్యాసభగవానునిచే నిబద్ధము. ఇది అశేష సమామ్నాయ పురాణోపనిషద్రసము, అని అదే యధ్యాయమున నలువదినాలుగవ శ్లోకమున నిర్వచింప బడినది. నిర్గుణము, అనిర్దేశ్యము నైన బ్రహ్మమునందు గుణవృత్తులైన శ్రుతివాక్యము లెట్లు సాక్షాత్తు అన్వయింప గలవు ? అని తన్నడిగిన ప్రశ్నకు సమాధానముగా పరీక్షిన్నరేంద్రునకు శుకయోగి, మున్నొకప్పుడు జనలోకములో జరిగిన బ్రహ్మసత్రయాగమున ఇదే ప్రశ్న రాగా, సనకాదులను శ్రోతలను జేసి, సనందనమాని ప్రవచించిన విధానమున, నారాయణమహర్షి నారదునకిదే ప్రశ్నమునకు సమాధానముగా నిట్లుపదేశించె, — నని శ్రుతిగీతోపాఖ్యానము నుపదేశించెను. నిద్రించుచున్న రాజును వందిమాగధులువలె సర్వలయము గావించి, ప్రళయాంతమున శయానుడై యున్న భగవానుని శ్రుతులిట్లు స్తుతించిన వని యుపక్రమించి, ఈ శ్రుతిగీతమునందు సమస్తోపనిషద్రహస్యము నిర్వచింప బడినది. పురాణవాఙ్మయములో తత్త్వోపదేశకములైన ప్రధానఘట్టములలో, సుసమగ్రములైనవానిలో, శ్రుతిగీతను మించిన ఘట్టము లేనే లే దని చెప్పవచ్చును. అది అర్థాని పరంపరాద్వారముననే విదిత మగుచున్నది. ఎందును ఎట్లును సులభముగా సమాధానము కుదురని అన్ని సంశయములకును సమాధానము చెప్పి, ఈ శ్రుతిగీతాఘట్టము, హృదయగ్రంథితోపాటు భవగ్రంథినిగూడ అడచునదిగా నున్నది.

రాజోవాచ

బ్రహ్మన్! బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః,
కథం చరంతి శ్రుతయః సాక్షాత్సదసతః పరే? ౧

శ్రీశుక ఉవాచ

బుద్ధీంద్రియమనఃప్రాణాన్ జనానా మసృజత్ప్రభుః,
మాత్రార్థం చ భవార్థం చ ఆత్మనే కల్పనాయ చ. ౨

సైషా హ్యుపనిషద్బ్రాహ్మీ పూర్వేషాం పూర్వజైర్ధృతా,
శ్రద్ధయా ధారయేద్యస్తాం క్షేమం గచ్ఛే దకించనః. ౩

---

పరీక్షిన్మహారాజనెను

బ్రహ్మజ్ఞుడ వగు ఓ శుకమహర్షీ! ఎట్లును నిర్దేశించుటకు వీలుపడనిదియు నిర్గుణము సదసత్పరము నగు బ్రహ్మమునందు గుణవృత్తులైన శ్రుతులెట్లు సాక్షాత్తు ప్రవర్తింప గలవు? ౧

సర్వప్రభు వగు భగవానుడు, జీవులకు అర్థ ధర్మ కామ మోక్షములనిమిత్తమై, బుద్ధిని ఇంద్రియములను మనస్సును ప్రాణములను సృజించెను. పరంపరగాగాని, సాక్షాత్తుగాగాని, సమస్తశ్రుతులకును బ్రహ్మమునందే పర్యవసానము. అంతియ గాక, ఈశ్వరుడు జీవులను మోక్షముకొఱకే సృష్టించుచున్నాడు. స్వరూపోపపాదనమునువినా ఆతడు పొందబడడు. కావున, ఏదేని యొక యోగ్యవృత్తి నాశ్రయించి, శ్రుత్యర్థమును గమనించి పరమేశ్వరు నెఱిగి కొనవలెను. ౨

సర్వశబ్దములు, సర్వశ్రుతులు, బ్రహ్మమునందే ముఖ్య వృత్తిని బొందుచున్నవి. వానికి తదన్యత్వ మేమాత్రమేనియు లేదు, అనుట నిశ్చయము. కావున, పూర్వోద్దిష్ట మగు నిది,

అత్ర తే వర్ణయిష్యామి గాథాం నారాయణాన్వితామ్,
నారదస్య చ సంవాదం ఋషే ర్నారాయణస్య చ. ౪

ఏకదా నారదో లోకాన్ పర్యటన్ భగవత్ప్రియః,
సనాతన మృషిం ద్రష్టుం యయౌ నారాయణాశ్రమమ్. ౫

యో వై భారతవర్షేఽస్మిన్ క్షేమాయ స్వస్తయే నృణామ్,
ధర్మజ్ఞానశమోపేత ఆకల్పా దాస్థిత స్తపః. ౬

---

బ్రహ్మానుగుఱించి బోధించు నతిరహస్య విషయము. దీనిని బ్రాహ్మ్యుపనిషత్తు అనవచ్చును. దీనిని పూర్వాతిపూర్వు లగు వామదేవాదులు, విచారించి, నిశ్చయించి, తమమనస్సులలో ధారణ చేసి యుండిరి. దానిని శ్రద్ధతో దెలిసి ధారణచేయువాడు ఆత్యంతిక క్షేమమును అనగా బ్రహ్మమునే పొందును. అతని కింక కోరదగినదికాని, పొందబడనిదికాని, యుండదు. ౩

ఈవిషయమున నొక పురాతనగాథ కలదు. అది నారద నారాయణమహర్షి సంవాదరూపమున నున్నది. అది, ప్రవర్తకు డగు నారాయణునితో నిర్భరమై యున్నది. కావున అతిపవిత్ర మైనది. ౪

ఒకప్పుడు నారదుడు లోకసంచారము చేయుచు సనాతను డగు నారాయణమహర్షిని జూడవలె నను కోరికతో నారాయణాశ్రమమున కేగెను. ౫

ఈ భారతవర్షమునందు నరులకు అభయరూప మగు క్షేమము, మోక్షరూప మగు స్వస్తి కలుగుటకై, ఆ నారాయణమహర్షి, ధర్మము, జ్ఞానము, శమము మున్నగువానితో గూడి, కల్పాదినుండియు తపము గావించుచున్నాడు. ౬

తత్రోపవిష్ట మృషిభిః కలాపగ్రామవాసిభిః,
పరీతం ప్రణతోఽపృచ్ఛ దిద మేవ కురూద్వహా ! ౭

తస్మా అవోచ ద్భగవా నృషీణాం శృణ్వతా మిమమ్,
యో బ్రహ్మవాదః పూర్వేషాం జనలోకనివాసినామ్. ౮

శ్రీ భగవా నువాచ

స్వాయంభువ ! బ్రహ్మసత్రం జనలోకేఽభవ త్పురా,
తత్రత్యానాం మానసానాం మునీనా మూర్ధ్వరేతసామ్. ౯

శ్వేతద్వీపం గతవతి త్వయి ద్రష్టుం తదీశ్వరమ్,
బ్రహ్మవాదః సంప్రవృత్తః శ్రుతయో యత్ర శేరతే. ౧౦

---

పరీక్షిన్మహారాజా ! ఆ యాశ్రమమున కలాపగ్రామవాసులగు ఋషులు పరివేష్టింపగా కూర్చుండియున్న ఆ నారాయణ మహర్షిని గాంచి మ్రొక్కి నారదు డిదియే ప్రశ్నించెను. ౭

అపు డా నారాయణమహర్షి, ఆ ఋషు లందఱు వినుచుండగా, నారదునితో, పూర్వము జనలోకనివాసులు, పూర్వుల కంటె పూర్వులు నగు సనందనాదులు ప్రశ్నోత్తరరూపముగా చర్చించి చెప్పిన యీ విషయమునే యిట్లు చెప్పెను. ౮

శ్రీ నారాయణ మహర్షి చెప్పెను

నారదా ! పూర్వము జనలోకమున బ్రహ్మసత్రము జరిగెను. తల్లోకనివాసులు, ఊర్ధ్వరేతస్కులు, బ్రహ్మమానస పుత్త్రులు నగు సనకాది మహర్షు లద్దానిని జరిపిరి. ౯

ఆసమయమున నీవు శ్వేతద్వీపాధిపతి యగు పరేశ్వరుని జూడ గోరి శ్వేతద్వీపమున కేగియుంటివి. ఆ బ్రహ్మ

తత్ర హోయ మభూత్ ప్రశ్న స్త్వం మాం య మనుపృచ్ఛసి,
పరిహారాం శ్చ తాన్ సర్వాన్ వక్ష్యేఽహం శ్రుణు తేఽనఘ !

తుల్యశ్రుతతపశ్శీలా స్తుల్యస్వీయారిమధ్యమాః,
అపి చక్రుః ప్రవచన ఏకం శుశ్రూషవోఽపరే. ౧౨

సనందన ఉవాచ

స్వసృష్ట మిద మాపీయ శయానం సహ శక్తిభిః,
తదంతే బోధయాంచక్రు స్తల్లింగైః శ్రుతయః పరమ్. ౧౩

---

సత్రమునందు సనకాదులు బ్రహ్మవిచారమును జరిపిరి. అందు శ్రుతులుకూడ స్వయముగ పాల్గొనినవి. ౧౦

ఆ బ్రహ్మవాదమునందు నీవు న న్నడిగిన యీ ప్రశ్నయే వచ్చెను. అప్పు డీ విషయమున పుట్టిన పూర్వపక్షములను సిద్ధాంతములను అన్నిటిని సవిమర్శముగ నీకు జెప్పుచున్నాను. వినుము. ౧౧

తుల్యమైన శాస్త్రజ్ఞానము, తపస్సు, శీలము, గలిగి, శత్రుమిత్రోదాసీనులయందు తుల్యమైన భావమే గలిగి, అందఱును సమర్థులే అయియున్నను, ఆ సనకాదులు, సనందుని వక్తను గావించిరి. తక్కినవా రందఱు నప్పుడు శ్రోతలుగా బను పడిరి. అప్పుడు సనందను డిట్లు ప్రవచించెను. ౧౨

సనందనుడు చెప్పెను

తనచే సృజింపబడిన యీ బ్రహ్మాండము నంతయు నుప సంహరించి, నామరూపాది విభాగములతో గ్రహింప నలవి గాని యవస్థ నంది యున్న ప్రకృతి పురుష కాలాత్మ కము లైన శక్తులతో సహా శయనించి నిదురించుచున్న వాడువలె

యధా శయానం సమ్రాజం వందిన స్తత్పరాక్రమైః,
ప్రత్యూషేఽభ్యేత్య సుశ్లోకై ర్బోధయం త్యనుజీవినః. ౧౪

శ్రుతయ ఊచుః

జయ జయ జ హ్యజా మజిత! దోషగృభీతగుణాం
త్వ మసి య దాత్మనా సమవరుద్ధసమ స్తభగః,
అగజగదోకసా మఖిలశ క్త్యవబోధక! తే
క్వచి దజయాత్మనా చ చరతోఽనుచరే న్నిగమః. ౧౫

---

వర్తించుచున్న పరమపురుషుని, ప్రళయాంతమునందు శ్రుతులు మూర్తిమంతములై సమీపించి పరమపురుష సాధారణధర్మ ప్రకాశకములైన తల్లింగములతో మేలుకొలుప దొడగెను. ౧౩

నిద్రించుచున్న సమ్రాట్టును తదనుజీవులైన వందిమాగధులు ప్రభాతసమయమున సమీపించి, సుశ్లోకములైన తత్పరాక్రమములను బేర్కొనుచు మేలుకొలుపునట్లు శ్రుతులు పరమపురుషుని ప్రబోధింప మొదలిడెను. ౧౪

శ్రుతులు పలికెను

ఓ మహాపురుషా! జయ! జయ! సర్వోత్కర్షమును శాశ్వతముగా పొందుమా! ఓ అజితుడా! దోషములతో నిండియుండియు గుణమును ప్రదర్శించు స్వభావము గలిగి, జీవులకు సంసారమును దెచ్చిపెట్టు గుణమునకు ఆశ్రయమైన మాయను జయించివేయుము. నీవు స్వయముగా పరమైశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అను షడ్గుణసంపదను పొంది యున్నవాడవు. స్థావరములు జంగమములు నగు శరీరములు గల జీవులలో నంతర్యామివై వాని

బృహ దుపలబ్ధ మేత దవయం త్య్వవ శేషతయా
యత ఉదయా స్తమయౌ వికృతే ర్మృదివావికృతాత్,
అత ఋషయో దధు స్త్వయి మనోవచనాచరితం
కథ మయథాభవంతి భువి ద త్తపదాని నృణామ్? ౧౬

---

యెల్ల శక్తులను గార్యోన్ముఖములను గావించు వాడవు నీవే సుమా ! సృష్ట్యాదిసమయమున మాయతో క్రీడించుచు, నిత్యములు ప్రపర మైశ్వర్య వ త్త్వమున సత్యజ్ఞానానం దై కరస మైన ఆత్మతో వర్తించు నిన్ను వేదము ప్రతిపాదించుచున్నది. ౧౫

బ్రహ్మమువలన బొడమి ఇంద్రాగ్న్యాదినామముల వ్యవహారమును గనుచున్న యీ సమ స్తమును బ్రహ్మమే యని వేదాంతములు చెప్పుచున్నవి. అట్లు జగత్కారణ మగు ఆ బ్రహ్మవలననే యీ సమ స్తము పుట్టి, మరల బ్రహ్మమునందే లయ మొందుచున్నది. ఒక్కటియే యైన మృత్పిండమువలన ఘటశరావాదులు పుట్టి భగ్నములై మరల ఆ మృత్తునందే లయ మొందుచున్నవి. అట్లగుటవలన ఆ మృత్తున కేమియు వికారము కలుగుట లేదు. అట్లే ఉత్ప త్తిలయములకు గారణ మైనను బ్రహ్మ కెట్టి వికారము కలుగుటలేదు. అది స్వతస్సిద్ధముగా నిర్వికారము. అందువలన, మంత్రములును మంత్రద్రష్ట లగు మహర్షులును తమమనోవాగాచరితములను నీయందే నిలిపి, తమ మనస్సుతో నిన్నే ధ్యానించి, పలుకులతో నిన్నే నిరూపించుచు న్నారు. అది సక్రమమే కదా. ఎట్లన — పాషాణములు ఇష్టికలు మున్నగువానిపై నడుగు లిడినను, అవి భూమిపై నిడి నట్లే యగుచున్నవికదా ! మృద్వికారములైన పాషాణేష్టికాదులు భూమయములే యగుచున్నవిగాని, భూమికంటె వేఱగుటలేదు.

ఇతి తవ సూరయ స్త్ర్యధిప తేఽఖిలలోకమల
క్షపణకథాఽమృతాబ్ధి మవగాహ్య తపాంసి జహుః,
కిముత పునః స్వధామవిధుతాశయకాలగుణాః
పరమ! భజంతి యే పద మజస్రసుఖానుభవమ్?                    ౧౭

దృతయ ఇవ శ్వసం త్యసుభృతో యది తేనువిధా
మహదహమాదయోఽండ మసృజన్ యదనుగ్రహాతః,
పురుషవిధోఽన్వయోఽత్ర చరమోఽన్నమయాదిషు య
స్సదసతః పరం త్వ మథ యదే ష్వవశేష మృతమ్.                    ౧౮

అట్లే బ్రహ్మేంద్రాగ్నిరవీందుముఖాత్మకముగా వ్యవహారమును గనుచున్నను ఈజగము బ్రహ్మమువలననే పుట్టిన దగుటవలన బ్రహ్మకంటె వేఱు కానేరదు.                    ౧౬

జగజ్జన్మస్థితిలయములకు హేతుభూతుడ వైన ఓ ప్రభూ! అట్లు సర్వకారణుడవు ధ్యేయుడవు నీవే యగుటవలన వివేకవంతులగు పండితులు, అఖిలలోకముల మలములను దొలగించివైచు నీ కథాసుధాబ్ధియం దవగాహనము చేసి, తాపములను బోగొట్టుకొనుచున్నారు. అని చెప్పిన ఓ పరమపురుషుడా! స్వరూపస్ఫురణముచేత రాగాదిమనోవృత్తులను జరామరణాదులను శమింపజేసికొని అఖండానందానుభవమైన నీ స్వరూపమునే సేవించువారలవిషయము నింక జెప్పవలసిన దేమున్నది?                    ౧౭

నరులు నీయందు భక్తి కలిగి నిన్ననువర్తించువా రవుదురేని, సఫలజీవనులే కాగలరు. అట్లు గాక, ప్రాణేంద్రియతర్పణపరాయణులై శబ్దాదివిషయముల దగిలి లౌల్యమున వర్తింతురేని, వారిని వాయుపూరితము లైన చర్మభస్త్రికలే యని యున

ఉదర ముపాసతే య ఋషివర్త్మసు కూర్పదృశః
పరిసరపద్ధతిం హృదయ మారుణయో దహరమ్,
తత ఉదగా దనంత! తవ ధామ శిరః పరమం
పున రిహ య త్సమేత్య న పతంతి కృతాంతముఖే. ౧౮

పలెను. ఎందువలన నన — సర్వకారణుడ వగు నీ యనుప్రవేశ రూప మగు ననుగ్రహము వలననే సామర్థ్యమును పొంది మహ దహంకారాదులు అండమును సృజించినవి. అంతియగాక — అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనంద మయము లనెడు పంచకోశములయందును తుదిదై పురుష విధమై యన్వయించి యుండి పుచ్ఛముగా నభిహిత మగు నానందమయము నీవేసుమా! సదసదాత్మకమగు నన్నమయాది కముకంటెను పరుడవు అనగా తత్సాక్షీభూతుడవును నీవే. అవి నశించినను అబాధ్యముగా మిగిలియుండు ఋతము అనగా సత్యము సయితము నీవేసుమా! ౧౭

ఋషిసంప్రదాయమార్గములలో స్థూలదృష్టు లగువారు కొందఱు మణిపూరకస్థిత మగు బ్రహ్మ నుపాసింతురు. సూక్ష్మ దృష్టు లైన అరుణివంశ్యులు దహరము అనగా సూక్ష్మ మగు హృదయమును అనగా అనాహతచక్రస్థిత మగు బ్రహ్మము నుపా సింతురు. ఎందువలన నన— హృదయము సమస్తనాడీప్రసారమున కును మార్గము. హృదయములోనుండి శతసంఖ్యాకములైన నాడులును, సుషుమ్నయును పోవుచున్నవి. సుషుమ్న నిన్ను బడయుటకు దగుస్థానము. అది మూలాధారమునుండి హృదయ మధ్యముద్వారా ఊర్ధ్వముగ వెడలి, జ్యోతిర్మయము శ్రేష్ఠము నగు బ్రహ్మరంధ్రమువఱకు నధిగమించి యున్నది. ఆసుషుమ్న

స్వకృతవిచిత్రయోనిషు విశ న్నివ హేతుతయా
తరతమత శ్చకా స్త్యనలవత్ స్వకృతానుకృతిః,
అథ వితథా స్వమూ ష్వవితథం తవ ధామ సమం
విరజధియోన్వయం త్యభివిపన్యవ ఏకరసమ్. ౨౦

---

ద్వారా అంతకాలమున వశీకృతాత్ములై నిన్ను పొందినవారు మరల కృతాంతముఖమున అనగా సంసారమున బడరు. ౧౯

సర్వోపాదానకారణత్వముతో నీచే స్వయముగా నిర్మింపబడిన విచిత్రములైన దేహములయందు అంతరాత్మరూపమున ప్రవేశించి యున్నవాడవువలె వర్తిలుచు నీవు తరతమభావముతో అగ్నిహోత్రుడువలె, స్వకృతములైన యోనుల ననుకరించి ప్రకాశించుచు నుందువు. వస్తుతః అగ్నిహోత్రునకు ఎక్కువ తక్కువలు లేకున్నను, తాను నిలుచు తృణకాష్ఠాదుల పరిమాణ బలాదికములనుబట్టి యెక్కువతక్కువలతో భాసించునట్లును, తన ప్రకాశమున వస్తుతః యెక్కువతక్కువలు లేనివాడే యయ్యు సూర్యుడు మేఘావరణము గల వర్షాకాలమున నికృష్టప్రకాశుడుగా, మేఘావరణరహిత మైన శరత్కాలమున ప్రకృష్టప్రకాశుడుగా, గ్రీష్మమున మహోత్కృష్టప్రకాశుడుగా, ప్రకాశించుచు నుండునట్లు, నీవును తరతమభావములు లేనివాడవే అయ్యు, నీవు రచించిన ఆయా యోనులయందు గల జ్ఞానమునందలి న్యూనాధిక్యముల ననుసరించి, అట్లే ప్రకాశించుచుందువు. అయినను, ఈ యోను లుపసంహృతము లైనను, సమము అనగా ఏకరూపము, ఏకరసము అనగా అవిచ్ఛిన్నానందము నగు నీ స్వరూపము ఉపసంహృతము కానేరదు. అట్టి నీ శాశ్వత పరమ ధామమును నిర్మలమతు లగు పురుషులు వివిధములైన

స్వకృతపురే ష్వమీ ష్వబహిరంతరసంవరణం
తవ పురుషం వదం త్యఖిలశక్తిధృతో౽ంశకృతమ్,
ఇతి నృగతిం వివిచ్య కవయో నిగమావపనం
భవత ఉపాసతే౽ంఘ్రి మభవం భువి విశ్వసితాః. ౨౧

దురధిగమాత్మత త్త్వనిగమాయ తవా త్తతనో
శ్చరితమహామృతాబ్ధి పరివర్త పరిశ్రమణాః,
న పరిలషంతి కేచి దపవర్గ మపీశ్వర! తే
చరణసరోజహంసకులసంగవిసృష్టగృహాః. ౨౨

---

త్వద్గుణములనే కీర్తించు స్తుతులతో, నిన్నే సేవించి, యుపాసించి, నిన్నే పొందుదురు. ౨౦

నీచే రచింపబడి నీకు నివాసభూతములైన యీ దేవమనుష్యాది శరీరములయందు భోక్తయై యున్నట్టియు, లోపల వెలుపల అను భేదము లేక యెల్లెడ వ్యాపించి యుండునట్టియు, పురుషుని, అఖిలశక్తిధరుడవై పూర్ణుడవైన నీ అంశకృతునిగా వేదాంతవాక్యములు బోధించుచున్నవి. ఇట్లు జీవగతి యిట్టిదనియు, భగవద్భజనమువినా యిది తెలియబడ నేరదనియు, విచారించి, నిశ్చయించి, వివేకవంతు లగువారు వేదములకు స్థానమై, జ్ఞానమున కుత్పాదకమై, సర్వకర్మార్పణవిషయమై, సంసారబంధమును వదలించు నీపాదమును తప్పక మోక్షమును గలిగింపగల దను నమ్మికతో జితశ్వాసులై జితేంద్రియులై సేవించుచున్నారు. ౨౧

ఎంత కష్టపడినను ఎట్లును దెలిసికొన శక్యముగాని యాత్మతత్త్వమును ప్రకాశేపఱుచుటకు రామకృష్ణాదిరూపముల నొందిన నీ పవిత్రచరిత్ర మను అమృతసింధువునందు మునిగి ఆధ్యాత్మి

త్వదనుపథం కులాయ మిద మాత్మసుహృత్ప్రియవ
చ్చరతి తథోన్ముఖే త్వయి హితే ప్రియ ఆత్మని చ,
న బత రమం త్యహో అసదుపాసనయాత్మహనో
యదనుశయా భ్రమం త్యురుభయే కుశరీరభృతః. ౨౩

నిభృతమరున్మనోక్షదృఢయోగయుజో హృది య
న్మునయ ఉపాసతే తదరయోఽపి యయుః స్మరణాత్,

---

కాది తాపములను బోగొట్టుకొని, కొందఱు, నీ చరణ సరోజ ములనాశ్రయించిన పరమ భాగవత హంస కులములతోడి సంగముచేత దేహ గేహాద్యనురాగములు తొలగిపోయినవారై తాము అపవర్గమును సైత మభిలషింపరు. ౨౨

నశించి మట్టిలో గలిసిపోవు నీ నరశరీరము త్వదారాధన ప్రవణమై, నిన్ననువర్తించున దవునదేని, ఆనందమయు డగు నాత్మతో, మిత్రునితో, ప్రియునితో సమాన మైన దగును. కాని, శబ్దాదివిషయసేవనముతో ఆత్మఘాతు లగువారు గుణ భూయిష్ఠమై త్వదారాధన యోగ్య మైన యీ శరీరమును పొందియు, ఆనందమయుడవును, హితుడవును, ప్రియుడవు నై యేమాత్ర మానుకూల్యము కనబడినను ప్రసాదాభిముఖుడ వగుట కుద్యుక్తుడవై యుండు నీయందు రమింపరు. అట్టివారిని గుఱించి విచారపడవలసి యున్నది. పాపము! వారు ప్రారబ్ధవశ మున కుత్సితము లైన దేహములను పొందుచు, అత్యంత భయావహమైన సంసారమున బడి భ్రమించుచుందురు. ౨౩

ప్రాణములను, మనస్సును, ఇంద్రియములను, నిరోధించి, దృఢమైన యోగము నవలంబించి, సమాధినిష్ఠులగు మునులు

స్త్రియ ఉరగేంద్రభోగభుజదండవిషక్తధియో
వయ మపి తే సమాః సమదృశోంఽఘ్రిసరోజసుధాః. ౨౮

క ఇహ ను వేద బతావరజన్మలయోఽగ్రసరం
యత ఉదగా దృషి ర్య మను దేవగణా ఉభయే,
తర్హి న స న్న చాస దుభయం న చ కాలజవః
కి మపి న తత్ర శాస్త్ర మవకృష్య శయీత యదా. ౨౯

---

తమహృదయమున నుపాసించు నీతత్త్వమునే శత్రువులును ప్రీతి లేకయే ద్వేషమున స్మరించినంతమాత్రమున నిన్నే పొందిరి. పరిచ్ఛిన్నదృష్టులగు స్త్రీలునైతము కామమున ఆదిశేషునిశరీరము వంటి దీర్ఘభుజదండములు గల నీయందు సర్వాత్మనా తగిలిన మనస్సు గలవారై, నిన్నే పొందిరి. శ్రుత్యభిమాని దేవతల మగు మేమునైతము నీపదారవిందముల యమృతమే భోగ్యముగా గలిగి అనగా నీ చరణసరోజమునే ప్రకాశింపజేయుచు సర్వాత్మనా నిన్నే పొందుచున్నాము. అనగా అట్టిమునులును, అట్టిశత్రువులును, అట్టిస్త్రీలును, మేమును, ఒకేకోటికి జేరినవార మగుచున్నారము. ౨౮

ఈజగమున అర్వాచీనములైన జన్మనాశములు గల యే పురుషుడు పూర్వమే సిద్ధుడవై యున్న నిన్ను దెలిసికొనగలడు? నీవు అందఱికంటెను బూర్వుడవు. ఎందువలన నన—నీవలన ఆదిఋషి యగు బ్రహ్మ యుద్భవించెను. వాని ననుసరించి ఆధ్యాత్మికాధిదైవిక దేవగణములు ఉత్పన్నములైనవి. ఇంక మిగిలిన మనుష్యాదు లందఱు వారికంటె అర్వాచీనులు గదా? అట్టిమనుజులు సనాతనతముడ వగు నిన్ను దెలిసికొన నేర రన

జని మసత స్సతో మృతి ముతాత్మని యే చ భిదాం
విపణమృతం స్మరం త్యుపదిశంతి త ఆరుపితైః,

నాశ్చర్య మేమి ? నీవు సర్వమును లయింపజేసి శయనించినపుడు జీవులకు జ్ఞానసాధనమే లేకుండ పోయినది. ఎందువలన నన— అపుడు స్థూలమగు నాకాశాదికము గాని, సూక్ష్మ మగు మహ దాదికము గాని, సదసత్తు లగు నాకింటివలన నారబ్ధమైన శరీరము గాని, తన్నిమిత్తభూత మైన కాలవైషమ్యము గాని, లేకుండ పోయినది. అట్టిచో, అప్పు డచట ఇంద్రియప్రాణాదికము కూడ లేనిదై, జ్ఞాపక మగు శాస్త్రముకూడ లేనిదే యగు చున్నది. అందువలన అర్వాక్సృష్టిగతులై దేహాద్యుపాధులు గలిగి, కాలవశమున మలినసత్త్వ లగు నరులకు నిన్నెఱిగికొను సామర్థ్యమే లేని దగుచున్నది. అందువలన త్వదేకశరణత్వముతో శ్రవణకీర్తనాదిభక్తియే సుకరము సుమా ! ౨౫

ఉపదేష్టలగువారు సైతము భ్రమబాహుళ్యమున మునిగి తికమకపడుచుండుటవలన ఉపదేశరూపమున నేని జ్ఞానము లభించుట దుర్ఘట మగుచున్నది. ఎందువలన నన — అసత్తగు జగత్తునకు ఉత్పత్తిని వైశేషికాదులు చెప్పుచున్నారు. సత్తగు బ్రహ్మతత్త్వమునకే ఉత్పత్తిని పాతంజలాదులు చెప్పుచున్నారు. ఏకవింశతి ప్రకారమైన దుఃఖపు నాశమే మోక్ష మని నైయాయికులు చెప్పుచున్నారు. ఆత్మయందు భేదమును సాంఖ్యాదులు తలపోయుచున్నారు. దేవతలకు మనుష్యులకు అన్యోన్యోపకార భావ జనిత మైన వాణిజ్యఫల తుల్య మగు కర్మఫలవ్యవహారము సత్య మని మీమాంసకులు తలంతురు. వా రందఱును ఆరోపితములైన భ్రమములమూలముననే అట్లు చెప్పుచున్నారు

త్రిగుణమయః పుమానితి భిదా యదబోధకృతా
త్వయి న తతః పరత్ర స భవేదవబోధరసే. ౨౬

సదివ మనస్త్రివృత్త్వయి విభాత్యసదామనుజా
త్సదభిమృశంత్యశేష మిద మాత్మతయాత్మవిదః,
న హి వికృతిం త్యజంతి కనకస్య తదాత్మతయా
స్వకృత మనుప్రవిష్ట మిద మాత్మతయావసితమ్. ౨౭

---

గాని, తత్త్వదృష్టిచే మాత్రము కాదు. పురుషుడు త్రిగుణ మయు డగుట నీ భేదబుద్ధి యంతయు అజ్ఞానమున గావింపబడి నదే కాని వేఱొండు కాదు. తదబోధవిలక్షణుడవును అసంగు డవును అవబోధరసుడవును అనగా జ్ఞానఘనుడవును అగు నీవిష యమున నీయజ్ఞానము, భేదభావములు పొసగనేరవు. ౨౬

మనుష్యులు మొదలుగ నెల్లదేహధారులవఱకు మనో మాత్ర విలసితమై త్రిగుణాత్మకమైన యీ ప్రపంచజాతము అస త్తయ్యు త్వదధిష్ఠానసత్తచే సత్తువలె ప్రతీయమాన మగుచున్నది. ఆత్మవేత్త లగువారుమాత్రము భోక్తృభోగ్యాత్మకమైన యీ సమస్తవిశ్వమును ఆత్మస్వరూపముగానే తెలిసికొనుచున్నారు. ఆత్మకార్యమగు నీ ప్రపంచజాతము ఆత్మస్వరూపముననే ప్రతీయ మాన మగుచున్నది. దేనివలన ఏది పుట్టునో అది దాని రూపముననే ప్రతీయమాన మగుట లోకాచారముగదా? బంగా రమువలన సిద్ధమయిన కటకమకుటాదికములు బంగారువికార మును బాయక తదాత్మములే యగుట కారణభూతకనకమయ ములుగానే గోచరించుచున్నవి. అట్లే పరమాత్మచే సృజింపబడిన యీజగము తదనుప్రవిష్టమై యున్నదగుటచేత కారణ మగు పరమాత్మస్వరూపముగానే నిశ్చిత మగుచున్నది. ౨౭

తవ పరి యే చరం త్యఖిలసత్త్వనికేతతయా
త ఉత పదాక్రమం త్యవిగణయ్య శిరో నిరృతేః,
పరివయసే పశూ నివ గిరా విబుధా నపి తాం
స్త్వయి కృతసౌహృదాః ఖలు పునంతి న యే విముఖాః.　౨౮

---

సర్వభూతావాసకునిగా నెఱిగికొని ని న్నెవరు సేవింతురో వారు మృత్యువును లెక్కింపక అనాదరించి దానితలపై నడు గిడి తరింతురు. సర్వాత్మ యగు బ్రహ్మ నుపాసింపక విముఖులై యభక్తు లగువారలను స్వయముగా వారు విద్వాంసులే యై యున్నను, అట్టివారిని శాస్త్రాత్మక మైన సమ్యగుపదేశమున బోధించి, ముకుత్రాడు పోసి బాగుగా శిక్షించి, మదమున వశముగాని పోట్లగొడ్లనువలె బంధించి సన్మార్గమునకు దెత్తువు. ఎందువలన నన — నీయందు సౌహృదము అనగా ప్రేమరూప మగు భక్తిని గావించువారు తమ్మును ఇతరులను బవిత్రీకరింప నేర్తురు. తదితరు లగువారు మాత్ర మట్లు గావింప నేరరు. కావున నీయందు భక్తియు నత్యంతము ఆవశ్యకమే యగు చున్నది. భగవత్పరిచర్యచే చిత్తమాలిన్య ముడిగి భగవత్ప్రసా దమున నపరోక్షజ్ఞానము గలిగి, తద్ద్వారా మోక్షము హస్తా మలకమువలె అప్రయత్నముగానే సిద్ధింపగలదు. భగవత్పరిచర్యా విముఖు లగువారలకు అట్టి దెన్నటికిని గలుగనేరదు. ఘోర తపములను దపించినను, భృగుపాతముల నొనరించినను, తీర్థముల సంచరించినను, ఆగమములను బఠించినను, యాగముల గావించి నను, యోగముల నభ్యసించినను, శ్రీహరి నాశ్రయింపక మృత్యువును దరించుట దుర్ఘటము.　౨౮

త్వ మకరణః స్వరా డఖిలకారకశక్తిధర
స్తవ బలి ముద్వహంతి సమదః త్యజమా నిమిషాః,
వర్షభుజోఽఖిలక్షితిపతే రివ విశ్వసృజో
విదధతి యత్ర యే త్వధికృతా భవత శ్చకితాః ౨౮

స్థిరచరజాతయః స్యు రజయోత్థనిమిత్తయుజో
విహార ఉదీక్షయా యది పరస్య విముక్తతతః,

---

నీవు ఇంద్రియరహితుడవు. అఖిలప్రాణుల యింద్రియము లను వానిశక్తులను ధరించువాడవు, ప్రవర్తింపజేయువాడవు. స్వరాట్టువు. సర్వసంసేవ్యుడవు. కావున, ఇంద్రాదులును తత్పూ జ్యులగు బ్రహ్మాదులును, సస్త్రీకముగా కింకరులు ప్రభువునవలె నిన్ను సేవించుచున్నారు. మఱియు అవిద్యావృతులై వారు మనుష్యులచే నొసగబడిన హవ్యకవ్యాదిలక్షణ మగు బలిని భక్షించుచు, నీవలన భయపడినవారై స్వస్వాధికారములయందు నిలిచి తమతమకర్మములను దీర్చుచున్నారు. ఎట్లన— యావద్భూ మండలాధిపతియగువాని యాజ్ఞకు లోబడియుండి ఖండమండ లాధిపతులు స్వమండలములోని ప్రజలసేవలను గొనుచు నాయా భోగములను భోగించుచు మవిధులను దీర్చుచునుందురుగదా! అట్లే వారును జుమా! ౨౮

ఓనిత్యముక్తుడా! మాయకంటె బరుడవును అసంగుడవు నగు నీయీక్షణమువలన నీమాయ విహారమునకు గడంగినంతన స్థిరచరజాతులగు జీవులు, నీఈహచేతనే ఆవిర్భవించిన నిమిత్త ములు అనగా కర్మములతోడను, తద్వ్యక్తములగు లింగశరీర ములతోడను గూడినవై యుద్భవించుచున్నవి. అనగా త్వదీక్షణ వశమున క్షోభ నొందిన మాయవలన బొసగిన కర్మాదికము

నహి పరమస్య కశ్చి దపరో న పరశ్చ భవే
ద్వియత ఇవాపదస్య తవ శూన్యతులాం దధతః.      ౩౦

అపరిమితా ధ్రువా స్తనుభృతో యది సర్వగతా
స్తర్హి న శాస్యతేతి నియమో ధ్రువ! నేతరథా,

---

లతో జీవజాలములు పొడముచున్నవి. నీవు పరమకారుణికుడవు. ఆకాశమువలె సముడవు. కావున శూన్యముతోడి సామ్యమును బొందుచున్న నీకు స్వీయుడు కాని, స్వీయుడు కానివాడుకాని, యెవ్వడును లేడు. నీ కెట్టి సంగములును దోషములును లేవు. అగ్నినుండి విస్ఫులింగములు పుట్టి ప్రసరించునట్లు నీవలననే సర్వ ప్రాణులు సర్వలోకములు సర్వదేవతలు సర్వభూతములు బొడమి సంసరించుచున్నవి.      ౩౦

ఓ శాశ్వతుడా! జీవులు వస్తుతః అనంతులును నిత్యులును సర్వగతులును అగుదురేని, అపుడు జీవులు పరమేశ్వరునియందలు సములే యగుదురుగావున, ఆజీవులు ఒకజీవునిచేగాని, లేక పరమాత్మచేగాని, శాసింపబడుట యనునది పొసగనేరదు కావున, నీచే నియమింపబడుటయు ఘటిల్లనేరదు. కాని, యది యట్లు గాదు. ఎందువలన——నన యద్వికారమై యేది దేనివలన పుట్టునో, దానికి మూలకారణ మగుటచే నది నియంత యగును. వస్తుతః జీవులకు జన్మ లేదు. ఉపాధివలన అవి జన్మము నొందినట్లు భాసించుచున్నవి. సర్వకారణ మగు బ్రహ్మమే జీవకళతో నీసమస్తములోపల బ్రవేశించి యనుస్యూతమై నియమించుచున్నది. కావున, ఎల్లజీవులును కారణ మగు నీశ్వరుని నియామకమున బడిపోవుచున్నవి గదా! అని యీ విషయమును బాగుగా

అజని చ యన్మయం త దవిముచ్య నియంతృ భవే
త్సమ మనుజానతాం య దమతం మతిదుష్టతయా. 3౧

న ఘటత ఉద్భవః ప్రకృతిపూరుషయో రజయో
రుభయయుజా భవం త్యసుభృతో జలబుద్బుదవత్,
త్వయి త ఇమే తతో వివిధనామగుణైః పరమే
సరిత ఇవార్ణవే మధుని లిల్యు రశేషరసాః. 3౨

---

దెలియనివారే పూర్వోక్తవాదమును బలుకుచున్నారు. మాకు బాగుగా దెలియు నని తలచి పలుకువారు నిజముగా దెలియని వారే అని చెప్పవలెను. ఎందువలన_ నన వారికి దెలసినది దోష భూయిష్ఠమై యుండుటవలన నది తెలియనిదే యగుచున్నది. కావున నీవలన బొడమునెల్ల జీవులకును కారణ మగు నీవే నియంత వగుచున్నా వని యనుట నిశ్చయము. 3౧

అజము లగు ప్రకృతిపురుషులకు జన్మ ఘటిల్లదు. జల వాయువుల సంయోగమువలన నీటి బుడగలు పుట్టునట్లు ఆ ప్రకృతిపురుషుల రెంటి సంయోగమువలన ప్రాణులు పుట్టుచున్నవి. కేవలము జలమువలనగాని, కేవలము వాయువువలన గాని, జలబుద్బుదములు పుట్టక, రెంటిమేళనమువలన బొడముసు. అట్లే కేవలము ప్రకృతివలనగాని, కేవలము పురుషుని వలనగాని ప్రాణులు పుట్టక తదుభయసంయోగమువలన నవి పుట్టుచున్నవి. కావున బుద్బుదములకు వాయువు నిమిత్తము, జలము ఉపాదానము నయినట్లు, దేహధారులకు ప్రకృతి నిమిత్తము, పురుషుడు ఉపాదానము నగుచున్నారు. అట్లు ప్రకృతి పురుషసంయోగవశమున నుపాధి గొని పొడమిన జీవులు, వాస్త

నృషు తవ మాయయా భ్రమ మమీ ష్వవగత్య భృశం
త్వయి సుధియోఽభవే దధతి భావ మనుప్రభవమ్,
కథ మనువర్తతాం భవభయం తవ యద్భ్రుకుటిః
సృజతి ముహు స్త్రినేమి రభవచ్ఛరణేషు భయమ్. 33

---

వముగ దనుకు జన్మ లేనిదే యగుటవలన లయకాలమునందు వివిధకారణకార్యోపాధులతో గూడ కారణాత్మక మగు నీయందు లయము నొంది పోవుచున్నవి. అన్ని నదులు సముద్రమునందు వలెను, అన్ని రసములు అనగా మకరందములు తేనెలో వలెను, ఈజీవు లన్నియు ప్రళయమున దను నామరూపముల బోనాడి కొని సర్వాత్మనా నీయందే కలిసిపోవుచున్నవి. 32

ఇట్లు జీవులు పరమేశ్వరునివలన బుట్టుచుండుటయు తద్వాశమున కర్మముల నాచరించుచుండుటయు మరల కారణమునందు లయము నొందుచుండుటయు మరల బుట్టుచుండుటయు నిట్లు నీమాయచే సంసారచక్రమున బడి భ్రమించుచుండుటను బాగుగా దెలిసికొని వివేకవంతు లగువారు, జన్మజన్మమున తమభావమును భవనివర్తకుడ వైన నీయందే నిలిపికొనుచున్నారు. నిన్నే శరణమని నిన్ననువర్తించి నిన్నే సేవించువారల కెట్లు సంసారభయము కలుగగలదు? భవచ్ఛరణులు కానివారలయందు మాత్రమే, శీతోష్ణవర్షాత్మకము లగు త్రినేములతో నొప్పి సంవత్సరాత్మకమై నీభ్రూభంగరూప మైన కాలము సంసృతిభయమును గలిగించుచున్నది. 33

అజుడ వగు నో ప్రభూ! ఇంద్రియములను ప్రాణములను జయించినవారలకుగూడ నిగ్రహింప నలవి గాక అతిచంచల మైన

విజితహృషీకవాయుభి రదాంతమనస్తురగం
య ఇహ యతంతి యంతు మతిలోల ముపాయఖిదః,
వ్యసనశతాన్వితా స్సముపహాయ గురో శ్చరణం
వణిజ ఇవావిశం త్యకృతకర్ణధరా జలధౌ. ౩౪

స్వజన సుతాత్మదార ధన ధామ ధరాసురథై
స్త్వయి సతి కిం నృణాం శ్రయత ఆత్మని సర్వరసే?
ఇతి స దజానతాం మిథునతో రతయే చరతాం
సుఖయతి కోన్విహ స్వవిహతే స్వనిరస్తభగే? ౩౫

---

మన స్సనెడు గుఱ్ఱమును, గురుచరణోపాసనమును వినా మఱి యితర ఉపాయములచే నియమింప బ్రయత్నించుచు మిక్కిలి కష్టపడువారు అందులకు నేరక, నావికునిసాయము లేని వర్తకులు సముద్రమునవలె, అపారమైన యీ సంసారసాగరమున బడి మునుగుచు తేలుచు, నానాదుఃఖముల ననుభవింపవలసినవారగుదురు. ౩౪

నిఖిలాత్మకుడవును నిరతిశయానందస్వరూపుడవును నగు ని న్నాశ్రయించునరులకు స్వజనములతోగాని, సుతులతోగాని, దేహముతోగాని, భార్యతోగాని, ధనముతోగాని, గేహముతో గాని, భూమితోగాని, ప్రాణములతోగాని, తత్సంబద్ధసుఖము లతోగాని, తదాసక్తులతోగాని, ఏమి ప్రయోజనము? అని యిట్లు పరమార్థసుఖము నెఱుగనేరక, మిథునధర్మములతో మాయాసుఖము నాశించి వర్తించు పురుషులను, స్వయముగానే నశ్వరమును, స్వయముగానే గతసారమును అగు నీ సంసారము నందు ఏయర్థము సుఖపెట్టగలదు? ౩౫

భువి పురుపుణ్యతీర్థసదనా న్యృషయో విమదా
స్త ఉత భవత్పదాంబుజహృదోఘభిదంఘ్రిజలాః,
దధతి సకృ న్మన స్త్వయి య ఆత్మని సత్యసుఖే
న పున రుపాసతే పురుషసారహరావసథాన్. ౩౬

సత ఇద ముత్థితం స దితి చే న్నను తర్క-హతం
వ్యభిచరతి క్వచ క్వచ మృషా న తధోభయయుక్,

---

అట్లు గురూపసదనమున తత్త్వము నెఱిగికొని నిరహం కారులైన ఋషులు, నీపదాంబుజమును తమ హృదయమున నిడుకొని యున్నవారగుటచే స్వయముగా తాము తమపాద జలములతో అశేషపాపములను దొలగించివేయ గలిగినవారే అయ్యును, భూమిలో గల యెల్ల పుణ్యతీర్థములను పుణ్యక్షేత్ర ములను సేవింతురు. లేదా, భగవద్భజనలక్షణమైన మహాపుణ్య మున నిండి తీర్థీభూతు లగు మహాత్ముల యాశ్రమములను సేవింతురు. అంతియగాని, వివేకము స్థైర్యము ధైర్యము క్షమ శాంతి మున్నగు పురుషసారమును హరించివేయు గృహముల నాశ్రయింపరు. నిత్యసుఖస్వరూపుడ వగు నీయందు ఒక్క మాఱైనను మనస్సును గాఢముగా నిలుపువారు సయితము కుత్సితము లగు గృహాదులయం దాసక్తులు కారన, నింక నట్టి వారివిషయము నేమని యనవలెను ? ౩౬

కనకమువలన బుట్టిన కుండలాదికము కనకాత్మకమే అయి నట్లు, దేనివలన ఏది పుట్టునో అది తదాత్మకమే యగును గావున, సత్తువలన బుట్టిన యీ విశ్వము సత్తే యగును, అని యన్నచో, నది యుక్తికి నరిపడుటలేదు. తద్వ్యతిరిక్తముగా గోచరించుచున్నది. ఎందువలన నన — వృక్షమునుండి ఆకు

వ్యవహృతయే వికల్ప ఇషితో౽ంధపరంపరయా
భ్రమయతి భారతీ త ఉరువృత్తిభి రుక్థజడాన్. ౩౭

కాలుచున్నది, అని యనినప్పుడు అపాదాన మగు వృక్షము, కార్య మగు ఆకు, భిన్నము లయినట్లే, అపాదాన మగు సత్తు, కార్య మగు ప్రపంచము, భిన్నము లగుచున్నవి. కావున, ఆ రెంటికిని భేదప్రతీతి స్వతః సిద్ధ మగుచున్నది. అంతియగాక, కొన్ని కొన్ని తావుల కార్యము కారణమువంటిదే యను నియమము, సమన్వయింపక వ్యభిచరించుచున్నది. తండ్రివలన బుట్టినవాడే యైనను కుమారునకును తండ్రికిని భేదమే సిద్ధ మగుచున్నదిగాని, అభేదము సిద్ధ మగుటలేదుగదా? అట్లే ముద్గరఘటప్రధ్వంసాదికములయందును పూర్వోక్తనియమము వ్యభిచరించుచున్నది, అంతియగాక, కొన్ని తావుల నది మృష అనగా మిథ్యయు నగుచున్నది. ఎట్లన — గుణము అనగా త్రాడువలన గలిగిన సర్పము మిథ్యయే యగుచున్నది గాని, త్రాడు అగుట లేదు. సర్పమునకు కేవలగుణమే ఉపాదానము కాదు; అవిద్యాయుక్త మగు గుణ ముపాదాన మగుచున్నది; అట్లే యిందును నని యన్నను, ఇది అవిద్యాగుణయుక్తము సయితము అగుటలేదు. సర్పమునకు అవిద్యాయుక్తగుణము ఉపాదాన మయినట్లు, ప్రపంచమునకు అవిద్యాయుక్తమగు సత్తు ఉపాదాన మగునెడల, అట్టిదానికి వస్తుత్వమే ఘటిల్లనేరదు. పామువలెనే అవశ్యము మిథ్యయే యగును. కావున, ప్రపంచము అవశ్యము సత్తువంటిది గాక, మిథ్యయే యగుచున్నది. అర్థక్రియాకారి యగుటవలన ప్రపంచము సత్తే యగు నని యన్నను నదియు జెల్లదు. ఎందువలన నన — శుక్తియందు జూపట్టిన రజతమువలె ఈప్రపంచము

న యదిద మగ్ర ఆస న భవిష్య దతో నిధనా
దనుమిత మంతరా త్వయి విభాతి మృషైకరసే,

---

అర్థక్రియాకారియు గానేరదు. అట్లయిన, వ్యవహారమున నిది యంతయు జూపట్టుచున్నదిగదా? అట్లవుటజేసి యిది సత్తే యగు ననియు ననరాదు. ఎందువలన నన,—— ఇది యంతయు భ్రమ మాత్రమే. అంధపరంపరగా వ్యవహారమున కీ వికల్పము అనగా భ్రమము వచ్చుచున్నది. అది సమ్మతమే. కూటకార్షాపణాదిక ముతో గొన్నియెడల వ్యవహారము గనిపించుచున్నదిగదా! అట్లయిన, నొకచో నున్నదానిని మఱొకచో నారోపించి భ్రమ నొందవచ్చును. అత్యంతము లేనప్పుడు ఇంక నెట్లు ప్రపంచ భ్రమము కలుగగలదు అనియు నా శంకింప రాదు. ఎందువలన నన—— లేని యాకాశమునందు బాలురు తలమలినత్వాదికము నారోపించుచున్నారుగదా! అట్టిదియే ప్రపంచభ్రమసైతము వని యెఱుగవలెను. అట్లు నిశ్చితమే అయినను, పరమైశ్వర్యసమే తుడ వగు నో భగవానుడా! నీ వేదవాక్కు గౌణలక్షణాదివృత్తు లతో కర్మశ్రద్ధాభరాక్రాంతమందమతు లగువారిని ఊరక మోహమున ముంచి వేయుచున్నది. పాపము! వారు "శ్రు. అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్య......" ఇత్యాది శ్రుతి వాక్యములు లక్షణయా కర్మఫలమునకు ప్రాశస్త్యమాత్రమునే బోధించుచుండ, పొరపడి, కర్మఫలమునకు అవి నిత్యత్వమును బోధించుచున్న వని భ్రమించి తలంచుచున్నారు. ఆశ్చర్యము! ౩౭

ఇట్లు ప్రపంచము సత్తగు నని యనుటకు ప్రమాణము లభింపకపోవుటయేగాక, అది అసత్తగు నని యనుటకు 'శ్రు. యతో వా ఇమాని భూతాని జాయంతే......' 'శ్రు.

అత ఉపమిమాయతే ద్రవిణజాతివికల్పపథై
ర్వితథమనోవిలాస మృత మి త్యవయం త్యబుధాః. ౩౮

---

స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్. ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్......' 'శ్రు. నాస దాసీ న్నో స దాసీ త్తదానీమ్...' ఇత్యాది శ్రుతిప్రమాణము లనేకములు లభించుచున్నవి. ఈ విశ్వము సృష్టికి బూర్వము లేదు. ప్రలయానంతరము సయితము కలుగబోదు. కావున సృష్టిప్రళయములకు మధ్యకాలమున మాత్రము కేవలుడవగునీయందు మిథ్యారూపముననేయిది భాసించు చున్నది, అని నిశ్చయింపబడుచున్నది. అందువలన, ఇది శ్రుతిచేత మృత్తు, బంగారము, ప్రత్తి, ఇనుము, మున్నగు ద్రవ్యమాత్ర ముల వికల్పము లగు ఘటకుండలాదుల ప్రకారములతో సమా నముగా నిరూపింపబడుచున్నది. అనగా కార్యము లగు ఘట కుండలాదులు మొదటను తరువాతను లేవు. ఆద్యంతములయందు లేనివి ఎన్నడును లేనివే యగుట తథ్యము. కాని అవి మధ్యకా లమున మాత్రము, మనచే గల్పింపబడిన నామరూపములతో అట్లు భాసించుచున్నవి. అంతియ. కాని, త్రికాలములయందును కారణము లగు మృదాదికములు మాత్రము సత్యములై యున్నవి. అట్లే కారణ మగు బ్రహ్మమాత్రమే సత్యము. కార్య మగు ప్రపంచము మాత్రము మిథ్యయే యగుచున్నది. ఇట్లే శ్రుతివాక్యములును జెప్పుచున్నవి. కావున నీ ప్రపంచము సత్తు అని యనుట కెందును ప్రమాణము కానవచ్చుటలేదు. అస త్తని యనుట కెన్నేని ప్రమాణములు దొరకుచున్నవి. కావున నిది యంతయు వితథమనోవిలాసమే యని యనవలెను. ఇట్టి దీనిని సత్య మని తలంచువారు అజ్ఞులే యని యనవలెను. ౩౮

స యదజయా త్వజా మనుశయీత గుణాంశ్చ జుషన్
భజతి సరూపతాం తదను మృత్యు మపేతభగః,
త్వ ముత జహాసి తా మహి రివ త్వచ మాత్తభగో
మహసి మహీయసేఽష్టగుణితేఽపరిమేయభగః. ౩౮

---

అట్లు ప్రపంచమే పూర్తిగా లేనిది యయిన, అసత్తగు దానితో నిక చైతన్యసంబంధగంధముకూడ లేకుండపోవలయును గదా? అట్టియెడ సంసారములోబడి చిక్కుపడుట కీ జీవు డేమి పాపము జేసికొనినాడు? నిత్యముక్తుడై యసంగుడై కేవలుడై యుండుటకు ఈశ్వరు డేమి సుకృత మొనరించికొనినాడు? అప్పుడు కర్మకాండమున కేది విషయము? జీవేశ్వరవిశేష మేమి? యన నిట్లు సమాధానముగా నెఱిగికొనవలెను అని శ్రుతులు పలుకుచున్నవి— జీవుడు మాయను అనగా అవిద్యను ఆశ్రయించుటచేత, దేహేంద్రియాదులను సేవించుచు, అవే తానుగా నధ్యాసను పొంది, తదనంతరము, సరూపత్వమును పొందుచు అనగా దేహాభిమాని యగుచు తద్ద్వారా, ఆనందాది గుణములు మఱుగుపడిపోయి, జన్మమరణాదిరూప మగు సంసారమున బడిపోవుచున్నాడు. కర్మకాండ తద్విషయమే. నీవు మాత్రము, పాము కుబుసమునువలె, ఆ మాయను విడిచివై చి సంబంధరహితుడవై వెలుగుచున్నావు. అనగా స్వగతమే యైనను కుబుసమును పాము తన కది గుణముగా తలపోయనట్లు, నీవు నీయందే యున్నను మాయను, నిరతిశయాష్టాదివంవిత్కామధేను బృందపతి నగు నా కీ మాయతో నేమి పని యని దాని నుపే క్షించివేయుచున్నావు. అందువలననే నిత్యప్రాప్తైశ్వర్యుడవై యణిమ,

యది న సముద్ధరంతి యతయో హృది కామజటా
దురధిగమోఽసతాం హృది గతోఽస్మృతకంఠమణిః,
అసుతృపయోగినా ముభయతోఽప్యసుఖం భగవ
న్ననపగతాంతకా దనధిరూఢపదా ద్భవతః. ౪౦

త్వదవగమీ న వేత్తి భవదుత్థశుభాశుభయో
ర్గుణవిగుణాన్వయాం స్తర్హి న దేహభృతాం చ గిరః,
అనుయుగ మన్వహం స గుణగీతపరంపరయా
శ్రవణభృతో యత స్త్వ మపవర్గగతి ర్మనుజైః. ౪౧

మాద్యష్టవిభూతిమహిత మైన మహాధామమున వెలుగొందుచు
న్నాడవు. ౩౯

ఓ భగవానుడా! యతు లగు మునులు మనఃప్రణిధాన
పరాయణులై సమాధి నవలంబించుచునే యున్నను, హృదయ
మున గల కామజటలను అనగా పెనవేసికొని యున్న కామ
వాసనలను బెఱికివేసికొనరేని, వారు వ్యర్థులే యగుదురు. అట్టి
వారలకు హృదయస్థితుడవే యై యున్నను, నీవు, కంఠమునందే
యుండియు మఱపున దగిలిన కంఠమణివలె, ఎఱుక కందవు. ఓ
పరమేశ్వరుడా! ప్రాణేంద్రియతర్పణపరాయణు లగు నట్టివారికి,
ఇందును అందును దుఃఖమే కలుగుట తథ్యము. ఈలోకమునందు
మఱలిపోని మృత్యువువలనను, పరలోకమునందు, నీపదమును
పొందనేరనందువలనను, దుఃఖమే కలుగును. ౪౦

షడ్గుణైశ్వర్యయుక్తుడ వగు నో పరమపురుషా! భవ
ద్విషయిక మైన జ్ఞానము కలవాడు, కర్మఫలదాతవును ఈశ్వరు
డవు నగు నీవలన నావిర్భవించిన శుభాశుభకర్మములకు ఫల

ద్వ్యపతయ ఏవ తేన యయు రంత మనంతతయ్యా
త్వ మపి యదంతరాండనిచయా నను సావరణాః,
ఖ ఇవ రజాంసి వాంతి వయసా సహ యచ్ఛ్రుతయ
స్త్వయి హి ఫలం త్వతన్నిరసనేన భవన్నిధనాః.   ౪౨

భూతములైన సుఖదుఃఖసంబంధములను, అపుడు దేహాభిమాను
లకు ప్రవృత్తిని గలిగించు విధినిషేధలక్షణములైన వాక్యము
లను మనసున దగులనీయడు. ఎందువలన నన — యుగయుగ
మున ననుస్యూతముగా వచ్చు సత్సంప్రదాయము ననుసరించి
అనుదినము నిన్ను హృదయమున నిలిపికొని, నీమహిమములను
వినుచు నుండు మనుజులకు నీవు అపవర్గప్రదుడవుగా నున్నావు.
కావున సంపూర్ణముగ దత్త్వము నెఱిగికొనిన వారలకు కర్మాధి
కారశంకయు లేదు. అనవరతము అనన్యగతితో త్వత్కథాశ్రవ
ణాదినిష్ఠు లగువారలకు విధినిషేధములును లేవు. అట్లుగాక కపట
యోగులై యింద్రియలాలసులై యుండువారలకు మాత్రము
ఉభయతః దుఃఖమే కలుగక మానదు.   ౪౧

ఓ పరమేశ్వరుడా ! స్వర్గాదిలోకపతు లగు బ్రహ్మాదులును
నీమహిమమునకు అంతు దెలియ నేరకున్నారు. ఎందువలన
నన— అంతముగలిగిన వస్తు వేయదియు నీవు గావు. నీవు
నిరవధికుడవును, నిరంతుడవును. బ్రహ్మాదులే గాదు; అనంతుడ
వగుట వలన నీవును నీయంతు నెఱుగకున్నావు. అహో ! ఆశ్చ
ర్యము ! నీయంతరమున ఉత్తరోత్తర దశగుణ సప్తావరణ
యుక్తము లగు బ్రహ్మాండసమూహములు ఎన్నియో లెక్కకు
మిగిలి, ఆకాశమునందు రజఃకణములువలె, కాలచక్రమున
పర్యాయమున గాక, ఒకేమాఱు పరిభ్రమించుచు నున్నవి. నీ విట్టి

శ్రీ భగవానువాచ

ఇత్యేతద్ బ్రహ్మణః పుత్రా ఆశ్రుత్యాత్మానుశాసనమ్,
సనందన మథానర్చు స్సిద్ధా జ్ఞాత్వాత్మనో గతిమ్. ౪౩

ఇత్యశేషసమామ్నాయపురాణోపనిషద్రసః,
సముద్ధృతః పూర్వజై స్తై ర్వ్యోమయానై ర్మహాత్మభిః. ౪౪

త్వం చైతద్ బ్రహ్మదాయాద! శ్రద్ధయాత్మానుశాసనమ్,
ధారయం శ్చర గాం కామం కామానాం నిధనం నృణామ్. ౪౫

---

యపార మహామహిముడవు గావునసే, శ్రుతులు, విదితావిది
తుడ వగు నిన్ను సాక్షాత్తు వచింపనేరక, అతన్నిరసనమున
దాత్పర్యవృత్తితో నీయందు బర్యవసించుచున్నవి. అని శ్రుతులు
శయనించి యున్న పరమపురుషుని బోధించెను. ౪౨

శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను

ఇట్లు శ్రుతిగీత రూపమున సనందనుడు చెప్పిన ఆత్మాను
శాసనరూప మగు సమాధానమును విని, బ్రహ్మమానసపుత్రు
లగు సనకాదులు, మరీచి మొదలుగాగల సిద్ధులును, పరమాత్మ
యాథాత్మ్యమును దెలిసికొని, సనందుని బూజించిరి. ౪౩

ఇట్లు పూర్వులకంటె పూర్వతరులు, ఆకాశసంచారులు,
మహాత్ములు నగు సనందనాది మహర్షులచేత, అన్ని వేదము
లయు, పురాణములయు, ఉపనిషత్తులయు, రసము ఈప్రకార
మున ఉద్ధరింపబడెను. ౪౪

కావున బ్రహ్మతనూభవుడ వగు నో నారదా! మను
జుల కామవాసనల నుపశమింపజేయు నీ యాత్మవిద్యను దృఢ
ముగా ధరించి, యథేచ్ఛముగా లోకములలో సంచరింపుము. ౪౫

## శ్రీ శుక ఉవాచ

ఏవం స్వగురుణాదిష్టం గృహీత్వా శ్రద్ధయాత్మవాన్,
పూర్ణః శ్రుతధరో రాజ న్నాహ వీరవ్రతో గురుమ్. ౪౬

## శ్రీ నారద ఉవాచ

నమ స్తస్మై భగవతే కృష్ణాయామలకీర్తయే,
యో ధత్తే సర్వభూతానా మభయాయ సతీః కలాః. ౪౭

---

## శ్రీశుకుడు చెప్పెను

పరీక్షిద్రాజా! ఇట్లు బదర్యాశ్రమవాసియు స్వగురువు నగు నారాయణమహర్షిచే నుపదేశింపబడిన ఆ యాత్మవిద్యను శ్రద్ధతో గ్రహించి, దానియందు నిరూఢముగా మనసు నిలిపి, సంశయము లన్నియు దొలఁగుటచే పూర్ణుడై, యథాశ్రుతముగ శ్రుతులను ధరించువాడును, జితేంద్రియవ్రతము నవలంబించు నైష్ఠికుడు నగు నారదుడు గురు వగు నారాయణుని గుఱించి యి ట్లనెను. ౪౬

## శ్రీనారదు డనెను

సర్వలోకసుఖంకరుడును, నిర్మల మగు కీర్తి కలవాడును, సర్వభూతములకు సంసారభయము తొలగి మోక్షరూప మగు సుఖము కలుగుటకు, నిర్మలము లైన మూర్తులను ధరించి, విద్యోపదేశము లొనరించువాడును, పరబ్రహ్మస్వరూపుడు నగు ఆ నారాయణ భగవానునకు నమస్కారము. ౪౭

శ్రీ శుక ఉవాచ

ఇ త్యాద్య మృషి మామంత్ర్య తచ్ఛిష్యాం శ్చామలాత్మనః,
తతోఽగా ద్రాశ్రమం సాక్షా త్పితు ర్ద్వైపాయనస్య మే. ౪౮

సభాజితో భగవతా కృతాసనపరిగ్రహః,
తస్మై త ద్వర్ణయామాస నారాయణముఖా చ్ఛ్రుతమ్. ౪౯

ఇ త్యేత ద్వర్ణితం రాజన్ ! య న్నః ప్రశ్నః కృత స్త్వయా,
యథా బ్రహ్మ ణ్యనిర్దేశ్యే నిర్గుణేఽపి మన శ్చరేత్. ౫౦

---

శ్రీ శుకుడు చెప్పెను

ఇట్లాదిఋషి యగు నారాయణుని, అమలాత్ము లగు తచ్ఛిష్యులను నమస్కరించి, వారలయొద్ద సెలవు గొని, అనంత రము నారదుఁడు స్వయముగా మాతండ్రి యగు ద్వైపాయనుని యాశ్రమమున కేతెంచెను. ౪౮

అట్లు వచ్చినంతనే, మాతండ్రి యగు ద్వైపాయనునిచే గౌరవింపబడి, యాయనచే నొసఁగబడిన యాసనమున గూర్చుండి నారదుఁడు, నారాయణమహర్షి ముఖమున దాను వినిన దంతయు, మాతండ్రికి వినిపించెను. ౪౯

పరీక్షిన్న రేంద్రా ! ఆ నారదు డపుడు చెప్పినవిధముననే, నే నిపుడు, ఎట్లును నిర్దేశించుటకు వీలుపడనిదియు, నిర్గుణము, నగు పరబ్రహ్మమునందు గుణవృత్తు లైన శ్రుతు లెట్లు పర్యవ సించునో, సర్వసంశయములు తొలగి నిశ్చయాత్మక మైన మన స్సు పరబ్రహ్మమునం దెట్లు చరించునో, నీయడిగిన ప్రశ్న మునకు సమాధానముగా వర్ణించితిని. ౫౦

యోఽస్యోత్ప్రేక్షక ఆదిమధ్యనిధనే యోఽవ్యక్తజీవేశ్వరో
య స్సృష్ట్వేద మనుప్రవిశ్య ఋషిణా చక్రే పురః శాస్తి తాః,
యం సంపద్య జహా త్యజా మనుశయీ సుప్తః కులాయం యథా
తం కైవల్యనిరస్తయోని మభయం ధ్యాయే దజస్రం హరిమ్. ౫౧

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే
శ్రుతిగీతం నామ సప్తాశీతితమోఽధ్యాయః.

---

ఈప్రపంచపు సృష్టిస్థితిలయములకు హేతుభూతుడును, అవ్యక్తజీవేశ్వరుడును, ఈప్రపంచమును సృజించి వెనువెంటనే జీవునితోసహా లోపల అనుప్రవేశ మొనరించి పురములను అనగా శరీరములను నిర్మించువాడును, వానిని శాసించువాడును, జీవు డెవని నాశ్రయించి, నిదురించినవాడు నిజశరీరజ్ఞానమునువలె, కార్యకారణరూప మగు నవిద్యను బాయ గలుగుచున్నాడో, అట్టి మోక్షప్రదాతయు, భయనివర్తకుడును, భయమును గూర్పనివాడును, అప్రచ్యుతస్వరూపావస్థానమున మూలకారణ మగు మాయను విమర్చువాడును, నగు హరిని ధ్యానింపవలెను.

ఇది శ్రీమద్భాగవతము దశమస్కంధమున
శ్రుతిగీత మను యెనుబదియేడవ యధ్యాయము.

# ౮ శ్రీరామగీత

శ్రీమ దుమా మహేశ్వర సంవాద రూప మైన శ్రీమ దధ్యాత్మ రామాయణమున ఉత్తరకాండమునందు, శ్రీరామగీత గీతమై యున్నది. దీనిని పరమేశ్వరుడు పార్వతికి ఉపదేశించినాడు. శ్రీరామగీత సమస్త శ్రుతిసార సంగ్రహము. అతిరహస్య మగు జ్ఞానవిద్య. దీనిని పఠించి తెలిసికొనిన పిదప, ఇంక తెలిసికొనవలసిన దేదియు నుండదు. సవిమర్శమైన మనస్సుతో దీనిని విచారించి, మననము చేయు బుద్ధిమంతుడు పడయరాని పరమార్థము లేదు. అతడు సమస్త కర్మబంధములనుండి విముక్తుడై, తారకరూప మగు రామ తత్త్వమే తానుగా నగును.

ప్రపంచతత్త్వమును, తన్ముక్తిమును, దుఃఖనివారణోపాయమును, పరి పూర్ణానందమయ మగు బ్రహ్మమును, బోధింపు మని యడుగగా, లక్ష్మణునకు శ్రీరామచంద్రభగవానుడు, ఆత్మతత్త్వమును సులభముగా బోధించెను. అది విని లక్ష్మణుడు ఛిన్నసంశయు డయ్యెను.

కావున, నిత్యపారాయణ విధానమున శ్రీరామగీతను పఠించువారలదే మహాభాగ్యము. శ్రీరామగీతా స్వరూపము ఇది.

## శ్రీ మహాదేవ ఉవాచ

తతో జగన్మంగలమంగలాత్మనా
విధాయ రామాయణకీర్తి ముత్తమామ్,
చచార పూర్వాచరితం రఘూత్తమో,
రాజర్షివర్యై రభిసేవితం యథా. ౧

సౌమిత్రిణా పృష్ట ఉదారబుద్ధినా
రామః కథాః ప్రాహ పురాతనీః శుభాః,
రాజ్ఞః ప్రమత్తస్య నృగస్య శాపతో
ద్విజస్య తిర్యక్త్వ మథాహ రాఘవః. ౨

కదాచి దేకాంత ఉపస్థితం ప్రభుం
రామం రమాలాలితపాదపంకజమ్,

---

## శ్రీ మహాదేవుడు చెప్పెను

రఘుకులశ్రేష్ఠుడగు శ్రీరామచంద్రుడు, జగన్మంగళ మంగళమైన దేహముతో రావణవధాదికములను గావించి, అనంతరము ఇక్ష్వాకుప్రభృతి పూర్వరాజర్షివర్యు లాచరించినట్లు ధర్మము నాచరించెను. ౧

తన తమ్ముడగు లక్ష్మణుడడుగగా, శ్రీరామచంద్రుడు, పవిత్రములైన పూర్వకథలను పెక్కింటిని చెప్పెను. ప్రమత్తుడైన నృగమహారాజునకు శాపప్రాప్తి మున్నగు కథలను దెలిపెను.

ఒకనాడు ఏకాంతమున గూర్చుండి యున్న శ్రీరామ చంద్రుని దరిసి, లక్ష్మణుడు, శుద్ధమైన భావములతో, భక్తి వినమ్రుడై, ఇట్లు పలికెను. ౩

సౌమిత్రి రాసాదితశుద్ధభావనః
ప్రణమ్య భక్త్యా వినయాన్వితోఽబ్రవీత్. ౩

సౌమిత్రి రువాచ

త్వం శుద్ధబోధోఽసి హి సర్వదేహినా
మాత్మా స్యధీశోఽసి నిరాకృతిః స్వయమ్,
ప్రతీయసే జ్ఞానదృశాం మహామతే!
పాదాబ్జభృంగాహితసంగసంగినామ్. ౪

అహం ప్రపన్నోఽస్మి పదాంబుజం ప్రభో!
భవాపవర్గం తవ యోగిభావితమ్,
యథాంజసాఽజ్ఞాన మపారవారిధిం
సుఖం తరిష్యామి తథానుశాధి మామ్. ౫

శ్రుత్వాథ సౌమిత్రివచోఽఖిలం తదా
ప్రాహ ప్రపన్నార్తిహరః ప్రసన్నధీః,

---

లక్ష్మణు డనెను

నీవు శుద్ధబోధస్వరూపుడవు. సర్వదేహులకు ఆత్మవు. అధీశుడవు. నిరాకృతివి. నీపాదాబ్జములయందు తుమ్మెదలువలె తగులువడి యుండు మహాత్ములసేవతో, జ్ఞానదృష్టి గలిగినవార లకు గోచరించుచుందువు ౪

యోగభావితమై, భవమును దాటించు నీపదాంబుజ మును నేను శరణు పొందినాను. అపారమైన అజ్ఞానసముద్రమును సుఖముగా తరింప గలుగు నుపాయమును నా కుపదేశింపుము. ౫

విజ్ఞాన మజ్ఞానతమఃప్రశాంతయే,
శ్రుతిప్రపన్నం క్షితిపాలభూషణః. ౬

శ్రీరామ ఉవాచ

ఆదౌ స్వవర్ణాశ్రమవర్ణితాః క్రియాః
కృత్వా సమాసాదితశుద్ధమానసః,
సమాప్య తత్పూర్వ ముపాత్తసాధనః
సమాశ్రయే త్సద్గురు మాత్మలబ్ధయే. ౭
క్రియా శరీరోద్భవహేతు రాదృతా
ప్రియాప్రియా తౌ భవతః సురాగిణః,
ధర్మేతరా తత్ర పునః శరీరకం
పునః క్రియా చక్రవ దీర్యతే భవః. ౮

---

లక్ష్మణునివాక్యములు విని, ప్రపన్నార్తిహారుడైన శ్రీరాముడు, అజ్ఞానాంధకారము అడగిపోవుటకు, విజ్ఞానము నుపదేశింప మొదలిడెను. ౬

శ్రీరాముడు చెప్పెను

లక్ష్మణా! మొట్టమొదట తన వర్ణమునకు ఆశ్రమమునకు జెప్పబడిన కర్మముల నాచరించి, శుద్ధమైన అంతఃకరణము కలవాడై, పురుషుడు, శమదమాది సాధనసంపత్తి సంపాదించుకొని, ఆత్మజ్ఞానమును బడయుటకు సద్గురువును శరణనవలెను. ౭

కర్మ, శరీరోత్పత్తికి కారణము. కర్మాసక్తుడగువానికి ఇష్టము అనిష్టము కలుగుచుండును. వానిద్వారా ధర్మము అధర్మము ప్రాప్తించును. వానిద్వారా మరల శరీరము కలుగును. దానితో మరల కర్మలను జేయుట ఆరంభమగును. ఇట్లు సంసారము చక్రమువలె సాగుచు నుండును. ౮

అజ్ఞాన మేవాస్య హి మూలకారణం
తద్ధాన మేవాత్ర విధౌ విధీయతే,
విద్యైవ తన్నాశవిధౌ పటీయసీ
న కర్మ తజ్జం సవిరోధ మీరితమ్. ౯

నాజ్ఞానహాని ర్నచ రాగసంక్షయో
భవే త్తతః కర్మ సదోష ముద్భవేత్,
తతః పునః సంసృతి ర ప్యవారితా
తస్మా ద్బుధో జ్ఞానవిచారవా న్భవేత్. ౧౦

నను క్రియా వేదముఖేన చోదితా
తథైవ విద్యా పురుషార్థసాధనమ్,

---

సంసారమునకు మూలకారణము అజ్ఞానమే. కావున, అజ్ఞాననాశమే సంసారనాశమునకు సాధనముగా శాస్త్రములు చెప్పుచున్నవి. అజ్ఞానమును జ్ఞాన మొక్కటియే నశింపజేయ గలుగును. కాని, కర్మ కాదు. అజ్ఞానమువలన పుట్టుకర్మ అజ్ఞానమునకు విరుద్ధము కాదు. ౯

కర్మద్వారా, అజ్ఞాననాశముగాని, రాగక్షయముగాని, కలుగనేరదు. పైగా, దానివలన దోషభూయిష్ఠ మైన కర్మ కలుగును. దానివలన, నివారింపరానిదై సంసారము చుట్టుకొనును. కావున, బుద్ధిమంతు డగువాడు, జ్ఞానవిచారపరాయణుడు కావలెను. ౧౦

జ్ఞానము పురుషార్థసాధన మైనట్లే, కర్మకూడ వేదవిహితమే. ప్రాణులు దానిని తప్పక ఆచరింపవలెను. అట్లాచరింపబడిన,

కర్తవ్యతా ప్రాణభృతః ప్రచోదితా
విద్యాసహాయత్వ ముపైతి సా పునః. ౧౧

కర్మాకృతౌ దోష మపి శ్రుతి ర్జగౌ
తస్మా త్సదా కార్య మిదం ముముక్షుణా,
నను స్వతంత్రా ధ్రువకార్యకారిణీ
విద్యా న కించి న్మనసా ప్యపేక్షతే. ౧౨

న సత్యకార్యోపి హి యద్వ దధ్వరః
ప్రకాంక్షతేఽన్యా నపి కారకాదికాన్,
తథైవ విద్యా విధితః ప్రకాశితై
ర్విశిష్యతే కర్మభి రేవ ముక్తయే. ౧౩

---

నది జ్ఞానమునకు సాధన మగును. అని వేదము తెలుపుచున్నది. ౧౧

అంతియగాక, కర్మ నాచరింపకున్నచో, దోషమునుగూడ శ్రుతి చెప్పుచున్నది. కావున, ముముక్షువు వగువాడు, ఎల్లప్పుడును కర్మము నాచరింపవలెను. మఱియు, జ్ఞానము స్వతంత్రము. అది స్వయముగా ఫలము నీయగలదు. మనస్సు మున్నగువాని సహాయము జ్ఞానమున కక్కఱలేదు. ౧౨

యజ్ఞము వేదవిహితమే. అయినను, అన్యకారకాదికముల నపేక్షించుచున్నదిగదా! అట్లే, విధివిహితములైన కర్మములద్వారానే జ్ఞానముకూడ ముక్తిసాధన మగును. ౧౩

అని, వితర్కవాదు లెవరైన నందురుగాక. అది అసంగతము. వారివాదములో ప్రత్యక్షముగా విరోధము కనబడు

కేచి ద్వదంతీతి వితర్కవాదిన
స్తదప్యసద్దృష్టవిరోధకారణాత్,
దేహాభిమానా దభివర్ధతే క్రియా
విద్యా గతాహంకృతితః ప్రసిధ్యతి. ౧౪

విశుద్ధ విజ్ఞాన విరోచనాంచితా
విద్యాత్మవృత్తి శ్చరమేతి భణ్యతే,
ఉదేతి కర్మాఖిలకారకాదిభి
ర్నిహంతి విద్యాఽఖిలకారకాదికమ్. ౧౫

తస్మా త్త్యజే త్కార్య మశేషతః సుధీ
ర్విద్యావిరోధా న్న సముచ్చయో భవేత్,
ఆత్మానుసంధానపరాయణః సదా
నివృత్తసర్వేంద్రియవృత్తిగోచరః. ౧౬

---

చున్నది. ఎందువలన ననగా— దేహాభిమానమువలన కర్మ పుట్టును. అహంకారము నశించుటద్వారా జ్ఞానము సిద్ధించును. ౧౪

విశుద్ధ విజ్ఞాన ప్రకాశముతో ఉద్భాసింపజేయబడు చరమాత్మవృత్తి, జ్ఞాన మని చెప్పబడును. అఖిలకారకాదులద్వారా కర్మ ముదయించును. జ్ఞానము అఖిలకారకాదికములను నశింపజేయును. ౧౫

కావున, బుద్ధిమంతు డగునాతడు, జ్ఞానమునకు విరోధి యగుటవలన, సమస్తకర్మమును వదలివేసి, ఇంద్రియవృత్తుల నన్నిటినుండి నివృత్తుడై, ఆత్మానుసంధాన పరాయణుడు, కావలెను. ౧౬

యావ చ్ఛరీరాదిషు మాయయాత్మధీ
స్తావ ద్విధేయో విధివాదకర్మణామ్,
నేతీతివాక్యై రఖిలం నిషిధ్య తద్
జ్ఞాత్వా పరాత్మాన మథ త్యజేత్ క్రియాః. ౧౭

యదా పరాత్మాత్మవిభేదభేదకం
విజ్ఞాన మాత్మ న్యవభాతి భాస్వరమ్,
తదైవ మాయా ప్రవిలీయతేంఽజసా
సకారకా కారణ మాత్మసంసృతేః. ౧౮

శ్రుతిప్రమాణాభివినాశితా చ సా
కథం భవిష్య త్యపి కార్యకారిణీ?
విజ్ఞానమాత్రా దమలాద్వితీయత
స్తస్మా దవిద్యా న పున ర్భవిష్యతి. ౧౯

---

మాయామోహితుడై శరీరాదులయందు ఆత్మత్వము గలిగి యుండునంతదనుక, విధివిహితములైన కర్మముల నాచరింపవలెను. నేతినేతి వాక్యములద్వారా అనాత్మవస్తునిషేధముతో, ఆత్మవస్తువును దెలిసికొనినపిమ్మట, సమస్తకర్మములను విడిచి వేయవలెను. ౧౭

పరమాత్మజీవాత్మల భేదమును దూరము చేయుచు, విజ్ఞానము తనయందు భాసించుకొలది, సంసారకారణకర్మమంతయు, ఉపకరణములతోగూడ లయము నొందును. ౧౮

శ్రుతిప్రమాణములచే వినాశితమైన కర్మము, మరల ఎట్లు తనపనిని సాగింప గలుగును ? ఉత్పన్నమైన విజ్ఞానము అమలము అద్వితీయము నగుటచే, అజ్ఞానము మరల తల యెత్తజాలదు. ౧౯

యది స్మ నష్టా న పునః ప్రసూయతే
కర్తా౽హ మస్మీతి మతిః కథః భవేత్?
తస్మాత్ స్వతంత్రా న కిమ ప్యపేక్షతే
విద్యా విమోక్షాయ విభాతి కేవలా. ౨౦

సా తైత్తిరీయశ్రుతి రాహ సాదరం
న్యాసం ప్రశస్తాఖిలకర్మణాం స్ఫుటమ్,
ఏతావ ది త్యాహ చ వాజినాం శ్రుతిః
జ్ఞానం విమోక్షాయ, న కర్మ సాధనమ్. ౨౧

విద్యాసమత్వేన తు దర్శిత స్త్వయా
క్రతు ర్న దృష్టాంత ఉదాహృత స్సమః,
ఫలైః పృథక్త్వా ద్బహుకారకైః క్రతు
స్సంపాద్యతే జ్ఞాన మతో విపర్యయమ్. ౨౨

---

నశించిపోయిన అజ్ఞానము, మరల కలుగనప్పుడు, ఇక, నేను కర్త నను బుద్ధి యెట్లు కలుగును? కావున, జ్ఞానము స్వతంత్ర మైనది. జీవునకు మోక్షము నిచ్చుటయందు దానికి ఇతరాపేక్ష లేదు. ౨౦

అంతియగాక, సకలకర్మసంన్యాసము ఉత్తమ మని తైత్తిరీయశ్రుతి చెప్పుచున్నది. విమోక్షమునకు జ్ఞానమే సాధనము కాని, కర్మ కా దని వాజసనేయశ్రుతి చెప్పుచున్నది. ౨౧

నీవు (అనగా వితర్క-వాది) జ్ఞానమునకు యజ్ఞమును దృష్టాంతముగా జెప్పినావు. అది సరియైనది కాదు. ఎందువలన నన____ రెంటి ఫలములు భిన్నభిన్నములుగా నున్నవి. యజ్ఞము, యజమాన ఋత్విగాది బహుళ కారకములతో సిద్ధ మగుచున్నది. జ్ఞానము అట్లు కారకసాధ్యము కాదు. ౨౨

సప్రత్యవాయో హ్యహ మిత్యనాత్మధీ
రజ్ఞప్రసిద్ధా న తు తత్త్వదర్శినః,
తస్మా ద్బుధై స్త్యాజ్య మపి క్రియాత్మభి
ర్విధానతః కర్మ విధిప్రకాశితమ్. ౨౩

శ్రద్ధాన్విత స్తత్త్వమసీతి వాక్యతో
గురోః ప్రసాదా దపి శుద్ధమానసః,
విజ్ఞాయ చైకాత్మ్య మథాత్మజీవయో
స్సుఖీ భవే న్మేరు రివాప్రకంపనః. ౨౪

ఆదౌ పదార్థావగతి ర్హి కారణం
వాక్యార్థవిజ్ఞానవిధౌ విధానతః,
తత్త్వంపదార్థౌ పరమాత్మజీవకా
వసీతి చైకాత్మ్య మథానయో ర్భవేత్. ౨౫

---

కర్మమును జేయకుండిన నేను తప్పక ప్రాయశ్చిత్తమును పొందుదును అనుబుద్ధి, అజ్ఞానికి ఉండునుగాని జ్ఞానికి లేదు. అందువలన, వికారరహితమైన చిత్తము గల జ్ఞానులు, విధి ప్రకాశితమైన వివిధకర్మమును విడనాడవలెను. ౨౩

శ్రద్ధావంతుడై, గురుప్రసాదమున తత్త్వమసి వాక్యము ద్వారా, జీవాత్మపరమాత్మల యైక్యము నెఱిగికొని, మేరువు వలె నిశ్చలుడై సుఖి కావలెను. ౨౪

మొదట, వాక్యార్థము నెఱిగికొనుటకు, పదముల యర్థము నవగాహనము చేసికొనవలెను. తత్, త్వం, పదములకు, వరుసగా పరమాత్మ, జీవాత్మ, అని అర్థము. అసి అనగా ఈ రెంటికిని ఐక్యము అని అర్థము. ౨౫

ప్రత్యక్పరోక్షాదివిరోధ మాత్మనో
ర్విహాయ సంగృహ్య తయో శ్చిదాత్మతామ్,
సంశోధితాం లక్షణయా చ లక్షితాం
జ్ఞాత్వా స్వ మాత్మాన మథాద్వయో భవేత్. ౨౬

ఏకాత్మకత్వా జ్జహతీ న సంభవే
త్తథాఽజహల్లక్షణతా విరోధతః,
సోఽయంపదార్థా వివ భాగలక్షణా
యుజ్యేత తత్త్వంపదయో రదోషతః. ౨౭

రసాదిపంచీకృతభూతసంభవం
భోగాలయం దుఃఖసుఖాదికర్మణామ్,
శరీర మాద్యంతవ దాదికర్మజం
మాయామయం స్థూల ముపాధి మాత్మనః. ౨౮

---

జీవాత్మ పరమాత్మలకు, ప్రత్యక్ పరోక్షాది విరోధ మును వదలివేసి, లక్షణావృత్తిలక్షిత మైన వాని చిదాత్మత్వ మును బాగుగా దెలిసికొని, అదియే స్వాత్మగా నెఱిగి, ఈపిధ మున అద్వితీయుడు అగును. ౨౬

ఈ తత త్వం పదార్థముల విషయమై, ఒకేరూపము గల దనుటచేత, జహల్లక్షణగాని, విరుద్ధ మగుటచేత, అజహల్ల క్షణగాని, ఘటిల్ల నేరదు. వాడే వీడు అని చెప్పు సః అయం పదార్థములయందు వలె, తత్ త్వం పదములకు, దోషము లేని దగుటచేత, భాగత్యాగ లక్షణను గ్రహింపవలెను. ౨౭

పంచీకృతము లైన పృథివ్యాదులవలన పుట్టి, సుఖదుః ఖాది కారణమై, చావు పుట్టువులు కలిగి, ప్రారబ్ధమువలన

సూక్ష్మం మనోబుద్ధిదశేంద్రియై ర్యుతం
ప్రాణై రపంచీకృతభూతసంభవమ్,
భోక్తు స్సుఖాదే రనుసాధనం భవే
చ్ఛరీర మన్య ద్విదు రాత్మనో బుధాః. ౨౯

అనా ద్యనిర్వాచ్య మపీహ కారణం
మాయాప్రధానం తు పరం శరీరకమ్,
ఉపాధిభేదా త్తు యతః పృథక్ స్థితం
స్వాత్మాన మాత్మ న్యవధారయేత్ క్రమాత్. ౩౦

కోశే ష్వయం తేషు తు తత్త దాకృతి
ర్విభాతి సంగాత్ స్ఫటికోపలో యథా,

---

మరల మరల బుట్టుచు, మాయామయ మైన యీ శరీరము, జీవునకు స్థూలోపాధి యని చెప్పబడుచున్నది. ౨౮

మనో బుద్ధి దశేంద్రియములు కలిగి, అపంచీకృతము లైన భూతములవలన బుట్టి, సుఖాద్యనుభవమునకు సాధనమైన శరీరమును, విద్వాంసులు, జీవునకు సూక్ష్మ శరీర మని చెప్పుదురు. ౨౯

అనాది, అనిర్వాచ్యము, మాయామయము, నగు కారణ శరీరము, జీవునకు మూడవ శరీర మని చెప్పబడుచున్నది. ఇట్లు ఉపాధిభేదముచే సర్వథా వేఱుగా నున్న ఆత్మస్వరూపమును క్రమముగా తనహృదయమున నిశ్చయము చేసికొనవలెను. ౩౦

ఆత్మ, ఆయా కోశములయందు తత్సంగమువలన, స్ఫటికమువలె, తత్తదాకృతిని గొని వెలుగొందును. బాగుగా విచా

అసంగరూపోఽయ మజోఽ మృతోఽద్వయో
విజ్ఞాయతేఽస్మిన్ పరితో విచారితే. ౩౧

బుద్ధే స్త్రిధా వృత్తి రపీహ దృశ్యతే
స్వప్నాదిభేదేన గుణత్రయాత్మనః,
అన్యోన్యతోఽ స్మిన్ వ్యభిచారతో మృషా
నిత్యే పరే బ్రహ్మణి కేవలే శివే. ౩౨

దేహేంద్రియప్రాణమనశ్చిదాత్మనాం
సంఘా దజస్రం పరివర్తతే ధియః,
వృత్తి స్తమోమూలతయాఽజ్ఞలక్షణా
యావ ద్భవే త్తావ దసౌ భవోద్భవః. ౩౩

---

రించినచో, ఈ ఆత్మ, అద్వితీయ మగుటచే, సంగము లేనిది, పుట్టనిది అని నిశ్చయ మగును. ౩౧

త్రిగుణాత్మక యగు బుద్ధికి, స్వప్నాదిభేదముచే త్రివిధమైన వృత్తి, గోచరించుచున్నది. కాని, ఈ మూడువృత్తులు, ఒకొక్కటి రెండవదానిలో వ్యభిచరించుచుండుకతన, నిత్యము, పరము, కేవలము, శివము, నగు బ్రహ్మమునందు లేవు. ౩౨

దేహేంద్రియ మన శ్చిదాత్మల సంగమువలన, బుద్ధి వృత్తి, నిరంతరము పరివర్తన నొందుచుండును. ఈ వృత్తి తమోమూలకము. కావున, అజ్ఞానమయ మని తెలిసికొనవలెను. ఇది యుండునంతవఱకు, సంసారము కలుగుచునే యుండును. ౩౩

నేతి ప్రమాణేన నిరాకృతాఖిలో
హృదా సమాస్వాదితచిద్ఘనామృతః,
త్యజే దశేషం జగ దాత్తసద్రసం
పీత్వా యథాంభః ప్రజహాతి తత్ఫలమ్. ౩౮

కదాచి దాత్మా న మృతో న జాయతే
న క్షీయతే నాపి వివర్ధతేఽనవః,
నిరస్తసర్వాతిశయ స్సుఖాత్మకః
స్వయంప్రభ స్సర్వగతోఽయ మద్వయః. ౩౫

ఏవంవిధే జ్ఞానమయే సుఖాత్మకే
కథం భవో దుఃఖమయః ప్రతీయతే?
అజ్ఞానతోఽధ్యాసవశాత్ ప్రకాశతే
జ్ఞానే విలీయేత విరోధతః క్షణాత్. ౩౬

---

నేతినేతి వాక్య ప్రమాణములద్వారా సమస్తమును త్రోసిపుచ్చి, హృదయమున చిద్ఘనామృతము నాస్వాదించి, జగత్తు నెఱిగి, సారభూత మగు బ్రహ్మమును గ్రహించి, ఆ జగత్తును, కొబ్బరినీరు త్రాగినవెనుక పైడెక్కనువలె, విడిచి వేయవలెను. ౩౮

ఆత్మ యెన్నడును పుట్టదు. గిట్టదు. తఱుగదు. పెరుగదు. ప్రాతది కాదు. అన్నిటికంటెను అతిశయితమైనది. సుఖాత్మకము. స్వయంప్రభము. సర్వగతము. అద్వయమును. ౩౫

ఇట్లు జ్ఞానమయమై సుఖాత్మకమైన దానియందు, దుఃఖమయ మైన సంసారము ఎట్లు ప్రతీయమాన మగును ? అధ్యాస వశమున, అజ్ఞానమువలన, ఇది కనిపించును. జ్ఞానము అజ్ఞానము

యదన్య దన్యత్ర విభావ్యతే భ్రమా
దధ్యాస మిత్యాహు రముం విపశ్చితః,
అసర్పభూతే హి విభావనం యథా
రజ్జ్వాదికే తద్వ దపీశ్వరే జగత్. ౩౭

నికల్పమాయారహితే చిదాత్మకే
హంకార ఏష ప్రథమః ప్రకల్పితః,
అధ్యాస ఏవాత్మని సర్వకారణే
నిరామయే బ్రహ్మణి కేవలే పరే. ౩౮

ఇచ్ఛాది రాగాది సుఖాది ధర్మికా
స్సదా ధియ స్సంసృతిహేతవః పరే,

---

కంటె విరుద్ధము కావున, నిది, జ్ఞానముద్వారా క్షణములో లయించిపోవును. ౩౬

భ్రాంతివశమున ఒకదానియందు మఱొకదాని ప్రతీతి కలుగుటయే అధ్యాస, యని విద్వాంసులు చెప్పుచున్నారు. సర్పము కాని త్రాడు మున్నగువానియందు సర్పభ్రాంతి కలుగునట్లే, ఈశ్వరునియందును జగద్భ్రాంతి కలుగుచున్నది. ౩౭

వికల్పము మాయ లేకుండ, సర్వకారణమై నిరామయమై కేవలమై చిదాత్మకమై యుండు పరబ్రహ్మమునందు ప్రప్రథమమున, అహంకారరూప మగు ఈ అధ్యాసము, ప్రకల్పిత మయ్యెను. ౩౮

ఆత్మయందు ఇచ్ఛ, అనిచ్ఛ, రాగము, ద్వేషము, సుఖము, దుఃఖము, ఇత్యాది ధర్మములు గల బుద్ధివృత్తులు కలిగి, సంసారమునకు హేతువు లగుచున్నవి. అంతియే. నిద్ర-

యస్మాత్ప్రసుప్తౌ తదభావతః పర
స్సుఖస్వరూపేణ విభావ్యతే హి నః. ౩౯

అనాద్యవిద్యోద్భవబుద్ధిబింబితో
జీవః ప్రకాశోఽయ మితీర్యతే చితః,
ఆత్మా ధియ స్సాక్షితయా పృథక్ స్థితో
బుద్ధ్యాఽపరిచ్ఛిన్నపర స్స ఏవ హి. ౪౦

చిద్బింబసాక్ష్యాత్మధియాం ప్రసంగత
స్త్వేకత్ర వాసా దనలాక్తలోహవత్,
అన్యోన్య మధ్యాసవశాత్ ప్రతీయతే
జడాజడత్వం చ చిదాత్మచేతసోః. ౪౧

గురో స్సకాశా దపి వేదవాక్యత
స్సంజాతవిద్యానుభవో నిరీక్ష్య తమ్,

పోయినపుడు అ వన్నియు లేక లయించిపోవుటచే, ఆత్మ సుఖ స్వరూపముగానే భాసించును గదా! ౩౯

అనాది యగు నవిద్యవలన బొడమిన బుద్ధియందు ప్రతిబింబించిన చిత్ప్రకాశమే జీవు డనబడును. బుద్ధికి సాక్షియై, దానికంటె వేఱుగా నుండి, బుద్ధిపరిచ్ఛిన్నుడు గానివాడే పరమాత్మ.

అగ్నిచే గాల్పబడిన లోహమున వలె, చిదాభాసు డగు ఆత్మ, బుద్ధి, ఒకేచోట నుండుటచేత, పరస్పరాధ్యాసము కలిగి, వానివాని చేతనతాచేతనత్వములు ఒండొంట స్ఫురించును. ౪౧

గురూపదేశమువలనను, వేదవాక్యములవలనను, జ్ఞానానుభవము గలిగించి, హృదయస్థితమై ఉపాధివర్జితమైన ఆత్మను

స్వాత్మాన మాత్మస్థ ముపాధివర్జితం
త్యజే దశేషం జడ మాత్మగోచరమ్. ౪౨

ప్రకాశరూపోఽహ మజోఽహ మద్వయోఽ
సకృ ద్విభాతోఽహ మతీవ నిర్మలః,
విశుద్ధవిజ్ఞానఘనో నిరామయ
స్సంపూర్ణ ఆనందమయోఽహ మక్రియః. ౪౩

సదైవ ముక్తోఽహ మచింత్యశక్తిమా
నతీంద్రియజ్ఞాన మవిక్రియాత్మకః,
అనంతపారోఽహ మహర్నిశం బుధై
ర్విభావితోఽహం హృది వేదవాదిభిః. ౪౪

---

లెన్నగా దెలిసికొని, ఆత్మయందు ప్రతీయమాన మగు దేహాది జడపదార్థములను ద్రోసివేయవలెను. ౪౨

నేను, ప్రకాశస్వరూపుడను. అజుడను. అద్వితీయుడను. నిరంతర భాసమానుడను. అతినిర్మలుడను. విశుద్ధ విజ్ఞాన ఘనుడను. నిరామయుడను. సంపూర్ణుడను. ఆనందమయుడను. అక్రియుడను. ౪౩

నేను, సర్వదా ముక్తుడను. అచింత్య శక్తిమంతుడను. అతీంద్రియ జ్ఞాన స్వరూపుడను. అవికారాకారుడను. అనంత పారుడను. వేదవాదు లగు విద్వాంసులు నన్ను నిరంతరము తమ హృదయములలో జింతించుచుందురు. ౪౪

ఏవం సదాత్మాన మఖండితాత్మనా
విచారమాణస్య విశుద్ధభావనా,
హన్యా దవిద్యా మచిరేణ కారకై
రసాయనం యద్వ దుపాసితం రుజః. ౭౫

వివిక్త ఆసీన ఉపారతేంద్రియో
వినిర్జితాత్మా విమలాంతరాశయః,
విభావయే దేక మనన్యసాధనో
విజ్ఞానదృ క్కేవల ఆత్మసంస్థితః. ౭౬

విశ్వం య దేత త్పరమాత్మదర్శనం
విలాపయే దాత్మని సర్వకారణే,
పూర్ణ శ్చిదానందమయోఽవతిష్ఠతే
న వేద బాహ్యం న చ కించి దాంతరమ్. ౭౭

---

ఇట్లు అనవరతము అఖండవృత్తితో ఆత్మచింతనము గావించువాని యంతఃకరణమున నుదయించిన విశుద్ధభావన, నియమానుసారముగా సేవింపబడిన ఔషధము రోగమునువలె, వెంటనే అజ్ఞానమును నశింపజేయును. ౭౫

ఏకాంతస్థలమున గూరుచుండి, విషయములనుండి యింద్రియముల నరికట్టి, అంతఃకరణమును జయించి, ఆత్మస్థితుడై, ఇతర ఆశ్రయము నేదియు గొనక, శుద్ధచిత్తుడై ఆత్మచింతన పరాయణు డగువాడు, కేవల విజ్ఞానదృష్టిద్వారా అద్వితీయు డగు నాత్మను భావన చేయవలెను. ౭౬

ఈ విశ్వము పరమాత్మస్వరూపమే అని భావించి, సర్వకారణ మగు పరమాత్మయందు లీనము చేయవలెను. ఇట్లు

పూర్వం సమాధే రఖిలం విచింతయే
దోంకారమాత్రం సచరాచరం జగత్,
త దేవ వాచ్యం ప్రణవో హి వాచకో
విభావ్యతేఽజ్ఞానవశా న్న బోధతః. ౪౮

అకారసంజ్ఞః పురుషో హి విశ్వకో
హ్యుకారక స్తైజస ఈర్యతే క్రమాత్,
ప్రాజ్ఞో మకారః పరిపఠ్యతేఽఖిలై
స్సమాధిపూర్వం న తు తత్త్వతో భవేత్. ౪౯

విశ్వం త్వకారం పురుషం విలాపయే
దుకారమధ్యే బహుధా వ్యవస్థితమ్,

---

పరిపూర్ణుడై చిదానందరూపమున నుండునాతడు, లోపల గాని, వెలుపలగాని, దేనిని జూడడు. ౪౭

సమాధికి బూర్వము, ఈ చరాచర జగ మంతయు ఓం కారమాత్రమే అని చింతింపవలెను. ఈ సంసారము వాచ్యము. ప్రణవము తద్వాచకము. అజ్ఞానవశమున ఈ సంసారము, ప్రతీయమాన మగును. జ్ఞానము కలిగినవెంటనే అది లయించును. ౪౮

అకారము విశ్వవాచకు డగు పురుషుడు (జాగ్రదభిమాని); ఉకారము తైజసుడు (స్వప్నాభిమాని); మకారము ప్రాజ్ఞుడు (సుషుప్త్యభిమాని); అని వచింతురు. ఈ వ్యవస్థ సమాధికి పూర్వమే కలదుగాని, తత్త్వావమర్శమున మాత్ర మిది లేదు. ౪౯

అకారరూపు డగు విశ్వుని, ఉకారమునందును; ఉకారరూపు డగు తైజసుని, మకారమునందును, లీనము చేయువలెను.

తతో మకారే ప్రవిలాప్య తైజసం
ద్వితీయవర్ణం ప్రణవస్య చాంతిమే. ౫౦

మకార మ ప్యాత్మని చిద్ఘనే పరే
విలాపయేత్ ప్రాజ్ఞ మపీహ కారణమ్,
సోఽహం పరం బ్రహ్మ సదా విముక్తిమ
ద్విజ్ఞానదృ జ్ముక్త ఉపాధితోఽమలః. ౫౧

ఏవం సదా జాతపరాత్మభావనః
స్వానందతుష్టః పరివిస్మృతాఖిలః,
ఆస్తే స నిత్యాత్మసుఖప్రకాశక
స్సాక్షా ద్విముక్తోఽచలవారిసింధువత్. ౫౨

ఏవం సదాభ్యస్తసమాధియోగినో
నివృత్తసర్వేంద్రియగోచరస్య హి,

---

కారణాత్మము ప్రాజ్ఞరూపము నగు మకారమును, చిద్ఘనరూప పరమాత్మయందు లీనము చేయవలెను. అంతట, నిత్యముక్త, విజ్ఞానస్వరూప, ఉపాధిరహిత, నిర్మల, పరబ్రహ్మమే నేను, అని భావింపవలెను. ౫౧

ఇట్లు ఎల్లప్పుడు పరమాత్మభావన చేయుచు, చేయుచు, ఆత్మానందమున మునిగి, దృశ్యప్రపంచము నంతయు మఱచి, నిత్యము ఆత్మానందము ననుభవించు నాతడు, తరంగములులేని సముద్రమువలె నిశ్చలుడై, సాక్షాత్తు ముక్తు డగును. ౫౨

ఇట్లు నిరంతర సమాధి యోగాభ్యాస పరాయణుడై, సర్వేంద్రియ విషయ విముఖుడై, కామక్రోధాది రిపువర్గము

వినిర్జితాశేషరిపో రహం సదా
దృశ్యో భవేయం జితషడ్గుణాత్మనః. ౫౩

ధ్యాత్వైవ మాత్మాన మహర్నిశం ముని
స్తిష్ఠే త్సదా ముక్తసమస్తబంధనః,
ప్రారబ్ధ మశ్న న్నభిమానవర్జితో
మ య్యేవ సాక్షాత్ ప్రవిలీయతే తతః. ౫౪

ఆదౌ చ మధ్యే చ తథైవ చాంతతో
భవం విదిత్వా భయశోకకారణమ్,
హిత్వా సమస్తం విధివాదచోదితం
భజేత్ స్వ మాత్మాన మథాఖిలాత్మనామ్. ౫౫

ఆత్మ న్యభేదేన విభావయ న్నిదం
భవ త్యభేదేన మయాఽఽత్మనా తదా,

---

నంతయు గెలిచి, మనస్సును పంచజ్ఞానేంద్రియములను వశపఱుచుకొను యోగికి నేను సాక్షాత్కరింతును. ౫౩

రేయుంబవళ్లు ఇట్లు ఆత్మచింతనము గావించుచు, ముని యగువాడు, సమస్తకర్మబంధములనుండి విముక్తుడై, అభిమానమును వదలి, ప్రారబ్ధము ననుభవించుచు, ఉండి, తుట్టతుదకు నాయందే లయ మొందును. ౫౪

మొదట, నడుమ, చివర, ఎల్లెడ, సంసారము భయశోకాదికారణమే, అని తెలిసికొని, విధివాదచోదిత మైన కర్మజాతము నంతయు విడిచి, అఖిలాత్మ యగు పరమాత్మను సేవింపవలెను. ౫౫

యథా జలం వారినిధౌ, యథా పయః
క్షీరే, వియ ద్వ్యో మ్న్యనిలే యథాఽనిలః. ౫౬

ఇత్థం య దీక్షేత హి లోకసంస్థితో
జగ న్మృషైవేతి విభావయ న్మునిః,
నిరాకృతత్వా చ్ఛ్రుతియుక్తిమానతో
య థేందుభేదో దిశి దిగ్భ్రమాదయః. ౫౭

యావ న్న పశ్యే దఖిలం మదాత్మకం
తావ న్మదారాధనతత్పరో భవేత్,
శ్రద్ధాలు రత్యూర్జితభక్తిలక్షణో
య స్తస్య దృశ్యోఽహ మహర్నిశం హృది. ౫౮

---

సముద్రమునందు జలము, పాలలో పాలు, మహాకాశమున ఘటాకాశము, వాయువునందు వాయువు, ఒకటియే యగునట్లు, ఈ సమస్తమును ఆత్మకంటె భిన్నము కా దని తలచువాడు, పరమాత్మకంటె నభిన్నుడై యుండును. ౫౬

దృశ్యమాన మగు నిది యంతయు, శ్రుతి యుక్తి ప్రమాణములతో బాధితమై నిరాకృత మగుటవలన, ఒకే చంద్రునియందు అనేకభ్రమ, ఒకేదిక్కునందు అనేకదిక్కుల భ్రమ, కలుగునట్లు. మిథ్యయే యని తలచుచు, మునియగువాడు, లోకస్థితు డయ్యు, లోకము నిట్లు చూచుచుండవలెను.

ఈ సమస్తమును మదాత్మకమునుగా జూడనంతపర్యంతము, నన్ను ఆరాధించుచునే యుండవలెను. శ్రద్ధ గలిగి, గాఢమైన భక్తితో నుండువాని హృదయమున అహర్నిశము నేను సాక్షాత్కరించు చుందును. ౫౮

రహస్య మేత చ్ఛ్రుతిసారసంగ్రహం
మయా వినిశ్చిత్య తవోదితం ప్రియ !
య స్త్వేత దాలోచయ తీహ బుద్ధిమాన్
స ముచ్యతే పాతకరాశిభిః క్షణాత్. ౫౯

భ్రాత ! ర్యదీదం పరిదృశ్యతే జగ
న్మాయైవ సర్వం పరిహృత్య చేతసా,
మద్భావనాభావితశుద్ధమాన స
స్సుఖీ భ వానందమయో నిరామయః. ౬౦

య స్సేవతే మా మగుణం గుణా త్పరం
హృదా కదా వా యదివా గుణాత్మకమ్,
సోఽహం, స్వపాదాంచితరేణుభిః స్పృశన్
పునాతి లోకత్రితయం యథా రవిః. ౬౧

---

ఇది, రహస్యము, శ్రుతిసారసంగ్రహము నై నది. దీనిని బాగుగా నిశ్చయించి, అత్యంతము ప్రియుడవు గావున నీకు నేను చెప్పితిని. దీనిని బాగుగా విచారించువాడు, పాతకములనుండి క్షణములో విముక్తు డగును. ౫౯

తమ్ముడా ! ఈ కనబడు జగ త్తంతయు మాయయే. దీనిని నీమనస్సుతో త్రోసివేసి, నాభావనచే పరిశుద్ధమైన మనస్సుతో, ఆనందమయుడవై, నిరామయుడవై, సుఖము నొందుము. ౬౦

అగుణుడను, గుణాతీతుడను, గుణాత్మకుడను, నగు నన్ను ఎన్నడేని, ఏమాత్రమేని, మనస్సున నిలిపి కొలుచునాతడు, నిజముగా నాస్వరూపమే. ఆతడు, తన చరణ పరాగముల స్పర్శమున, సూర్యుడువలె, లోకత్రయమును పవిత్రీకరించును.

విజ్ఞాన మేత దఖిలం శ్రుతిసార మేకం
వేదాంతవేద్యచరణేన మయైవ గీతమ్,
యః శ్రద్ధయా పరిపఠే ద్గురుభక్తియుక్తో
మద్రూప మేతి యది మద్వచనేషు భక్తిః. ౬౨

ఇతి శ్రీమదధ్యాత్మరామాయణే ఉమామహేశ్వరసంవాదే
ఉత్తరకాండే శ్రీరామగీతా నామ పంచమః సర్గః.



---

ఇది, సమస్తశ్రుతి సారభూత మైన ఉత్తమ విజ్ఞానము. వేదాంతవేద్యచరణుడ నైన నేను, నీ కిది బోధించినాను. గురుభక్తి కలిగి, ఎవడు దీనిని పఠించునో, వాడు, నాపలుకులయందు భక్తి కలవా డగునేని, నారూపమునే పొందును. ౬౨

ఇది, శ్రీమ దుమామహేశ్వర సంవాదరూప మగు అధ్యాత్మ
రామాయణమున ఉత్తరకాండమున శ్రీరామగీత
యను నైదవ సర్గము.



# ౯ యమగీత

విష్ణుతత్త్వప్రతిపాదకము లైన పురాణములకు మూలము శిరోభూతము నగు విష్ణుపురాణమున యమగీత వర్ణింపబడినది. ఇది, పరాశర మైత్రేయ సంవాద రూపమున నున్నది.

సప్తద్వీపములు, సప్తపాతాళములు, సప్తలోకములు, మున్నగున వన్నియు బ్రహ్మాండములో నిమిడి యున్నవి ఇవి యన్నియు స్థూల, స్థూలతర, స్థూలతమ, సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ, జీవజాలములతో నిండి యున్నవి. ఈ యావ త్బ్రహ్మాండ భాండమున కర్మబంధములతో బంధింపబడని జీవులులేని స్థానము, నలుసంతేనియు గానరాదు. తమయాయుపు పూర్తి యైన పిమ్మట, ఈ సమస్త జీవులు, యమునిబారి బడి, ఆయన విధించు యాతనల ననుభవింపవలసి యుండును. అవి యన్నియు ఘోర ఘోర నారకములు. అవి వర్ణనాతీతములు, అతిభయంకరములు. వానియందు జీవు లనుభవించు యాతనలు, ఘోరాతిఘోరములు. అట్టి నరకములబారి బడక, జీవుడు, పుణ్యలోకములకు బోవలె ననిన, నరకద్వారము లగు పాపకర్మములను వదలి, పుణ్యకర్మముల నాచరింపవలెను అట్టి పుణ్యకర్మముల స్వరూప స్వభావములనే, ఈ యమగీత యను పేర పరాశరమహర్షి, జిజ్ఞాసువైత న్నడిగిన మైత్రేయునకు, యముడు స్వయముగా తనకింకరులకు ఆదేశించినక్రమమున వివరించెను.

దీని ననుదినము పారాయణావిధానమున మననము చేయువారు, పాప దూరులై, పుణ్యమూర్తు లగుదురు.

కాళింగు డగు బ్రాహ్మణుడు తనకు బోధించిన క్రమమును, భీష్ముడు నకులున కిట్లు బోధించె నని యుపక్రమించి, పరాశరుడు, మైత్రేయున కీ క్రమమున బోధించెను.

## మైత్రేయ ఉవాచ

యథావ త్కథితం సర్వం యత్ పృష్టోఽసి మయా గురో!
శ్రోతు మిచ్ఛా మ్యహం త్వేకం త ద్భవాన్ ప్రబ్రవీతు మే. ౧

స ప్త ద్వీపాని పాతాలవిధయ శ్చ మహామునే!
స ప్త లోకాశ్చ యేఽ న్తస్తాః బ్రహ్మాండస్యాస్య సర్వతః. ౨

స్థూలై స్సూక్ష్మై స్తథా సూక్ష్మ సూక్ష్మాత్ సూక్ష్మతరై స్తథా,
స్థూలాత్ స్థూలతరై శ్చైవ సర్వం ప్రాణిభి రావృతమ్. ౩

అంగుల స్యాష్టభాగోఽపి న సోఽ స్తి మునిస త్తమ!
న స న్తి ప్రాణినో యత్ర కర్మబంధనిబంధనాః. ౪

---

## మైత్రేయు డనెను

గురూ! నే నడిగినది యెల్ల జెప్పినాడవు. ఇంక నొకటి విన గోరుచున్నాను. అది నీవు చెప్పుము. ౧

మహామునీ! స ప్తద్వీపములు, పాతాలములు, సప్తలోకములు, బ్రహ్మాండములో నున్న యివి యన్నియు— ౨

స్థూలములు, సూక్ష్మములు, సూక్ష్మసూక్ష్మములు, సూక్ష్మతరములు, స్థూలతరములు నైన ప్రాణులచే నావరింప బడి యున్నవి. ౩

మునిసత్తమా! కర్మబంధనిబంధనము లైన ప్రాణులు లేని ప్రదేశము, అంగుళములో నెనిమిదవ వం తైనను లేదుగదా! ౪

సర్వే చైతే వశం యాన్తి యమస్య భగవన్! కిల,
ఆయుషోఽన్తే తథా యాన్తి యాతనా స్తత్ప్రచోదితాః. ౫

యాతనాభ్యః పరిభ్రష్టా దేవాద్యా స్వథ యోనిషు,
జంతవః పరివర్తంతే శాస్త్రాణా మేష నిర్ణయః. ౬

సోఽహ మిచ్ఛామి త చ్ఛ్రోతుం యమస్య వశవర్తినః,
న భవన్తి నరా యేన తత్కర్మ కథయస్వ మే. ౭

పరాశర ఉవాచ

అయ మేవ మునే! ప్రశ్నో నకులేన మహాత్మనా,
పృష్టః పితామహః ప్రాహ భీష్మో య త్త చ్ఛృణుష్వ మే. ౮

---

ఈ ప్రాణు లన్నియు, యమునకు లోబడి యుండి, ఆయువు ముగిసినవెనుక తత్ప్రచోదితములైన ఆయా యాతనలను బొందుచుండును; ౫

అట్లు యాతనలను గుడిచి, పిదప దేవాదియోనులయందు మరల బుట్టుచు, జీవులు పరిభ్రమించు చుండును; అని శాస్త్రముల నిర్ణయము. ౬

అందువలన, ఏది యొనరించిన, మానవులు యమునిబారి బడరో, దానిని నేను విన గోరుచున్నాను, సెల విమ్ము. ౭

పరాశరుడు చెప్పెను

మైత్రేయా! నకులుడు ఇదే ప్రశ్నము నడుగగా, పితామహు డగు భీష్ముడు నొడివెను. దానిని నేను చెప్పెదను. వినుము. ౮

భీష్మ ఉవాచ

పురా మమాగతో వత్స! సఖా కాలింగకో ద్విజః,
స మా మువాచ పృష్టో వై మయా జాతిస్మరో మునిః. ౯

తేనాఖ్యాత మిదం సర్వ మిత్థం చైత ద్భవిష్యతి,
తథా చ త దభూ ద్వత్స! యథోక్తం తేన ధీమతా. ౧౦

స పృష్ట శ్చ మయా భూయః శ్రద్దధానేన వై ద్విజః,
య ద్య దాహ న త ద్దృష్ట మన్యథా హి మయా క్వచిత్. ౧౧

ఏకదా తు మయా పృష్ట మేత ద్య ద్భవతోదితమ్,
ప్రాహ కాలింగకో విప్రః స్మృత్వా తస్య మునే ర్వచః. ౧౨

---

భీష్ముఁడు చెప్పెను

వత్సా! సకులా! పూర్వము, నా స్నేహితుడు కలింగ దేశపు బ్రాహ్మణు డొకడు, నాదగ్గఱకు వచ్చి, తా నడుగగా జాతిస్మరు డను ముని తనకు జెప్పినా డని నాకు కొన్ని విషయములను జెప్పెను. ౯

ఆ బుద్ధిశాలి చెప్పిన మాట లన్నియు, అచ్చుగా యథార్థములుగా నాకు తోచినవి. ౧౦

అందువలన నేను మఱింత శ్రద్ధ బూని, అడిగితిని. అపుడాయన చెప్పిన మాటలకు విరుద్ధముగా నా కింతవఱకు గనబడుట లేదు. ౧౧

ఒకనాడు, నేను, నీ వడిగిన విషయమునే అడిగితిని. అపుడా కాలింగుడు, ఆ జాతిస్మరునివాక్యములను స్మరించి, ఇట్లు చెప్పెను. ౧౨

కాళింగ ఉవాచ

జాతిస్మరేణ కథితో రహస్యః పరమో మమ,
యమకింకరయో ర్యోఽభూ త్సంవాద స్తం బ్రవీమి తే. ౧౩

స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే,
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభు రహ మన్యనృణాం నవైష్ణవానామ్. ౧౪

అహ మమరవరార్చితేన ధాత్రా
యమ ఇతి లోకహితాహితే నియుక్తః,
హరిగురువశగోఽస్మి న స్వతంత్రః
ప్రభవతి సంయమనే మమాపి విష్ణుః. ౧౫

కాళింగుడు చెప్పెను

జాతిస్మరుడు, నా కొక పరమరహస్యమును జెప్పినాడు. అది, యమునకు కింకరులకు జరిగిన సంవాదము. అది నీకు జెప్పుచున్నాను, వినుము. ౧౩

పాశహస్తుడై నిలిచిన తన కింకరుని జూచి యముడు, వానిచెవిలో నిట్లు చెప్పెను — ఓయీ! నీవు మధుసూదనుని శరణు పొందినవారి జోలికి బోకుము. నేను విష్ణుభక్తులు కాని యితరులకు మాత్రమే ప్రభుడను. ౧౪

అమరార్చితుడగు బ్రహ్మ, నన్ను, లోకముల పుణ్యపాపములను విచారించుటకు యముడు పేర నియోగించెను. నేను, నిఖిలగురు వగు హరికి లోబడి యుండువాడను గాని, స్వతంత్రుడను గాను. శ్రీమహావిష్ణువు నన్నుగూడ నియమింపగలడు. ౧౫

కటక ముకుట కర్ణికాది భేదైః
కనక మభేద మపీష్యతే యథైకమ్,
సుర పశు మనుజాతి కల్పనాభి
ర్హరి రఖిలాభి రుదీర్యతే తథైకః. ౧౬

క్షితితల పరిమాణవోఽనిలాంతే
పున రుపయాంతి యథైకతాం ధరిత్ర్యాః,
సుర పశు మనుజాదయ స్తథాంతే
గుణకలుషేణ సనాతనేన తేన. ౧౭

హరి మమరవరార్చితాంఘ్రిపద్మం
ప్రణమతి యః పరమార్థతో హి మర్త్యః,
త మపగతసమస్తపాపబంధం
వ్రజ పరిహృత్య యథాఽగ్ని మాజ్యసిక్తమ్. ౧౮

---

బంగారము ఒక్కటియే యయ్యు, కటక ముకుటాది భేదములచే నానావిధములుగా భాసించునట్లు, హరి ఒక్కడే యయ్యు, సుర పశు మనుజాది కల్పనలతో నానాత్వమున భాసించుచున్నాడు. ౧౬

గాలికి రేగిన యీపరమాణువులు, గాలి యడగినవెంటనే భూమిలో నొకటిగా కలిసిపోవునట్లు, గుణవికారములతో నుద్భ వించిన సుర పశు మనుజాదులు, అంతమున మరల సనాతనుడగు నా హరియందే యొకటిగా లీనమై పోవును. ౧౭

సురార్చిత పాద పద్ముడగు శ్రీహరిని పరమార్థముతో నమస్కరించుచు, సమస్తబంధముల నెడసి, ఆజ్యాభిషిక్తమైన అగ్నిహోత్రమువలె వెలుగు మహనీయునిదగ్గఱకు నీవు పోకుము.

ఇతి యమవచనం నిశమ్య పాశీ
యమపురుష స్తమువాచ ధర్మరాజమ్,
కథయ మమ విభో! సమస్తధాతు
ర్భవతి హరేః ఖలు యాదృశోఽస్య భక్తః. ౧౯

యమ ఉవాచ

న చలతి నిజవర్ణధర్మతో యః
సమమతి రాత్మసుహృద్విపక్షపక్షే,
న హరతి న చ హన్తి కించి దుచ్చైః
సితమనసం త మవేహి విష్ణుభక్తమ్. ౨౦

కలికలుష మలేన యస్య నాత్మా
విమలమతే ర్మలినీకృత స్త మేనమ్,

---

అని యముడు వచింపగా విని, పాశధారి యగు కింకరుడు, యమధర్మరాజు నిట్లని యడిగెను—దేవ! సమస్తధాత యగు శ్రీహరికి భక్తు డగువాడు ఎట్లుండునో, నా కెఱిగింపుము. ౧౯

యముడు చెప్పెను

నిజవర్ణధర్మమునుండి చలింపనివాడు, శత్రుమిత్రులయెడ సమబుద్ధిగలవాడు, ఇతరుల ద్రవ్యము నపహరింపనివాడు, ఏ కొంచెమేని హింస చేయనివాడు, నిర్మల మైన మనస్సు కలవాడు, విష్ణుభక్తు డని తెలిసికొనుము. ౨౦

విమలమతి యైన యెవనియాత్మ, కలికలుషముచే మలినితము గాదో, ఎవడు జనార్దనుని మనస్సున నిలిపికొని యుండునో ఆతడు శ్రీహరి కత్యంతము భక్తు డని తెలిసికొనుము. ౨౧

మనసి కృతజనార్దనం మనుష్యం
సతత మవేహి హరే రతీవ భక్తమ్. ౨౧

కనక మపి రహ స్యవేక్ష్య బుద్ధ్యా
తృణ మివ య స్సమవైతి వై పరస్వమ్,
భవతి చ భగవ త్యనన్యచేతాః
పురుషవరం త మవేహి విష్ణుభక్తమ్. ౨౨

స్ఫటికగిరిశిలామలః క్వ విష్ణు?
ర్మనసి నృణాం క్వ చ మత్సరాదిదోషః,
న హి తుహినమయూఖరశ్మిపుంజే
భవతి హుతాశనదీప్తిజః ప్రతాపః. ౨౩

విమలమతి రమత్సరః ప్రశాంతః
శుచిచరితో౽ఖిలస త్త్వమిత్రభూతః,

---

బంగారమే యగుగాక, ఇతరులసొమ్ము జను లెవ్వరు లేనితావున కనబడినను, మట్టివలె జూచువాడును, అనన్యచిత్తమున భగవానుని గొలుచువాడును, నగు పురుషవరుడు విష్ణుభక్తు డని తెలిసికొనుము. ౨౨

స్ఫటికగిరిశిలవలె స్వచ్ఛమైన శ్రీహరి యెక్కడ? మత్సరాది దోష కలుషిత మైన మనుజులమన స్సెక్కడ? (ఈ రెంటికి సంయోగ మెట్లు ఘటిల్లును?) హిమకరునికిరణములలో అగ్నిహోత్రునిజ్వాలల వేడి యుండదుగదా? ౨౩

విమల మైన బుద్ధి గలవాడు, మత్సరరహితుడు, ప్రశాంతుడు, పవిత్రచరిత్రుడు, అఖిలభూత హితరతుడు, ప్రియము లై హితము లై న పలుకులు పలుకువాడు, అభిమానము మాయ

ప్రియహితవచనోఽ_స్తమానమాయో
వసతి సదా హృది తస్య వాసుదేవః. ౨౪

వసతి హృది సనాతనే చ తస్మిన్
భవతి పుమాన్ జగతోఽస్య సౌమ్యరూపః,
క్షితిరస మతిరమ్య మాత్మనోఽంతః
కథయతి చారుతయైవ శాలపోతః. ౨౫

యమనియమవిధూతకల్మషాణా
మనుదిన మచ్యుతస_క్తమానసానామ్,
అపగతమదమానమత్సరాణాం
త్యజ భట! దూరతరేణ మానవానామ్. ౨౬

హృది యది భగవా ననాది రా_స్తే
హరి రసిశంఖగదాధరోఽవ్యయాత్మా,

---

లేనివాడు, నగు వానిహృదయమునందు సదా వాసుదేవుడు వసించును. ౨౪

సనాతను డగు శ్రీహరి తనయందు నిలువగానే, ఆతడు, సమస్త జగత్తునకు సౌమ్యస్వరూపుడుగా నగును. నవనవలాడు సాలవృక్షము, తనసౌందర్యముతోడనే, తనలో నున్న మధుర పార్థివరసమును ప్రకటించునుగదా! ౨౫

యమనియమములతో గలుషముల నడంచుకొని, అను దినము అచ్యుతాస_క్తచిత్తులై, మద మాన మత్సరాదికము లుడిగిన మానవశ్రేష్ఠులకు మీరు దూరముగా నుండుడు. ౨౬

త దఘ మఘవిఘాతక ర్తృభిన్నం
భవతి కథం సతి చాంధకార మర్కే ? ౨౭

హరతి పరధనం నిహంతి జంతూ౯
వదతి తథాఽనృతనిష్ఠురాణి య శ్చ,
అశుభజనితదుర్మదస్య పుంసః
కలుషమతే ర్హృది తస్య నాఽ స్త్యనంతః. ౨౮

న సహతి పరసంపదం వినిందాం
కలుషమతిః కురుతే సతా మసాధుః,
న యజతి న దదాతి య శ్చ సంతం
మనసి న తస్య జనార్దనోఽధమస్య. ౨౯

---

అనాది యగు భగవానుడు, హృదయమున నిలిచెనేని, సకలపాపహారు డగు శ్రీహరిప్రభావమున, ఆతనిపాపము లన్నియు పటాపంచ లగును. సూర్యు డుదయించినవెనుక చీకటియుండునా?

పరధనములను హరించుచు, ప్రాణులను హింసించుచు, అనృతములను నిష్ఠురములను బలుకుచు, మహాపాపమువలన సంభవించిన దుర్మదముతో నిండి, కలుషాత్ము డైనవాని హృదయములో శ్రీహరి లే డని యెఱుగుము. ౨౮

పరసంపదలను సహింపక, పరులను నిందించుచు, దుష్టుడై సాధువులకు అపకారము నాచరించుచు, తనకు గలదానిని యజింపక, దాన మీాక, యుండు కుటిలునిమనస్సులో జనార్దనుడు లే డని తెలిసికొనుము. ౨౯

పరమసుహృది బాంధవే కళత్రే
సుత తనయా పితృ మాతృ భృత్యవర్గే,
శఠమతి రుపయాతి యోఽర్థతృష్ణాం
త మధమచేష్ట మవేహి నాఽస్య భక్తమ్. ౩౦

అశుభమతి రసత్ప్రవృత్తిసక్త
స్సతత మనార్యకుశీలసంగమత్తః,
అనుదినకృతపాపబంధయుక్తః
పురుషపశు ర్న హి వాసుదేవభక్తః. ౩౧

సకల మిద మహం చ వాసుదేవః
పరమపుమాన్ పరమేశ్వర స్స ఏకః,
ఇతి మతి రచలా భవ త్యనంతే
హృదయగతే వ్రజ తా న్విహాయ దూరాత్. ౩౨

---

మిత్రులయందు, బంధువులయందు, కళత్రమునందు, సుతులయందు, సుతలయందు, తలిదండ్రులయందు, దయ లేక, శఠమతియై, ధనలోభమున వర్తిలు దుష్టచేష్టితుడు, శ్రీహరి భక్తుడు కాడని గుర్తింపుము. ౩౦

దుర్బుద్ధి, అసత్ప్రవృత్తిసక్తుడు, ఎల్లప్పుడు నీచపురుషులతో గూడి మదించినవాడు, అనుదినము పాపముల నాచరించువాడు, నగు పురుషపశువు వాసుదేవభక్తుడు కాడు. ౩౧

ఈ సమస్తము, నేను, పరమపురుషుడు పరమేశ్వరుడు నగు వాసుదేవుడు, నొక్కటియే, అను బుద్ధి, వాసుదేవుడు హృదయగతుడై నంతనే, నిరాఘముగా గలుగును. అట్టి మతి గలవారలకు నీవు దూరముగా బొమ్ము. ౩౨

కమలనయన ! వాసుదేవ ! విష్ణో !
ధరణిధరాఽచ్యుత ! శంఖచక్రపాణే !
భవ శరణ మితీరయంతి యే వై
త్యజ భట దూరతరేణ తా నపాపాన్. 33

వసతి మనసి యస్య సోఽవ్యయాత్మా
పురుషవరస్య న తస్య దృష్టిపాతే,
తవ గతి రథవా మమాస్తి చక్ర
ప్రతిహతవీర్యబలస్య సోఽన్యలోకః. 3౪

కాలింగ ఉవాచ

ఇతి నిజభటశాసనాయ దేవో
రవితనయస్య కిలాహ ధర్మరాజః,

---

కమలనయన! వాసుదేవ ! విష్ణూ ! ధరణిధర ! అచ్యుత ! శంఖచక్రపాణీ ! నీవే నాకు శరణ మగుము ! అని పలుకు పుణ్యాత్ములను, భటుడా ! నీవు దూరమున వదలివేయుము. 33

అవ్యయాత్ము డగు పరమపురుషు డెవనిచిత్తమున నిలుచునో, ఆమహనీయునిదృష్టి ప్రసరించునంతమేరకు, భగవానుని చక్రప్రభావమున స్వబలవీర్యములు నశించిపోవుటచేత, నీవుగాని, నేనుగాని, పోజాలము. అట్టి మహాత్ములు పోవు లోకములువేఱు.

కాలింగుడు చెప్పెను

ఇట్లు సూర్యసూను డగు ధర్మరాజు, తనభటుల నను శాసించుటకై చెప్పెను. దీనిని ఆ జాతిస్మరముని నాకు జెప్పినాడు. నేను దానిని నీకు జెప్పినాను. 3౫

మమ కథిత మిదం చ తేన తుభ్యం
కురువర ! సమ్య గిదం మయాపి చోక్తమ్. ౩౫

భీష్మ ఉవాచ

నకులైత న్సమాఖ్యాతం పూర్వం తేన ద్విజన్మనా,
కలింగదేశా దభ్యేత్య ప్రీతేన సుమహాత్మనా. ౩౬

మయాఽప్యేత ద్యథాన్యాయం సమ్య గ్వత్స ! తవోదితమ్,
యథా విష్ణు మృతే నాన్యత్ త్రాణం సంసారసాగరే. ౩౭

కింకరాః పాశదండాశ్చ న యమో న చ యాతనాః,
సమర్థా స్తస్య యస్యాత్మా కేశవాలంబన స్సదా. ౩౮

---

భీష్ముడు చెప్పెను

నకులుడా ! కలింగదేశమునుండి వచ్చిన ఆ బ్రాహ్మణోత్తముడు, పరమప్రీతితో మున్ను నా కిది చెప్పెను. ౩౬

దానిని నీకు నేను ఉన్న దున్నట్లు చెప్పినాను. విష్ణువు వినా, ఈ సంసారసాగరములో మఱొక రక్షకుడు లేడు. ౩౭

పాశహస్తు లగు యమకింకరులు గాని, యముడుగాని, యమయాతనలుగాని, నిరంతర భగవత్పరాయణ మగు మనస్సు గలవానికి, ఎట్టి భంగమును దెచ్చిపెట్టలేవు. ౩౮

పరాశర ఉవాచ

ఏత న్మునే! సమాఖ్యాతం గీతం వైవస్వతేన యత్,
త్వత్ప్రశ్నానుగతం సమ్యక్ కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి? ౩౮

ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయేఽంశే
యమగీతం నామ సప్తమోఽధ్యాయః.



---

పరాశరుడు చెప్పెను

మైత్రేయా! నీప్రశ్న ననుసరించి, వైవస్వతుడు స్వయముగా చెప్పిన గీతలను నీకు జెప్పినాను. ఇం కేమి విన గోరుచున్నావు? ౩౯

ఇది శ్రీవిష్ణుపురాణమున తృతీయాంశమున
యమగీత మను సప్తమాధ్యాయము.



# ౧౦ వేణుగీత

వేణుగీత శ్రీమద్భాగవతమున దశమస్కంధము ఇరువదియొకటవ యధ్యాయమున నిబద్ధము. ఇందు, శ్రీకృష్ణుడు శరద్రాత్రిసమయమున పండువెన్నెలలో వృందావనమున వేణుగానము నొనరింపగా విని, గోపికలు పరమనిర్వృతలై, తత్పరాయణతతో తాము పరస్పరము వర్ణించుకొనిన విధము గీతమై యున్నది. ప్రాజ్ఞులగువారీవేణుగీత వర్ణనమున నద్భుతమైన అంతరార్థము గలదని వదింతురు. యథార్థమునకు శ్రీకృష్ణుని వేణుగానము ఉపనిషద్గానమే గాని వేఱొండు గాదని పలువుర మతము ఏది యెటులైనను ఇది, శ్రీకృష్ణకథలలో పరమ రమణీయమైన ఘట్టము. గోపికల భక్తినిర్భరత్వము, సర్వాత్మనా తత్పరాయణత్వము, ఇందు స్పష్టముగా గోచరించును.

## శ్రీ శుక ఉవాచ

ఇత్థం శరత్స్వచ్ఛజలం పద్మాకరసుగంధినా,
న్యవిశ ద్వాయునోపేతం సగోగోపాలకోఽచ్యుతః. ౧

కుసుమిత వనరాజి శుష్మి భృంగ
ద్విజకుల ఘుష్ట సరస్సరి న్మహీధ్రమ్,
యదుపతి రవగాహ్య చారయన్ గా
స్సహపశుబాలబల శ్చుకూజ వేణుమ్. ౨

తద్ వ్రజ స్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్,
కాశ్చి త్పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్. ౩

---

## శ్రీశుకుడు చెప్పెను

ఇట్లు గోవులతోడను గోపాలకులతోడను గూడి శ్రీకృష్ణుడు శరత్కాలమున స్వచ్ఛమైన జలము గలిగి, పద్మ సరస్సులలోని సుగంధములను మోచికొని వచ్చు వాయువులతో నిండిన బృందావనమున బ్రవేశించెను. ౧

పూవులు దొడిగి మనోహరములైన వనసమూహము లపై మదించి సంచరించు తుమ్మెదలతో పక్షులతో నిండిన సరస్సులు, సరిత్తులు, మహీధరములు గలిగిన ఆ వనమున గోపాలకులతో బలరామునితో బ్రవేశించి శ్రీకృష్ణుడు గోవులను మేపుచు వేణుగానము నొనరించెను. ౨

మన్మథోద్దీపక మైన ఆ వేణుగానము నాలకించి వ్రజాంగనలు కొందఱు కృష్ణునిపరోక్షమున తమ సఖురాండ్ర కిట్లు వర్ణించి తెలుప మొదలిడిరి. ౩

తద్వర్ణయితు మారబ్ధాః స్మరంత్యః కృష్ణచేష్టితమ్,
నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప! ౪

బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చ మాలామ్,
రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందైః
బృందారణ్యాం స్వపదరమణాం ప్రావిశ ద్గీతకీర్తిః. ౫

ఇతి వేణురవం రాజన్! సర్వభూతమనోహరమ్,
శ్రుత్వా వ్రజస్త్రియ స్సర్వా వర్ణయంత్యోఽభిరేమిరే. ౬

---

పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని లీలావిచేష్టితములను దల పోసి ఆ వేణుగానమును వర్ణింపదొరకొని ఆ వ్రజాంగనలు వ్యాకులచిత్తలై మన్మథోద్వేగవశమున తమ్ము దాము సంబాళించుకొన నేరరైరి. ౪

నెమలిఫించమును తలపై దాల్చి చెవులలో కర్ణికార కుసుమము నలంకరించుకొని, బంగారమువలె కపిశవర్ణమైన పచ్చని పట్టుదువ్వలువ దాల్చి, వైజయంతీ మాలా సమలంకృతుడై, వేయేల? ఉత్తమనటుని వేషమును వేసికొనినట్లు మనోహరుడై యొప్పుచు ఉపనిషద్గీతకీర్తి యగు నా శ్రీకృష్ణుడు తన అధర సుధారసముతో వేణురంధ్రములను బూరించుచు, నిజపదలాంఛ నములతో నలంకరింపబడి పవిత్రీకరింపబడిన బృందారణ్యమును గోపాలకసమూహములతోగూడ బ్రవేశించెను. ౫

పరీక్షిన్మహారాజా! ఇట్లు సర్వభూతమనోహరముగా మొరయింపబడిన ఆ వేణురవమును విని వ్రజాంగన లెల్లరు పర స్పరము వర్ణించుకొని చెప్పుకొనుచు పరమానందము నొందుచు,

గోప్య ఊచుః

అక్షణ్వతాం ఫల మిదం న పరం విదామః
సఖ్యః! పశూనను వివేశయతో ర్వయస్యైః,
వక్త్రం వ్రజేశసుతయో రనువేణుజుష్టం
యై ర్వా నిపీత మనురక్తకటాక్షమోక్షమ్. ౭

చూత ప్రవాళ బర్హ స్తబ కోత్పలాబ్జ
మాలానుపృక్త పరిధాన విచిత్రవేషౌ,
మధ్యే విరేజతు రలం పశుపాలగోష్ఠ్యాం
రంగే యథా నటవరౌ క్వ చ గాయమానౌ. ౮

---

వివశలై శ్రీకృష్ణతాదాత్మ్యమున నొండొరులను గౌగిలించు కొనుచు మహానిర్వృతి నొందిరి. ౬

గోపిక లనిరి

ఓ చెలులారా! కన్నులు గలవారి కిదియే ఫలము గాని, వేఱొండు గానము. అది యేమన — తను స్నేహితులతో గూడ గోవులను బృందావనమున దోలుకొనిపోవుచు నున్న వ్రజనాధకుమారు లగు ఆ బలరామకృష్ణుల, వేణువును పూరించుచు, స్నేహస్నిగ్ధములైన మధురకటాక్షములను బఱపుచు నున్న ఆ సుందరవక్త్రబింబమును తమ నేత్రపుటములతో గ్రోలుటయే సుమా. అట్లు గ్రోలినవారి కన్నులే సఫలములు. ౭

లేలేత మావియిపుళ్ళు, నెమలియీకలు, కలువపూలు, తామరపూలు కలిపి గ్రుచ్చిన దండలు ధరించి, చక్కని పట్టు ఉత్తరీయములను వైచికొని, విచిత్రములైన వేషములతో నొప్పారుచు, ఆ బలరామ కృష్ణు లిరువురు, గానము చేయుచు,

గోప్యః ! కి మాచర దయం కుశలం స్మ వేణు
ర్దామోదరాధరసుధా మపి గోపిభోగ్యామ్,
భుంక్తే స్వయం య దవశిష్టరసం హ్రదిన్యో
హృష్యత్త్వచోఽశ్రు ముముచు స్తరవో యథార్యాః.

బృందావనం సఖి ! భువో వితనోతి కీర్తిం
య ద్దేవకీసుతపదాంబుజలబ్ధలక్ష్మి,

---

గోపాలకసమూహాములనడుమ రంగస్థలమున నుత్తమనటులువలె మిక్కిలి వెలుగొందిరి. ఆహా! ౮

ఓ గోపికలారా ! ఈ వేణువు ఏమి మహాపుణ్యము నొనరించుకొని యున్నది ? ఇది కేవలము తత్పరాయణలమైన మన గోపికలకే అనుభవింపదగిన దామోదరాధరసుధారసమును స్వయముగా ఆపూర్ణముగా అనుభవించుచున్నది. అది అనుభవింపగా మిగిలిన రసమును, ఆ వేణువును తమ జలములతో బెంచిన ఈ సెలయేళ్ళు అనుభవించి వికసించిన కమలవనముల వ్యాజమున రోమాంచములను నించుచున్నవి. తమవంశమున బుట్టిన యీ వేణువును జూచి వృక్షములు కులవృద్ధులు వలె ఆనందాతిశయమున నుబ్బిపోవుచున్న త్వగ్విశేషములతో బాష్పములను విడుచుచున్నవి. ౯

సఖి ! ఈ బృందావనము దేవకీసుతుని పదారవిందచిహ్నములతో నత్యంతశోభ గడించి పరమపవిత్రమై భూలోకమునకు అసమానమైన కీర్తి దెచ్చి విస్తరింపజేయుచున్నది. ఆ గోవిందుని వేణుగానమును విని, ఆ శ్రీకృష్ణుని మందగర్జితముతోడి నీలమేఘమునుగా దలపోసి, మత్తమయూరములు గుంపులు గుంపులై

గోవిందవేణు మను మత్తమయూరనృత్తం
ప్రేక్ష్యాద్రిసా న్వపరతాన్యసము స్తసత్త్వమ్. ౧౦

ధన్యాః స్మ మూఢమతయోఽపి హరిణ్య ఏతా
యా నందనందన ముపాత్తవిచిత్రవేషమ్,
ఆకర్ణ్య వేణురణితం చ సకృష్ణసారాః
పూజాం దదు ర్విరచితాం ప్రణయావలోకైః. ౧౧

కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూపశీలం
శ్రుత్వా చ తత్క్వణితవేణువిచిత్రగీతమ్,

---

ఆనందతాండవము నొనరించుచున్నవి. ఆ మయూరనాట్యము నవలోకించి, ముగ్ధములై యితరవ్యాపారములు మాని తదేకాయత్తములై, సమస్త వనసత్త్వ సముదాయములు అల్లదే ఆ అద్రిసానువున బొమ్మలువలె నిలిచిపోయినవి. ౧౦

ఆహా! అత్యంతము మూఢమతు లయ్యు నీ హరిణాంగనలు మిక్కిలి ధన్యతను గడించుకొనినవి సుమా. ఎందువలన ననఁ— ఇవి విచిత్ర వేష విశేష సంశోభితుఁడైన నందనందనుని కన్నార గాంచియు, మనోహరమైన యాతని వేణుగానమును చెవులార నాలకించియు తమ వల్లభులగు కృష్ణసారములతోఁగూడ ప్రణయభరావలోకనములతో నాతనిని బూజించుచున్నవి. ౧౧

యువతీమనోహర రూప శీల శ్రీసుందరు డగు వ్రజసుందరుని గనియు, అతని విచిత్రవేణుగీతమును వినియు, దేవకాంతలు విమానములలో వచ్చి నిలిచి, మన్మథోద్వేగవశమున సత్త్వములు తూలి, నీవి విడిపోవుటయు నెఱుఁగక కొప్పులలోని,

దేవ్యో విమానగతయః స్మరనున్నసారా
భ్రశ్యత్ప్రసూనకబరా ముముహు ర్వినీవ్యః. ౧౨

గావ శ్చ కృష్ణముఖనిర్గతవేణుగీత
పీయూష ముత్తభితకర్ణపుటైః పిబంత్యః,
శాబాః స్నుతస్తనపయఃకబళా స్మ తస్థు
ర్గోవింద మాత్మని దృశాశ్రుకళాః స్పృశంత్యః. ౧౩

ప్రాయో బతాంబ ! మునయో విహగా వనేఽస్మిన్
కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతమ్,

---

పూవులు రాలిపో దల యూచుచు మోహపరవశలై పోవు చున్నారు. ౧౨

ఆహా ! ఆ గోవులయు గోవత్సములయు భాగ్యము నేమని చెప్పవలె ? ఆగోవులు శ్రీకృష్ణముఖనిర్గతమైన వేణుగీతామృత మును ఎత్తి నిక్కించి పట్టిన కర్ణపుటములతో గ్రోలుచున్నవి. లేగలు తమతల్లులయొద్ద పాలు ద్రావబోవునంతలో నా నంద నందనుని వేణుగీత రవము తమ చెవుల కందగా వెనువెంటనే తమ వ్యాపారములను మాని సెలవులనుండి పాలు, చిన్నిచిన్ని గడ్డివర కలు కాఱిపోగా, చెవులు రిక్కించి అట్లే నిలిచిపోయినవి. ఆహా ! ఆ ఆవులును దూడలును చూపులద్వారమున ఆ శ్రీకృష్ణుని దమమనస్సులో నిడుకొని వానినే చూచుచు, ఆనందమున సన్నని అశ్రువులు రాల్చుచు నున్నవి. ౧౩

అమ్మా ! ఈవనమునందలి ఈ పక్షు లన్నియు మునులు కాబోలు ! ఆహా ! అవి రుచిరములైన చిగురుటాకులతో మనోహరము లగు చెట్లకొమ్మలపై నెక్కి కూర్చుండి,

ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాళాన్
శృణ్వంతి మీలితదృశో విగతాన్యవాచః. ౧౪

నద్య స్తదా త దుపధార్య ముకుందగీత
మావ ర్తలక్షితమనోభవభగ్న వేగాః,
ఆలింగనస్థగిత మూర్మిభుజై ర్మురారే
ర్గృహ్ణంతి పాదయుగళం కమలోపహారాః. ౧౫

శ్రీకృష్ణునిచే గానింపబడిన ఆ మధుర వేణుగీతమును, పరవశమున కన్నులు మూసి ఇతరవాక్కు లుడిగి, వినుచున్నవి. మహార్షు లగువారు శ్రీకృష్ణభగవానుని దివ్యదర్శన మగునట్లు వేదోక్త కర్మఫలపరిత్యాగమున వేదద్రుమశాఖా సమారూఢులై రుచిర ప్రవాళస్థానీయములగు కర్మములనే ఆశ్రయించి సుఖవంతులై అన్య వాక్కులు విడిచి, శ్రీకృష్ణభగవద్గీతమునే ఆలకించు చుందురు గదా! ఈ పక్షులును అట్లే ఆచరించుచున్నవి సుమా. ౧౪

నదులు ఆ ముకుందుని మనోహర వేణుగీతమును విని సుళ్ళతో సూచింపబడిన మనోభవవికారమున వేగము కుంటు పడిపోగా పరవశత్వమున బడి, తరంగములనెడి భుజములతో కమలోపహారముల నర్పించుకొనుచు ముకుందుని పాదారవింద మును గాఢముగా తమకౌగిట మునిగిపోవునట్లు ఆలింగనము చేసికొనుచున్నవి. ఆహా! అవి యెంత వంకరతనమును నేర్చినవి? కమల అనగా లక్ష్మి యను బుద్ధి పొడమించుచు శ్రీకృష్ణునకు కమలము లర్పించి లక్ష్మీదేవిచే పొందదగిన తత్పాదారవింద పరి ష్వంగమును తాము పొందుచున్నవి. ౧౫

